# అపరాధ పరిశోధన

రూ.6 | జనవరి '85 |

133

సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—133

# కొడుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ముఖ్యమంత్రిని చంపాలి!

రచన: టెంపోరావ్

## వజ్రాల దొంగలు

రచన: పి. అరుణ

## నేరస్థుడితో పెళ్ళి

రచన: ప్రతాప రవిశంకర్

## సుజాత కథ

రచన: మిస్. కె. మధుబాల

అగ్నికిరీటం - ఐదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—133
జనవరి, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ముఖ్య మంత్రిని చంపాలి!

టెంపోరావ్

పన్నెండు దాటింది. అందరూ ముందు హాల్లో కూర్చుని వున్నారు. గోడకు జార్లాబడి గచ్చునేల మీద కూర్చు న్నారు.

తల్లి రత్నమ్మ. ఇద్దరు కొడుకులు. ముగ్గురు కూతుళ్ళు. అందరికంటే పెద్దవాడు రవి కళ్ళు మూసుకుని వున్నాడు.

"రవీ, నిన్న తిండిలేదు. ఇవాళ యేదో తినకపోతే వీళ్ళందరూ చస్తారురా!" అంది తల్లి.

తల్లి మాటలు విని రవి తృళ్ళిపడ్తూ లేచి నుంచు న్నాడు. తల్లివంక ప్రేమతో చూశాడు.

"అమ్మా, నేను వెళ్ళి యేదేనా తెస్తాను" అని అతడు బయటకు నడిచాడు.

తల్లి అతడి వెనకనే వెళ్ళింది, గోడ్డుదాకా.

"ఎక్కడి నుంచి తెస్తావురా?"

"నా స్నేహితులను అప్పడిగి తీసుకొస్తాను" అన్నా డతను.

# 4

"దిన దిన గండంగా యీ జీవితం ఎంత కాలం గడవాలో!" అందామె.

అతడు విచారవదనంతో రోడ్డమ్మట నడిచి వెళ్ళిపోయాడు.

రవి బి. ఎ. పాసవగానే తండ్రి మరణించాడు. అతడు ఉద్యోగం కోసం ఎంతగానో ప్రయత్నం చేశాడు. కాని ఎక్కడా ఉద్యోగం చిక్కలేదు. రెండేళ్ళు గడిచిపోయాయి. ఆ రెండేళ్ళలోనూ తండ్రి చనిపోయాక వచ్చిన డబ్బు, తల్లి నగలు, యింట్లోని విలువైన వస్తువులు, అన్నీ ఎగిరిపోయాయి.

ఆలోచిస్తూ రవి తన స్నేహితుడైన వెంకట్ ఇంటికి వెళ్ళాడు. వెంకట్ యింట్లోనే వున్నాడు. గేటుముందు నిలబడి అతడు రవితో మాట్లాడాడు.

"రవీ, యేమిటి సంగతి?" అడిగాడతను.

"నాకు పది రూపాయిలు కావాలి!"

"నా దగ్గరున్న ఆఖరి పది రూపాయిల నోటును వీర్రాజు కిచ్చేశాను, అరగంట క్రితం."

"ఎంతుంటే అంతే యియ్యి!"

"నా జేబులు ఖాళీ! నువ్వే చూసుకో!" అన్నాడు వెంకట్.

"ఒక రూపాయి యిచ్చినా ఫరవాలేదు."

"మై డియర్ ఫ్రెండ్, ఒక పైసా కూడా లేదు. వచ్చేవారం దాకా నాన్న నాకు పోకెట్ మనీ ఇవ్వడు" అన్నాడు వెంకట్.

కోటీశ్వరుని కొడుకు వెంకట్ అలా అంటే తనకి లోకంలో డబ్బెవరు యిస్తారు? మరో ఫ్రెండ్ ఇంటికి వెళ్ళడం వృథా అనిపించింది రవికి.

అతడు రోడ్డమ్మట నడిచి వెళ్ళిపోయాడు. రత్నా స్టోర్స్ ముందుకు వెళ్ళి ఆగాడు, మోడర్న్ బ్రెడ్, బ్రిటానియా బ్రెడ్లు యెన్నో ముందు టేబిల్ మీద వున్నాయి.

రవి అమాంతంగా రెండు బ్రెడ్ పాకెట్లను తన చేతిలోకి తీసుకున్నాడు.

"మొత్తం 4-20 అవుతుంది" అన్నాడు రత్నప్ప సెట్టి.

"చిల్లరుందా?" అడిగాడు రవి.

"ఎంతకి?"

"నూరు రూపాయిల నోటుకి."

"నోటు మార్చి డబ్బు పట్రా!" అన్నాడు సెట్టి.

అతడి మాటల్ని వినకుండా రవి పరుగెత్తాడు.

"వాడిని ఆపండి!" అర్చాడు సెట్టి.

రోడ్డమ్మట రవి పారిపోతున్నాడు. సెట్టి బయట కొచ్చి వెనకనే పరుగెత్తసాగాడు.

చాలా దూరంలో వున్నాడు రవి. కొంతదూరం పరుగెత్తి రత్నప్పసెట్టి ఒగురుస్తూ ఆగాడు. కుడివైపు హెర్నియా కిందకు జారింది. అతడు కదలలేక రోడ్డు వారగా కూర్చుండిపోయాడు.

"దొంగ ముండాకొడుకు. రెండు బ్రెడ్లు పట్టుకు పారిపోయాడు. పోలీసు రిపోర్టిచ్చి వాడికి బుద్ధి చెప్పిస్తాను" అర్చాడు సెట్టి.

రవి తన యింటికి చేరుకున్నాడు. రెండు బ్రెడ్లూ తల్లికి యిచ్చాడు.

"ఇవి కాల్చి వాళ్ళకియ్యమ్మా" అన్నాడతను.

బ్రెడ్డను కాల్చవలసిన అవసరం లేకుండాపోయింది.

6
దాన్ని లాక్కుని పిల్లలు ఆకల్తో తినేశారు. తల్లికీ, రవికీ ఒక్క స్లయిస్ కూడా మిగల్లేదు.

రెండు బ్రెడ్లూ తిని, మంచినీళ్ళు తాగి పిల్లలు నేల మీద పడుకున్నారు.

రవి తల్లి వంక దుఃఖంతో చూశాడు.

"నువ్వు తినలేదమ్మా!" అన్నాడతను.

"నా పిల్లలు తింటే నా ఆకలి తీరినట్లే" అందామె.

"అమ్మా!" అని అతడు ఏడ్వసాగాడు.

2

పదివేలమంది అక్కడ గుమి గూడారు. ముఖ్యమంత్రి విజయచంద్రన్ అనేకమంది పేదవాళ్ళకు కళ్ళజోళ్ళు యిస్తున్నాడు. ముఖ్యమంత్రి వెనక అతడి పెర్సనల్ సెక్యూరిటీ గార్డు సబ్ యిన్స్పెక్టర్ దేవర్ నిలబడి వున్నాడు.

కామరాజు సూటిగా ముఖ్యమంత్రివైపు చూశాడు. అతడి ఒళ్ళు మండుతోంది. రక్తం వేగంగా ప్రవహిస్తోంది!

తనకు యిద్దరే కూతుళ్ళు!

వాళ్ళిద్దరూ పోలీసుల కాల్పులకు బలైపోయారు. కాలేజీకి వెళ్ళినవాళ్ళు యింటికి తిరిగిరాలేదు. గవర్నమెంట్ హాస్పిటల్కి వెళ్ళి తన కూతుళ్ళ శవాల వంక కామరాజు చూశాడు. రెండు శవాలూ వికృతంగా వున్నాయి. ఎంతో సాధనస్సారనుకొన్న అతడి కూతుళ్ళు క్షణంలో మరో లోకానికి చేరుకున్నారు.

ముఖ్యమంత్రి ఆదేశంమీద కాలేజీ ముందు పోలీసులు కాల్పులు సాగించారు. అతడి కూతుళ్ళిద్దరూ కాల్పులకు బలయిపోయారు.

కామరాజు కొంచెం దూరంలో నిలబడి ముఖ్యమంత్రి వైపు చూస్తున్నాడు.

విజయచంద్రన్ నవ్వుతూ అనేకమందికి బహుమతులు యిస్తున్నాడు.

కామరాజు సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి, వదుల్తూ అతడు ముఖ్యమంత్రివంక చూశాడు.

ఆ రోజున షూట్ చేయవలసిన అవసరం యేముంది? ముఖ్యమంత్రి ఎందుకు ఫైర్ చేయమన్నాడు?

కామరాజు మెదడులో ఆలోచనలు తిరుగుతున్నాయి. తన కూతుళ్ళ శవాలను చూశాక కామరాజు ముఖ్యమంత్రిని కల్సుకున్నాడు.

"నా కూతుళ్ళిద్దరూ ఆనాటి ఫైరింగ్‌లో మరణించారు!" అర్చాడతను.

ముఖ్యమంత్రి అతడి భుజంమీద చెయ్యి వేశాడు.

"కామరాజుగారూ, నన్ను క్షమించండి! ఆ నాటి షూటింగ్‌లో యిరవై మంది చనిపోయారు. మీ అమ్మాయిలను చంపాలనే ఉద్దేశంతో నేను షూట్ చేయమనలేదు. స్టూడెంట్లందరూ ఆనాడు బస్సులమీదకు రాళ్ళు విసిరారు. ఎన్ని కార్లనో కాల్చేశారు. అని ఆపడం కోసం షూటింగ్ జరిగింది" అన్నాడు ముఖ్యమంత్రి.

ముఖ్యమంత్రి ముందు కామరాజు ఎక్కువగా మాట్లాడలేకపోయాడు. కాని కామరాజు మనసులో ముఖ్యమంత్రి విజయచంద్రన్ హంతకుడిలా నాటుకుపోయాడు!

ముఖ్యమంత్రి వెళ్ళిపోయాడు. కామరాజు తన కారు వైపు నడిచాడు. కారులో కూర్చుని, తలుపుమూసి అతడు సిగరెట్ వెలిగించాడు. కొంతసేపు తన జీవితం గురించి ఆలోచిస్తూ వుండిపోయాడు.

అతడు లక్షలు గడించాడు. కాని అతడికి వారసులు లేరు. ఇద్దరు కూతుళ్ళూ మరణించారు! తన భార్యకు మెనోపాస్ వచ్చేసింది. ఆమె పిల్లలను కనలేదు!

అతడు కారును పోనిచ్చాడు. రైలుపట్టాల పక్కనున్న రోడ్డమ్మట అతడి కారు వెళ్తోంది.

రైలుపట్టాల మీద ఒకతను అడ్డంగా పడుకొని వున్నాడు. వెనుకనించి ఎలెక్ట్రిక్ ట్రెయిన్ వస్తోంది!

అతడు కారును ఆపాడు. రైలుపట్టాలవైపు పరుగెత్తాడు. పట్టాల మధ్య పడుకొన్న అతడిని బలవంతంగా పక్కకు లాగాడు.

"యూ ఫూల్, చస్తావా?" అగ్నాడు కామరాజు.

"ఇలా జీవించడం కంటే చావడం మేలు" అన్నాడా యువకుడు.

ట్రెయిన్ చప్పుడు చేస్తూ వెళ్ళిపోయింది. కామరాజు ఆ యువకుడిని తన కారువైపు లాక్కువెళ్ళాడు. ముందు సీటుమీద కూర్చోబెట్టి తలుపు మూశాడు. అతను వెళ్ళి స్టీరింగ్ వీల్ వెనక కూర్చున్నాడు.

కామరాజు కారును పోనిచ్చాడు.

"ఎవరు నువ్వు?"

"నా పేరు రవి" అన్నాడతను.

"ఎందుకు అలా చావాలని ప్రయత్నించావు?" అడిగాడు కామరాజు.

"బ్రతికుండి యేమీ చేయలేనపుడు చావడం మంచిదనిపించింది" అన్నాడతను.

"అంతా వివరంగా చెప్పు"

"తల్లీ, ముగ్గురు చెల్లెళ్ళూ, ఒక తమ్ముడూ నాకు వున్నారు. నేను పెద్దవాడిని. బి.ఎ. పాసయ్యాను. నా

కెక్కడా ఉద్యోగం దొరకలేదు. ఇంట్లో నా వాళ్ళు ఆకలితో బాధపడ్డం చూడలేక చావడానికి సిద్ధపడ్డాను."

"నువ్వు చస్తే వాళ్ళ బాధ తగ్గుతుందా? వాళ్ళకు తిండి దొరుకుతుందా?"

"వాళ్ల బాధను చూడకుండా మరో లోకంలో వుండొచ్చు!"

కొంతసేపు కామరాజు మాట్లాడకుండా కారును పోనిచ్చాడు. రోడ్డుదీపాలు వెలుగుతున్నాయి. ఒక హోటల్ ముందు అతడు కారును ఆపాడు.

"ఏదైనా తిందువుగాని రా!"

"నావాళ్ళు తింటేనే గాని నేను తినను!"

"నువ్వు తిని వాళ్లకు పట్టుకు వెళ్ళొచ్చు."

కారు దిగి యిద్దరూ లోపలకు వెళ్లాడు. విశాలమైన హాల్లో లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

ఒక టేబుల్ ముందు యిద్దరూ యెదురెదురుగా కూర్చున్నారు. బేరర్ రాగానే కామరాజు ఆర్డరిచ్చాడు.

ఎదురుగా కూర్చున్న రవి వంక అతడు చూస్తూ వుండిపోయాడు. ముఖ్యమంత్రి పెర్సనల్ సెక్యూరిటీ గార్డు దేవర్‌కీ, రవికీ చాలా పోలికలు వున్నాయి!

"మీరు చాలా మంచివారిలా వున్నారు" అన్నాడు రవి, ఏదో అనాలని.

"మంచి వాళ్ళకు మంచివాడినే" అన్నాడతను క్లుప్తంగా.

"మీ గురించి చెప్పండి."

"తిండిలేక మీరు బాధపడ్తున్నారు. తినేవాళ్ళు లేక

నేను కుమిలిపోతున్నాను” అన్నాడు కామరాజు.

“మీకు పిల్లలు లేరా?”

“ఉన్నారు. నెల క్రితం జరిగిన పోలీస్ షూటింగ్ లో నా యిద్దరు కూతుళ్ళు మరణించారు. వాళ్ళ శవాలను పోలీసులు నాకు అప్పగించారు” అన్నాడు కామరాజు.

బేరర్ యినో్న పదార్థాలను టేబుల్ మీద పెట్టాడు. పెద్ద పాకెట్ ను టేబుల్ మీద వుంచాడు.

“నువ్వు తిను. నేను కాఫీ మాత్రం తాగుతాను” అన్నాడు కామరాజు.

ఆకలితో రవి తినసాగాడు. బేరర్ తెచ్చిన వేడి కాఫీ తాగుతూ కామరాజు సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదిలి అతడు రవివైపు సూటిగా చూశాడు.

“మీ యింట్లోని వాళ్ళు కష్టపడకుండా బతకాలంటే నెలకు ఎంత కావాలి?”

“ఏం చెప్పను సార్? ఎంతొస్తే అంతలోనే మనిషి జీవిస్తూ వుంటాడు.”

“వెయ్యి చాలా?”

“వెయ్యి దొరికితే వాళ్ళు సుఖంగా జీవిస్తారు. ఏ బాధా వుండదు” అన్నాడు రవి.

“ఇటువైన ప్రతి నెలా నేను నీ తల్లికి వెయ్యి రూపాయలు యిస్తాను. నువ్వు పంపావని చెప్తాను.”

అతడివైపు రవి ఆశ్చర్యంగా చూశాడు. “నేను ఏం చెయ్యాలి?”

అతడివైపు కామరాజు సూటిగా చూశాడు.

“ఆ పట్టాలమధ్య పడుకుని నువ్వు చావాలని అనుకున్నావుగా! చావడానికి మరో మార్గం నీకు నేను చూపిస్తాను. ఆ మార్గంలో వెళ్ళి నువ్వు చావొచ్చు.”

రవి మంచినీళ్ళను గడగడ తాగేశాడు. ప్లేట్లన్నీ ఖాళీ అయ్యాయి. వేడి కాఫీ తాగాడు.

"నేను చెప్పినట్లు చేస్తావా?"

"చేస్తాను, సార్."

కామరాజు అతడికి ఒక సిగరెట్ యిచ్చి కాల్చుకో మన్నాడు. రవి సిగరెట్ వెలిగించాడు.

"ఆ మార్గం ఏమిటో చెప్పండి."

"ఆ పాకెట్ తీసుకో. కారులో మాట్లాడుదాం" అని కామరాజు బిల్లు చెల్లించాడు.

ఇద్దరూ కారువైపు నడిచారు.

## 3

కారు స్పీడుగా వెళ్తోంది.

"మీ యిల్లు ఎక్కడ?"

రవి చెప్పాడు.

"మొదట అక్కడికి వెళ్ళి ఈ పాకెట్‌ను యిద్దాం. తర్వాత మనం మాట్లాడుదాం."

పాతబడిన యింటిముందు కామరాజు కారు ఆపాడు.

"మా యిల్లు వెనక భాగంలో వుంది" అన్నాడు రవి.

"పాకెట్ ఇచ్చి వెంటనే రా. నీకోసం ఎక్కువసేపు నేను కూర్చోలేను" అన్నాడు కామరాజు.

పాకెట్ తీసుకుని రవి వెనకవైపుకు పరుగెత్తాడు. ముందు తలుపు తెర్చివుంది. అమ్మ, పిల్లలు హాల్లోనే వున్నారు. అందరూ అతడి చేతిలోని పాకెట్ వైపు ఆశతో చూశారు.

"అందరూ కడుపునిండా తినండి" అని పాకట్ తల్లి కిచ్చాడు.

"ఏదేనా పని దొరికిందా?" తల్లి అడిగింది.

"తర్వాత చెప్తానమ్మా. నాకోసం ఒకరు కారులో కూర్చుని వేచి వున్నారు. వెళ్తాను" అని అతడు బయటకు పరుగెత్తాడు.

కామరాజు అతడివైపు చూశాడు.

"రవీ, ఈ వెయ్యిరూపాయిలూ నీ తల్లికి యిచ్చిరా! వచ్చేనెల మళ్ళీ యిస్తాను."

ఆనందంగా రవి మళ్ళా యింటికి పరుగెత్తాడు. తల్లి చేతికి నోట్లను యిచ్చాడు.

"వెయ్యి రూపాయిలమ్మా! ఇటుపైన మనకు యే బెంగాలేదు. నెల నెలా నీకు వెయ్యిరూపాయిలు ఇస్తాను. యిల్లు నడుపు!"

నోట్లమీదనుంచి ఆమె చూపు కొడుకు మీదకు వెళ్ళింది. ఆనందంలో ఆమె ఏడ్చింది. ఆమె కన్నీళ్ళను తుడిచాడతను.

"జీవితమంతా అమావాశ్యగా వుండదమ్మా. ఎప్పుడో పౌర్ణమి వచ్చితీరుంది!"

అతడు వేగంగా వెళ్ళిపోయాడు. తల్లి ఏదో అంది. పెద్ద చెల్లెలు ఏదో అడిగింది. ఆగి వాళ్ళకు జవాబి చ్చేందుకు అతడికి టైమ్‌లేదు.

అతడు ముందు సీటు మీద కూర్చుని తలుపు మూశాడు. కామరాజు కారును పోనిచ్చాడు.

"నువ్వు యిటుపైన మీ ఇంటికి వెళ్ళవు?" అన్నాడు కామరాజు.

అతడు ఉలిక్కి-పడ్డాడు.

"అమ్మ బెంగెట్టుకుంటుంది! నన్ను చూడకుండా ఆమె వుండలేదు!"

"బాగా తిండితిన్నాక వచ్చేమాటలివి! ఆ బ్రెయిన్

కింద నువ్వు పడి చచ్చివుంటే నీ తల్లి ఏంచేసేది?" ప్రశ్నించాడు కామరాజు గంభీరంగా.

రవి మాట్లాడలేదు. కామరాజు మాటలు అతడికి అర్థంకావడంలేదు.

"ఇటుపైన నీ పనిని నువ్వు పూర్తిచెయ్యాలి."

"ఆ పనేమిటో మీరు చెప్పలేదు!"

కారు వేగంగా రోడ్డమ్మట పోతోంది.

"ముఖ్యమంత్రి విజయచంద్రన్ని నువ్వు చంపాలి!"

రవి తృళ్ళిపడ్డాడు. అతడి గుండె దడదడలాడింది.

"ఆయన్ని నేనెలా చంపగలను సార్? ఆయనచుట్టూ యెందరో సెక్యూరిటీ గార్డ్సు వుంటారు. పిస్టల్ని నేనింత వరకూ చూడలేదు."

"అన్నిరకాల ఆయుధాలనూ నువ్వు చూస్తావు. నీకు ట్రెయినింగ్ యిప్పిస్తాను."

"ఆయన్ని చంపితే మనకేమొస్తుంది, సార్?"

"నీకు చావు సంభవిస్తుంది! నీవు చావాలనుకున్నావుగా? పోలీసులు నిన్ను కాల్చి చంపొచ్చు. లేకపోతే పట్టుకొని, నీమీద కేసుపెట్టి, తర్వాత నిన్ను ఉరి తీయొచ్చు. ఏ విధంగానైనా నువ్వు చస్తావు!"

"మరొకర్ని చంపడం నాకిష్టంలేదు, సార్."

"నీ తల్లీ, నీ చెల్లెళ్ళూ, నీ తమ్ముడూ కడుపునిండా తిని బతికి వుండాలంటే నువ్వు హత్యచేసితీరాలి! నువ్వు చంపకపోతే వాళ్ళు కష్టపడ్తారు. కెలకు వెయ్యా వాళ్ళకు అందదు."

"మీరు చెప్పినట్లే చేస్తాను, సార్" అన్నాడు రవి మరేం గత్యంతరం లేక.

రోడ్డమ్మట కారు దూసుకుపోయింది.

# 4

పెద్ద మేడ.

తన గదిలో రవి కూర్చుని ఉన్నాడు. ఎదురుగా పెద్ద సోఫాలో ఉన్నాడు కామరాజు.

కామరాజు సన్నగా, పొడుగ్గా ఉంటాడు. తలమీది వెంట్రుకలు యెప్పుడో రాలిపోయాయి. చాలా పట్టుదల గల మనిషని అతడి మొహం చూస్తే అందరికీ తెలుస్తుంది.

కామరాజు ఎప్పుడూ సూటులో ఉంటాడు. చేతిలో యెప్పుడూ చందనపు కర్ర ఉంటుంది. అతడి బూట్లు మెరుస్తూ ఉంటాయి. దుస్తులంటే అతడికి యెంతో యిష్టం.

కామరాజు అతడివైపు చూశాడు.

"రవీ, ఈ ఆల్బమ్ చూడు!"

రవి ఆల్బమ్ చూస్తూ ఉండిపోయాడు. ఆఖరిదాకా చూసి అతడు కామరాజువంక తిరిగాడు.

"చాలా అందమైన యువతులు, సార్!" అన్నాడు రవి.

"ఈమె నా పెద్ద కూతురు జయ. ఈమె నా చిన్న కూతురు విజయ."

ఫోటోలన్నీ రంగుల్లో ఉన్నాయి.

"అంత అందమైన నా యిద్దరు కూతుళ్ళూ క్షణంలో మరణించారు. పోలీసుల తుపాకీ గుళ్ళకు బలైపోయారు. ఆనాడు షూట్ చేయడం పోలీసు కమీషనర్ కి యిష్టం లేదు. ముఖ్యమంత్రి షూట్ చేయమని ఆర్డరిచ్చాడు. అటుపైన షూటింగ్ జరిగింది."

"చాలా ట్రాజిక్ సార్" అన్నాడు రవి.

కామరాజు కళ్ళు ఆగ్రహంతో, కసితో ఎర్రబడ్డాయి.

"ఓట్లకోసం సంవత్సరం క్రితం ఈ ముఖ్యమంత్రి యింటింటికీ వెళ్ళాడు. పదవిలో పడగానే అతడి కళ్ళు పైకెళ్ళాయి. తనకు ఓట్లిచ్చిన ప్రజలను మర్చిపోయాడు. వాడికి బుద్ధి చెప్పాలి!" అర్చాడు కామరాజు.

అమాంతంగా కామరాజు సోఫాలోంచి లేచాడు.

"నాతో రా!" అన్నాడు.

రవి లేచి అతడితో వెళ్ళాడు. ఒక పడగ్గదిలోకి ఇద్దరూ వెళ్ళారు. పరుపుమీద యాభై యేళ్ళ వయసులో వున్న స్త్రీ పడుకుని వుంది.

పచ్చటి శరీరం. ఆమె జుత్తు తెల్లబడింది. సమీపంలో నిలబడి రవి ఆమెవంక చూశాడు.

"ఈమె నా భార్య. కూతుళ్ళ శవాలను చూసి మూర్ఛ పోయింది. ఇప్పుడు లేవలేదు. అలాగే మంచంమీద పడి ఉంటుంది. ఆమెకు మాట కూడా పోయింది!"

"అంతా విచారకరంగా వుంది, సార్."

"నా కూతుళ్ళు చావడానికి, ఈమె ఇలా అవడానికి కారకు డెవరు? వాడే, మన ముఖ్యమంత్రి విజయచంద్రన్ ఎంతమంది ప్రజలు చచ్చినా ఈనాటి నాయకులకు లెక్క లేదు. వాళ్ళకు కావలసింది వాళ్ళ పదవులు" అన్నాడు కామరాజు.

పరుపుమీద పడుకున్న స్త్రీ వాళ్ళిద్దరివైపు మౌనంగా చూసింది.

మెల్లిగా యిద్దరూ వెనక్కు తిరిగి రవి వుండే గదిలోకి చేరుకున్నారు. సోఫాలో కూర్చుని కామరాజు సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ అతడివైపు చూశాడు.

"ప్రతి యుగంలోనూ దుష్టులను శిక్షించడానికి విష్ణువు

ఎన్నో అవతారాలు దాలుస్తాడు. ముఖ్యమంత్రిని చంపడం కోసం నువ్వు అవతరించావు. ఆత్మహత్యకు బలై పోకుండా అందుకే నిన్ను నేను కాపాడాను!"

ఏం చెప్పాలో రవికి తోచలేదు. మాట్లాడకుండా అతడు చెప్పింది వినసాగాడు.

"విజయచంద్రన్ చాలా కాలంనుంచి నాకు తెలుసు. అతడికి హృదయంలేదు. ఒక్క అడుగు ముందుకు వెళ్ళడం కోసం అతడు ఏదైనా చేస్తాడు" అన్నాడు కామరాజు.

విజయచంద్రన్ చాలా మంచివాడనీ, పేదవాళ్ళకు ఎంతో సేవ చేస్తున్నాడనీ అతడు విన్నాడు. కామరాజు చెప్పినదంతా వ్యతిరేకంగా వుంది. చాలామంది ప్రజలకు ముఖ్యమంత్రి విజయచంద్రన్ దేవుడితో సమానుడు.

"ఇవాళ రాత్రి ఒక మీటింగ్ ఉంది. ముఖ్యమంత్రి అక్కడికి వస్తాడు. నువ్వూ నేను ఆ మీటింగ్‌కు వెళ్దాం" అని కామరాజు లేచి, గదిలోంచి బయటకు వెళ్ళి పోయాడు.

# 5

సోడియమ్ వాపర్ లైట్లు చక్కటి కాంతిని నలువైపులా వెదజల్లుతున్నాయి.

కారును ఒకచోట ఆపి, కామరాజు, రవి కొంత దూరం నడిచి, పేవ్‌మెంట్ మీద నిలబడ్డారు. తనని యెవరూ గుర్తించకూడదని కామరాజు తన వేషాన్ని కొద్దిగా మార్చుకున్నాడు.

పోలీస్ జీప్ వచ్చి ముందుకు పోయింది. ముఖ్యమంత్రి కారు వెనకనే వచ్చింది. పోలీస్ జీప్ వెనకనే కారు ఆగింది.

ముందు సీటుమీద కూర్చున్న పెర్సనల్ సెక్యూరిటీ

గార్డు సబ్ ఇన్స్పెక్టర్ దేవర్ కిందకు దిగి, వెనుక తలుపు తెరిచాడు.

ముఖ్యమంత్రి కిందకు దిగాడు. అతడితోపాటే నడుస్తున్నాడు సెక్యూరిటీ గార్డు దేవర్.

"ముఖ్యమంత్రితో నడిచే సెక్యూరిటీ గార్డును జాగ్రత్తగా గమనించు!" అన్నాడు కామరాజు అతడి చెవిలో.

ఎదురుగా వున్న ఒక పబ్లిక్ హాల్లోకి ముఖ్యమంత్రి ప్రవేశించాడు. రవిని కొంచెం వెనక్కు తీసుకెళ్ళాడు కామరాజు.

"నేను లోపలకు రాను. హాల్లోకి వెళ్ళు. ఆ సెక్యూరిటీ గార్డును బాగా గమనించు. త్వరగా తిరిగిరా!" అన్నాడతను.

రోడ్డుదాటి రవి రాజేశ్వరీ హాల్లోకి నడిచాడు. హాలు జనంతో నిండివుంది. ముఖ్యమంత్రి కూర్చుని ఉన్నాడు. అతడి వెనకనే నిలబడి ఉన్నాడు సెక్యూరిటీ గార్డు దేవర్.

రవి మెల్లిగా ముందుకు వెళ్ళాడు. సెక్యూరిటీగార్డు వైపు ఆశ్చర్యంగా చూశాడు. అతడు యూనిఫామ్‌లో ఉన్నా, అచ్చంగా తనలాగే ఉన్నాడు.

కొంతసేపయ్యాక రవి బయటకు కదిలాడు. పేవ్‌మెంటుమీద కామరాజు తారట్లాడుతున్నాడు. ఇద్దరూ కారువైపు నడిచారు.

"నువ్వు తెలుసుకున్న దేమిటి?"

"సెక్యూరిటీగార్డుకూ నాకూ బాగా పోలిక వుంది" అన్నాడు రవి.

ఇద్దరూ కారులో కూర్చున్నారు. కామరాజు కారును పోనిచ్చాడు.

"ఆ సెక్యూరిటీగార్డు స్థానంలో నిన్ను నేను ప్రవేశ పెడ్తాను. అప్పుడు దగ్గరనుంచి ముఖ్యమంత్రిని చంపొచ్చు. ఒక్క బులెట్ తో ముఖ్యమంత్రి కుప్పలా కూలిపోతాడు."

"అదెలా సాధ్యం సార్?"

కామరాజు గర్వంగా నవ్వాడు.

"ఈ లోకంలో సాధ్యంకానిది ఏమీ లేదు" అన్నాడు కామరాజు.

కారు యింటివైపు దూసుకుపోతోంది.

"మనం యింటికెళ్ళేసరికి ఒకతను మనకోసం వచ్చి, వేచివుంటాడు. అతడి పేరు క్రిపాల్ సింగ్. అతడు నీకు షూటింగ్ నేర్పుతాడు" అన్నాడు కామరాజు.

పోర్టికోలో కారు ఆగింది. ఇద్దరూ దిగారు. మోటర్ సైకిల్ మీద కూర్చున్న క్రిపాల్ సింగ్, దగ్గరకొచ్చి కామరాజుకు నమస్కరించాడు.

క్రిపాల్ సింగ్ యిండియన్ ఆర్మీలో పనిచేసి రిటైరయ్యాడు. ప్రయివేట్ గా ఒక షూటింగ్ క్లబ్ ప్రారంభించి అనేకమందికి షూటింగ్ నేర్పుతున్నాడు.

"కమ్ విత్ మి" అన్నాడు కామరాజు.

వాళ్ళు ముందు హాల్లోకి వెళ్ళారు. పెద్ద హాలు. గోడలకు ఆయిల్ పెయిన్ టింగ్స్ ఉన్నాయి.

"మిస్టర్ క్రిపాల్ సింగ్, కూర్చోండి" అన్నాడు కామరాజు.

సోఫాలో అతడు కూర్చున్నాడు. పక్కనే చతికిలబడ్డాడు రవి. ఎదురుగా సోఫాలో కూర్చుని కామరాజు అతడివైపు చూశాడు.

"ఇతడు రామ్మూర్తి. యేయర్‌రోడ్‌లో వున్న నా కాఫీ ప్లాంటేషన్స్‌కి మేనేజర్. ఇతడికి షూటింగ్ నేర్పాలి."

"నేర్పుతాను సాబ్. అదే నా పని" అన్నాడు క్రిపాల్‌సింగ్.

"ఎక్స్‌పర్టు అవడానికి యెంత టైము పడుతుంది?"

"ఆరు నెలలు చాలు, సార్."

"నెలలో అతడికి నేర్పాలి."

"అప్పుడు ఎక్కువ ఖర్చవుతుంది."

"ఎంత ఖర్చయినా ఫరవాలేదు."

"పదివేలిస్తే నెలలో యితడు యెక్స్‌పర్టు అవుతాడు."

"మీరు అడిగినదానికి రెండువేలు కలిపి పన్నెండు వేలు యిస్తాను" అన్నాడతను.

"చాలా థాంక్స్, సార్! మీరు యెంతైనా యివ్వగలరు" అన్నాడు సింగ్.

కామరాజు జేబులోంచి కొన్ని నోట్లు తీసి టీపాయ్ మీద పడేశాడు.

"12 వేలు తీసుకెళ్ళండి. వెంటనే వర్కు స్టార్టు చేయండి" అన్నాడు.

"రా భాయ్" అని క్రిపాల్‌సింగ్ రవిని తనతో బయటకు తీసుకువెళ్లాడు.

## 6

మోటర్‌సైకిల్ వెనక కూర్చున్నాడు రవి. క్రిపాల్‌సింగ్ మోటర్‌సైకిల్‌ని విమానంలా పోనిస్తున్నాడు. రవి హడలిపోతున్నాడు.

"ఇంత స్పీడ్ దేనికి?" అర్చాడు రవి వెనకనించి.

క్రిపాల్ సింగ్ వెనక్కి చూశాడు. అతడి పొడుగాటి గడ్డం, మీసాలు కొట్టొచ్చినట్లు కనపడ్డాయి. కాని అతడి మాటలు రవికి వినపడలేదు. తను అన్నది కూడా అతను వినలేదేమో!

పట్నానికి దూరంగా ఒక తోటలో గుడిసె ముందు అతడి మోటర్ బైక్ ఆగింది.

బయట ఒక కుర్చీ పడివుంది.

"బైటో, భాయ్" అని అతడు లోపలకు పరుగెత్తాడు.

క్రిపాల్ పొడుగ్గా, లావుగా వుంటాడు. అతడు ధరించిన పాంట్, షర్ట్ లూజ్‌గా వున్నాయి. తలమీద తలపాగా, చేతికి రాగి కంకణం!

బయటనున్న పాత కుర్చీలో రవి కూర్చున్నాడు. తోట ఎవరిదోగాని అనేక రకాల చెట్లున్నాయి. ఆలోచిస్తూ రవి సిగరెట్ వెలిగించాడు.

సిగరెట్ అయిపోయినా క్రిపాల్ సింగ్ రాలేదు. అతడి కొడుకు ఒక గ్లాసులో టీ తెచ్చి యిచ్చాడు.

వేడి టీని రవి తాగేశాడు.

కాస్సేపట్లో క్రిపాల్ సింగ్ వచ్చాడు.

"భాయ్, నేను నీ గురువుని" అన్నాడతను.

"అవును, సార్" అన్నాడు రవి.

గుడిసెలో ఎలెక్ట్రిక్ దీపాలు వెలుగుతున్నాయి.

"ఇవాళ మంచిరోజని నిన్ను తీసుకువచ్చాను. చీకటి పడ్డాక షూటింగ్ నేర్పలేను. రేపు పొద్దుట యిక్కడకు ఏడింటికి రా!" అన్నాడు క్రిపాల్ సింగ్.

"అలాగే వస్తాను" అన్నాడు రవి.

"వెళ్ళేముందు ఈ పిస్టల్ చూడు! ఇదొక కంట్రీ

మేడ్ పిస్టల్. ఇందులో పెలెట్లు వున్నాయి. పన్నెండు సార్లు షూట్ చేయొచ్చు. ఈ ట్రిగ్గర్ నొక్కితే చాలు, పెలెట్ దూసుకుపోతుంది!"

రవి పిస్టల్ని తీసుకున్నాడు. ట్రిగ్గర్ నొక్కాడు. పెలెట్ నేలమీద పడింది.

"ఆ చెట్టువెపు షూట్ చేయి!"

రవి లేచి నిలబడ్డాడు. అతడు చూపించిన చెట్టువెపు షూట్ చేశాడు. పెలెట్ వెళ్ళి చెట్టు మ్రానుకు కొట్టుకుని చప్పుడైంది.

"ఫైన్! ఫైన్, నువ్వు షూటింగ్ ఎక్స్పర్టు అవుతావు. నాకు సందేహం లేదు" అన్నాడతను.

పెలెట్లన్నీ గాలిలో యెగిరిపోయాయి. ఎక్కడా చప్పుడు కాలేదు. రవి పిస్టల్ని అతడి కిచ్చాడు.

"ఇక్కడ నుంచి ఎలా వెళ్ళాలి?" అడిగాడు రవి.

"రెండు ఫర్లాంగులు నడిస్తే మెయిన్ రోడ్డు వస్తుంది. అక్కడ నుంచి బస్సులు దొరుకుతాయి. పట్నంలో యెక్కడికయినా వెళ్ళోచ్చు" అన్నాడతను.

అతడికి నమస్కరించి రవి బయటకు నడిచాడు. ఆలోచిస్తూ నడుస్తున్నాడు. తను యింటికి వెళ్ళి అమ్మనూ, పిల్లలను చూసి తర్వాత కామరాజు యింటికి వెళ్ళడం మంచిదనిపించింది.

మెయిన్ రోడ్డుమీద అతడు బస్సు యెక్కాడు. గంటలో అది తన యింటికి కొంచెం దూరంలో ఆగింది. బస్సు దిగి అతడు వడి వడిగా తన యింటివైపు నడిచాడు.

ఇంట్లో లైట్లు వెలుగుతున్నాయి. రేడియో పాట వినిపిస్తోంది. అతడు హాల్లోకి వెళ్ళాడు. పిల్లలందరూ అమాం

తంగా అర్చారు అన్నయ్య వచ్చాడని!

ఆనందంతో వాళ్ళ అరవడం విని అతడు యెంత గానో సంతోషించాడు. తల్లి వచ్చి అతడిని కౌగలించు కుంది.

"ఎలా వున్నావురా?"

"బాగా వున్నానమ్మా. పెద్ద ఉద్యోగం. మా యజ మాని చాలా మంచివారు" అన్నాడతను.

"ఇవాళ యిక్కడే వుండిపో" అందామె.

"వెళ్ళాలి. యజమానితో చెప్పి మరోసారి వస్తాను" అన్నాడతను.

చెల్లెలు తెచ్చిన కాఫీని అతడు తాగాడు. అందరి తోనూ మాట్లాడి బయటకు నడిచాడు.

# 7

ఏర్ కండిషండ్ గదిలో కామరాజు, డి. ఎస్. పి. పింటో స్కాచ్ విస్కీ సేవిస్తున్నారు. పోలీసు డి. ఎస్. పి. పింటో మంచి నిషాలో వున్నాడు.

తాగుతూ మధ్యన వాళ్ళు చిప్స్, మటన్ చాప్స్ తింటున్నారు. ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు.

"మిస్టర్ పింటో, నీ సహాయం నాకు కావాలి." అన్నాడు కామరాజు.

"ఏం కావాలో చెప్పండి సార్" అన్నాడు పింటో.

"ముఖ్యమంత్రికి పెర్సనల్ సెక్యూరిటీ గార్డు డేవర్ వున్నాడు తెలుసుగా?"

"తెలుసు" అన్నాడతను.

"అతడిని గురించి నాకు పూర్తి వివరాలు కావాలి."

"అంతా కనుక్కుంటాను సార్."

కామరాజు నవ్వాడు.

"మీ అమ్మాయి పెళ్ళని నువ్వు నాకు ఫోన్‌లో చెప్పావు. పెళ్ళికి యెంత ఖర్చవుతుంది?" అడిగాడు కామరాజు.

"నేను పెద్ద ఉద్యోగంలో వున్నాను. అందువలన లక్ష రూపాయిలు కావచ్చు" అన్నాడతను.

"మిస్టర్ పింటో, నీ కూతురి పెళ్ళి విషయం గురించి నువ్వు ఆలోచించకు. లక్ష రూపాయిలు కాష్‌గా నేను నీకు పంపుతాను."

అతడు ఉద్రేకంతో కామరాజు చెయ్యి పట్టుకున్నాడు.

"మిమ్మల్ని యీ జీవితంలో నేను మరువను!" అన్నాడతను.

లోలోపల పింటో ఆలోచిస్తున్నాడు. ఒక యువకుడు తన కూతుర్ని ప్రేమించి, పెళ్ళాడబోతున్నాడు. కట్నాలూ, కానుకలూ ఎక్కువగా లేవు. ఇరవై ఐదు వేలలో పెళ్ళి ముగించవచ్చు. తతిమా డబ్బుతో తనొక యిల్లు కొనుక్కోవచ్చు. పెద్దపెట్టున కామరాజు తనకు సహాయం చేస్తున్నాడు. ఈ సమయంలో తనొక యిల్లు కొనాలి!

తొమ్మిదింటికి డి. ఎస్. పి. పింటో తన జీప్‌లో వెళ్ళిపోయాడు. కామరాజు యింకా తాగుతూనే వున్నాడు.

రవి నవ్వుతూ గదిలోకి వచ్చాడు.

"హాలో!" అన్నాడు కామరాజు.

సోఫాలో యెదురుగా రవి కూర్చున్నాడు.

"రేపు ప్రొద్దుట ఏడింటికి క్రిపాల్‌సింగ్ దగ్గరకు వెళ్ళాలి" అన్నాడతను.

"వెళ్ళు! షెడ్లలో కార్లు, మోటర్ బైక్స్, స్కూటర్లు వున్నాయి. నీకు కావలసింది నువ్వు తీసుకో!" అన్నాడు కామరాజు.

"అలాగే సార్!" అన్నాడతను.

"ఇంత వరకూ నువ్వు క్రిపాల్ సింగ్ తోనే వున్నావా?"

రవి తడబడ్తూ వుండిపోయాడు.

కామరాజు అతడివైపు సూటిగా చూశాడు.

"నాతో నిజం చెప్పు!"

"రవి మాట్లాడలేదు.

నీ తల్లిని చూడ్డానికి వెళ్ళావా?"

"వెళ్ళాను, సార్. అమ్మను చూసి చాలా రోజులు అయింది" అన్నాడు రవి.

"నీ తల్లిని చూడాలని వుంటే నాతో చెప్పి వెళ్ళు. ముఖ్యమంత్రిని చంపబోయే వ్యక్తికి డిసిప్లిన్ వుండాలి" అన్నాడతను.

"ఇటుపైన అలాగే చేస్తాను, సార్."

కామరాజు విజిల్ చేశాడు. ఒక బాయ్ అతడి దగ్గర కొచ్చాడు. అతడితో యేదో చెప్పాడతను.

ఒక గ్లాసులో స్కాచ్ విస్కీ పోసి, సోడా కలిపి, ఐస్ వేసి అతడు రవికి ఇచ్చాడు.

"నాకు తాగే అలవాటు లేదు, సార్!" అన్నాడు రవి.

"నువ్వు చేయబోయే పనికి తాగుడు ఒక ఫ్రెండ్ లాంటిది. డ్రింకిట్!"

గ్లాసులోని విస్కీని అతడు కళ్ళు మూసుకుని గడగడ తాగేశాడు.

బాయ్ రవి గ్లాసును నింపుతూనే వున్నాడు. నాలుగు రౌండ్లు అయ్యాక రవి సోఫాలో పడుకొన్నాడు. ఇంకా తాగే స్థితిలో లేడు.

"అతడిని గదిలోకి తీసుకెళ్ళి పడుకోబెట్టు" అన్నాడు కామరాజు బాయ్‌తో.

ఇద్దరు నౌఖర్లు రవిని మోసుకుపోయారు. అతడి గదిలోని పరుపుమీద పడుకోబెట్టారు.

గ్లాసులోని విస్కీని తాగేసి కామరాజు తన భార్య గదిలోకి వెళ్ళాడు. పరుపుమీద ఆమె పక్కనే కూర్చున్నాడు. ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"మైడియర్, నువ్వు బాధపడకు! మన కూతుళ్ళను బలి తీసుకున్న ముఖ్యమంత్రి విజయచంద్రన్ త్వరలో చస్తాడు!" అన్నాడతను.

ఆమె మొహంలో యే భావం లేదు. అతడివైపు పిచ్చిదానిలా చూసింది.

నర్సు గదిలోకి వచ్చింది. అతడికి ఆమె నమస్కరించింది.

"ఎలా వుందీమె?" అడిగాడతను.

"మునుపటిలాగే, సార్!" అంది నర్స్.

అతడు లేచి దూరంగా కదిలాడు. గుమ్మంవైపు వెళ్ళాడు. నర్స్ అతడి వెనకనే వెళ్ళింది.

"సార్!" అందామె.

అతడు ఆమెవంక చూశాడు.

"మీతో ఒక విషయం మాట్లాడాలి" అందామె.

"ఈ రాత్రి నా గదికి రా, మాట్లాడుదాం" అని అతడు వెళ్ళిపోయాడు.

టైమ్ పన్నెండు కావస్తోంది. ఎవరో తలుపును

తట్టారు. కామరాజు వెళ్ళి వెళ్ళి తలుపును తెర్చాడు.

ఎదురుగా నర్స్ మేరీ నిలబడి వుంది!

"కమిన్!" అన్నాడతను.

ఆమె లోపలకు వచ్చింది. ఆమెను సోఫాలో కూర్చోమన్నాడు. ఆమె కూర్చుంది.

"సార్!" అందామె.

"చెప్పు" అన్నాడతను.

"నాకు యిద్దరు చెల్లెళ్ళు వున్నారు. వాళ్ళను బాగా చదివించాలని నేను పెళ్ళి చేసుకోడం మానేశాను. నా చెల్లెలికి పెళ్ళి కుదిరింది. అది చెయ్యాలంటే నాకు కనీసం పదివేలు కావాలి. మీరు యెంతో కొంత సహాయంచేస్తే ప్రతినెలా అప్పు తీర్చుకుంటాను" అందామె.

"మిస్ మేరీ, నీకు పదివేలు ఇస్తాను. నీ చెల్లెలు పెళ్ళి చెయ్యి. ఇది అప్పుగా నేను నీకు యివ్వడం లేదు. నువ్వు నాకు యీ డబ్బు తిరిగి యివ్వనక్కార లేదు" అన్నాడతను.

ఆమె ఆశ్చర్యపోతూ వుండిపోయింది.

"మిస్ మేరీ, మంచిని పెంచడం ధర్మంగా నేను భావిస్తున్నాను" అన్నాడు కామరాజు.

మిస్ మేరీ యవ్వనంలో వుంది. తన గదికి రమ్మంటే అతడి కన్ను ఆమెమీద వుందని ఆమె అనుకుంది. కాని కామరాజు అటువంటివాడు కాదు!

సోఫాలోంచి ఆమె లేచింది. అతడిముందు నేలమీద పడి సాష్టాంగ నమస్కారం చేసింది.

"సార్, మీరు చాలా గొప్పవారు!" అందామె.

"చెల్లీ, గొప్పతనం ధనంలో లేదు. కల్చర్‌లో వుంది. నా భార్య అంటే నాకెంతో అభిమానం. ఆమెకు నే

నెన్నడూ అన్యాయం చెయ్యను" అన్నాడతను.

అతడు పదివేలు ఆమె కిచ్చాడు.

"పెళ్ళి బాగా జరగాలి. అంతే నాకు కావాలి! ఎవరు ఎక్కడ ఆనందంగా వున్నా నేను వాళ్ళతో ఆనందిస్తాను" అన్నాడతను.

మిస్ మేరీ అతడికి నమస్కరించి వెళ్ళిపోయింది. ఆమె హేండ్ బాగ్ లో అతడిచ్చిన పదివేలు వుంది!

## 8

డి.ఎస్.పి. పింటో అతడి కెదురుగా కూర్చున్నాడు. కామరాజు అతడివైపు చూశాడు.

"దేవర్ గురించి అంతా కనుక్కున్నాను" అన్నాడు పింటో.

"వివరంగా చెప్పు!" అన్నాడు కామరాజు.

"దేవర్ ఒక్కగానొక్క కొడుకు. అతడి కింకా పెళ్ళి కాలేదు. అతడు తల్లితో జీవిస్తున్నాడు. ఆమె గుడ్డిది" అన్నాడు పింటో.

"ప్రొసీడ్!" అన్నాడు కామరాజు.

"దేవర్ ముఖ్యమంత్రికి దూరపు చుట్టం. అందువల నే అతడు పెర్సనల్ సెక్యూరిటీగార్డు అవగల్గాడు" అన్నాడు పింటో.

"మిస్టర్ పింటో, నువ్వు చెప్పినదంతా నాకు తర్వాత వుపయోగపడ్తుంది" అన్నాడు కామరాజు.

"సార్, మీకు ఏం కావలసినా నేను చేస్తాను" అన్నాడు పింటో.

కామరాజు తన బాగ్ లోంచి కొన్ని నోట్లకట్టలను తీసి అతడిముందు టీపాయ్ మీద పడేశాడు.

"లక్ష రూపాయిలు" అన్నాడతను.

ఆ నోట్లను డి.ఎస్.పి. పింటో తన బాగ్‌లోకి చేర్చుకున్నాడు.

"సార్, మీరు చాలా సహాయం చేశారు. మీరు తప్పక మా అమ్మాయి పెళ్ళికి రావాలి" అన్నాడతను.

"తప్పకుండా వస్తాను" అన్నాడు కామరాజు.

డి. ఎస్. పి. పింటో అతడికి నమస్కరించి వెళ్ళిపోయాడు.

రవి అప్పుడే గదిలోకి వచ్చాడు. అతడివంక కామరాజు సూటిగా చూశాడు.

"రవీ, ముఖ్యమంత్రి విజయచంద్రాన్ని చంపవలసిన టైము దగ్గరవుతోంది" అన్నాడు కామరాజు.

రవి మౌనంగా వుండిపోయాడు. ఎవర్నీ చంపడం అతడికి యిష్టంలేదు!

"రవీ, భయపడుతున్నావా?" అడిగాడు కామరాజు.

"నాకు భయంలేదు, సార్!" అన్నాడతను.

"నువ్వు షూటింగ్‌లో ఎక్స్‌పర్టు అయ్యావు. దేవర్ స్థానంలో నిన్ను తర్వాలో చేరుస్తాను. అటుపైన నువ్వు ముఖ్యమంత్రిని హతమార్చాలి!" అన్నాడు కామరాజు.

రవి మెదడులో ఆలోచనలు తిరుగుతున్నాయి. ఇంతవరకూ ఎవరినీ చంపలేదు. ముఖ్యమంత్రిని ఎలా చంపడం? రవి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు!

బాయ్ రవికి విస్కీ యిచ్చాడు. రవి, కామరాజు ఆనందంగా విస్కీ సేవిస్తున్నారు.

"రవీ, ముఖ్యమంత్రిని మామూలుగా చంపకూడదు. అరడజన్ బులెట్లు అతడి దేహంలోకి వెళ్ళాలి. బతికే అవకాశం అతడికి ఉండకూడదు" అన్నాడు కామరాజు.

"అలాగే చేస్తాను, సార్" అన్నాడు రవి.

పన్నెండుదాకా యిద్దరూ తాగుతూనే ఉన్నారు. రవి కునికిపాట్లు పడుతున్నాడు. కామరాజు బాయ్‌ని పిల్చాడు.

"ఇతడిని తన గదికి తీసుకెళ్ళండి!" అన్నాడతను.

వాళ్ళు అతడిని తీసుకుపోయారు. కామరాజు చిరునవ్వుతో తన భార్య గదిలోకి వెళ్ళాడు.

## 9

తెల్లారుజామున నాలుగింటికి యింటి ముందు కారు ఆగింది. స్టీరింగ్ వీల్ వెనక కామరాజు కూర్చుని వున్నాడు. రవి కిందకు దిగాడు.

వెళ్ళి ముందు తలుపుమీద తట్టాడు. కాస్సేపట్లో తలుపు తెరవబడింది.

ఎదురుగా వున్న దేవర్ వైపు రవి చూశాడు. పిస్టల్ని అతడివైపు గురిపెట్టాడు.

"చేతులు ఎత్తి నుంచో!" అరిచాడు రవి.

లుంగీ, బనియన్‌లో వున్న దేవర్ చేతులు ఎత్తాడు.

"మిస్టర్ దేవర్, వెళ్ళి బయటనున్న కార్లో కూర్చో!" అన్నాడు రవి.

"అలా చెయ్యకపోతే?" అడిగాడు దేవర్.

"నువ్వు చస్తావు!" అన్నాడు రవి.

దేవర్ కారువైపు నడిచాడు. ముందు సీటుమీద కూర్చుని తలుపు మూశాడు.

కామరాజు పిస్టల్ కొనని అతడి శరీరంమీద గుచ్చి పెట్టాడు.

"పిచ్చివేషాలు వేస్తే చస్తావు!" అరిచాడతను.

రవి కారు దగ్గరకు వచ్చాడు.

"సార్, మీరు అతడిని తీసుకుపోండి" అన్నాడు

రవి.

కామరాజు పక్కనున్న దేవర్ చేతులను నైలాన్ తాడుతో కట్టేశాడు.

"రవీ, నువ్వు సరైన తోవలో వెళ్తున్నావు. విజయం నీది" అన్నాడు కామరాజు.

రవి మాట్లాడలేదు. కామరాజు కారును పోనిచ్చాడు.

రవి ముందు తలుపు మూసి లోపలకు వెళ్ళాడు. ఒక గదిలో దేవర్ గుడ్డితల్లి పడుకుని వుంది. పక్క గదిలో వున్న పరుపు ఖాళీగా వుంది. రవి ఆ గదిలోకి వెళ్ళి పరుపుమీద పడుకున్నాడు.

కామరాజు వేగంగా పోనిస్తున్నాడు. దేవర్ అతడి వైపు చూశాడు.

"ఇదంతా నువ్వు యెందుకు చేస్తున్నావు? నీకు ఏం కావాలి?" అడిగాడు సబ్ ఇన్ స్పెక్టర్ దేవర్.

"నాకు ముఖ్యమంత్రి కావాలి!" అన్నాడు కామరాజు.

"ఆయన నీకు దొరికితే ఏం చేస్తావు?"

"అతడిని చిత్రవధ చేస్తాను. దుర్మార్గుడు విజయ చంద్రన్ చావాలి!" అరిచాడు రామరాజు.

దేవర్ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు. తనెలాగో బయటపడి ముఖ్యమంత్రిని కాపాడాలి!

కాని యెలా బయటపడ్డం? తన చేతులు కట్టబడి వున్నాయి. కట్లు తెగితేగాని అతడు ఏమీ చెయ్యలేడు!

ఒక యింటిముందు పోర్టికోలో కారు ఆగింది. కామరాజు దిగి అతడిని దిగమన్నాడు.

"మిస్టర్ దేవర్, కొంతకాలంపాటు నువ్వు నా అతిథిగా వుండాలి" అన్నాడు కామరాజు.

దేవర్ని అతడు మేడమీదకు యీడ్చుకుపోయాడు. ఒక గదిలో అతడిని పడేసి, తలుపుమూసి తాళంవేశాడు.

## 10

రవి తెల్లారుజామున ఐదింటికి లేచాడు. హాల్లో ఎక్సర్సైజులు చేయడం మొదలెట్టాడు. పింటో అందించిన సమాచారం యిప్పుడు రవికి ఉపయోగ పడ్తోంది.

తల్లి లేచి తడుముకుంటూ వచ్చి గుమ్మంలో నిలబడింది.

"బాబూ" అని పిల్చింది.

అతడు ఆమె దగ్గరగా వెళ్ళాడు. చెయ్యి పట్టుకుని ఆమెను బాత్‌రూమ్‌లోకి తీసుకు వెళ్ళాడు. బినాకా పేస్టును బ్రష్‌మీద రాసి ఆమెకిచ్చాడు.

అతడు వెనక్కి తిరిగాడు.

"బాబూ!" ఆమె మళ్ళా పిల్చింది.

"ఏం కావాలమ్మా?" అడిగాడతను.

కొన్ని వారాలపాటు కాసెట్ల మూలంగా అతడు దేవర్ మాటలను విన్నాడు. అలాగే మాట్లాడ్డం నేర్చుకున్నాడు.

"నువ్వు నా బంగారు బిడ్డవు. నువ్వు లేకుండా నేను బతకలేను" అందామె.

"నేనుండగలనా!" అని అతను వెళ్ళిపోయాడు.

ఆమె మొహం కడుక్కుంది. ఆమెను తీసుకెళ్ళి హాల్లోని సోఫాలో రవి కూర్చోబెట్టాడు.

"నీ కంఠం మారిందిరా" అందామె.

"దగ్గు మూలంగా అయివుంటుంది" అన్నాడతను.

దగ్గుతూ అతడు వంటగదిలోకి వెళ్ళాడు. వేడి కాఫీ తెచ్చి అతడు తల్లికిచ్చాడు. అతను యెదురుగా సోఫాలో

కూర్చుని కాఫీ తాగాడు.

టైమ్ చూశాడు. ఆరు కావస్తోంది. ఏ టైమ్‌లోనైనా కాంతమ్మ రావచ్చు. ఇంట్లో అన్ని పనులూ చూసుకుంటుందామె. అతడు యింటికి తిరిగివచ్చిందాకా ఆమె యింట్లోనే వుంటుంది.

బీరువాలోని దేవర్ యూనిఫామ్‌తీసి అతడు బయట పెట్టుకుని స్నానానికి వెళ్లాడు. స్నానంచేసి యూనిఫాం ధరించాడు. అతడి బెల్టుకు అమర్చబడిన తోలుసంచిలో ఒక అమెరికన్ పిస్టల్ వుంది. ఆ పిస్టల్‌తో యిరవై నాలుగుసార్లు షూట్ చేయొచ్చు. తర్వాత దాన్ని మళ్లా లోడ్ చెయ్యాలి.

అద్దంముందు నిలబడి రవి తన రూపాన్ని చూసుకున్నాడు. అచ్చంగా దేవర్‌లాగే వున్నాడతను. ఎవ్వరూ తనని చూసి అనుమానించరు!

తలుపును యెవరో తట్టారు. అతడు వెళ్ళి తలుపును తెర్చాడు. కాంతమ్మ అతడివైపు చూసింది.

"వెళ్ళు!" అన్నాడతను.

ఆమె లోపలకు వెళ్ళింది. అతడిని చూడగానే కాంతమ్మ మొహంలో యే అనుమానం లేదు. ఆమె వయస్సు యాభైపైన వుంటుంది.

కొంతసేపయ్యాక రెండు ఆంలెట్లను తయారుచేసి కాంతమ్మ అతడికిచ్చింది. ఆంలెట్లు ఎంతో రుచికరంగా వున్నాయి. అతడు ఆకలితో తిన్నాడు. ఆమె మళ్ళా కాఫీ యిచ్చింది. కాఫీ తాగాడతను. దేవర్‌కి సిగరెట్ కాల్చే అలవాటులేదు!

సరిగ్గా ఏడింటికి పోలీసు జీప్ వచ్చి యింటిముందు ఆగింది. అతడు తల్లి గదిలోకి వెళ్ళాడు. ఆమె పక్కనే

కూర్చున్నాడు. ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"జీప్ వచ్చింది, వెళ్తానమ్మా" అని బయటకు నడిచి జీప్ ముందు సీటుమీద కూర్చున్నాడు.

కానిస్టేబుల్ కన్నన్ జీప్‌ని పోనిచ్చాడు. జీప్ వేగంగా వెళ్తోంది. రవి ఆలోచిస్తూ చూస్తున్నాడు. ఎక్కువకాలం తను డ్రైవర్‌గా నటించడం కష్టం! తన్ని యెవరో ఒకరు కనిపెట్టవచ్చు! తొందరగా తను పని ముగించాలి!

ముఖ్యమంత్రి విజయచంద్రన్ యింటిముందు పోలీస్ వాన్ వుంది. డజన్‌మంది సాయుధ పోలీసులు గేటు బయట కాపలాగా ఉన్నారు.

జీప్ లోపలకు వెళ్ళింది. కాంపౌండులో కొన్ని కార్లు ఆగినచోట ఆగింది. రవి దిగాడు. ముఖ్యమంత్రి కార్యదర్శి ఉండే గదిలోకి వెళ్ళాడు.

"నమస్కారం సార్" అన్నాడు రవి.

కార్యదర్శి పేపర్లు చూస్తూ అతడివంక తిరిగాడు. ఒక కాగితాన్ని అతడికి అందించాడు. ఆ కాగితంలో ఉన్న దంతా రవి చదువుకున్నాడు. పక్కనున్న తన గదికి చేరుకున్నాడు.

ఫాన్ స్విచ్ తిప్పి అతడు తన కుర్చీలో కూర్చున్నాడు. టేబులు సొరుగులు లాగి చూశాడు. యేవేవో పేపర్లు ఉన్నాయి.

ఇవాళ యెనిమిదిదాకా ముఖ్యమంత్రి యెక్కడికీ వెళ్ళడు. తను అంతవరకూ విశ్రాంతి తీసుకోవచ్చు! అతడు పాత పత్రిక చదువుతూ కాలక్షేపం చేయసాగాడు.

ఒక నౌఖరు నవ్వుతూ వచ్చాడు.

"పెద్దమ్మగారు మిమ్మల్ని రమ్మన్నారు" అన్నాడతను.

నౌఖరుతో అతడు వెళ్ళాడు. ముఖ్యమంత్రి తల్లి అతడి వైపు నవ్వుతూ చూసింది. ఆమెను చూస్తూంటే రవికి తన తల్లి గుర్తుకొచ్చింది.

"గోపీ, యిడ్లీ తెచ్చి యితడికియ్యి" అందామె.

నౌఖరు గోపీ యిడ్లీ తెచ్చి యిచ్చాడు. కుర్చీలో కూర్చుని అతడు పెద్దమ్మను గురించి ఆలోచించసాగాడు. ఆమె దేవతలా ఉంది. నవ్వుతూ తనకు టిఫిన్ పెట్టించింది. ఆమె కొడుకును తను చంపాలి! అది వీలవుతుందా? తను ముఖ్యమంత్రిని చంపగలడా?

నిమిషాలు గడిచిపోతున్నాయి. అతడు ఆలోచిస్తూనే ఉన్నాడు. టైం ఎనిమిది కావస్తోంది. ముఖ్యమంత్రి కారొచ్చి ఇంటిముందు ఆగింది. మెల్లగా రవి కారువైపు నడిచాడు.

# 11

తాళంతీసి, తలుపు తెరిచి కామరాజు లోపలకు వెళ్ళాడు. టిఫిన్ ప్లేటును టీపాయిమీద పెట్టాడు. దేవర్ వైపు అతడు సూటిగా చూశాడు.

"టిఫిన్ తిను!" అన్నాడు కామరాజు.

అతడు టిఫిన్ ప్లేటును అందుకున్నాడు.

"నేనిక్కడ ఎంతకాలం ఉండాలి?"

"మా పని పూర్తయినదాకా!"

"అటుపైన నన్ను వదిలేస్తారా?"

కామరాజు వ్యంగ్యంగా నవ్వాడు.

"నిన్ను వదలం! నువ్వు బయటకెళ్తే నా గురించి

వాగుతావు" అన్నాడు కామరాజు.

"అయితే నన్నేం చేస్తావు?"

"నువ్వు ముఖ్యమంత్రి సెక్యూరిటీగార్డువిగా! అతడు పైకి వెళ్ళినపుడు నిన్నూ అతడితో పంపుతాం!" అన్నాడు కామరాజు.

ప్లేటును అతడు ఆమాంతంగా కామరాజువైపు విసిరాడు.

చటుక్కున కామరాజు పిస్టల్ని బయటకుతీసి అతడివైపు గురిపెట్టాడు.

"పిచ్చివేషాలేస్తే చస్తావు! చేతులెత్తి కూర్చో!" అర్చాడు కామురాజు.

దేవర్ వెనక్కు జరిగాడు. చేతులెత్తి సోఫాలో కూర్చున్నాడు.

"మిష్టర్ నన్ను వదిలేయి. నా తల్లికి కళ్ళులేవు. నేను లేకుండా ఆమె బతకలేదు" దేవర్ వేడుకున్నాడు.

"నా కూతుళ్ళను చూడకుండా నేనుండలేనని ఒకప్పుడు నే ననుకున్నాను. ముఖ్యమంత్రి షూట్ చేయించి నా కూతుళ్ళిద్దర్నీ చంపించాడు. వాళ్ళు పోయినా నేనింకా బతికే ఉన్నాను. నీ తల్లి కూడా నాలాగే బతికి వుంటుంది!" అన్నాడు కామరాజు.

దేవర్ జవాబివ్వలేదు. ఏం చెప్పినా అతడు వినడు. అతడితో మాట్లాడ్డం లాభించదు!

కామరాజు బయటకు కదిలాడు. తలుపు మూసి తాళం వేశాడు.

ఆనాటి రాత్రి తన డ్యూటీ అయ్యాక రవి యింటికి చేరుకున్నాడు. మామూలు దుస్తులు ధరించి అతడు రహస్యంగా కామరాజు యింటికి వెళ్ళాడు.

కామరాజు అతటివైపు నవ్వుతూ చూశాడు.

"రేపు ఇండిపెండెన్స్ డే! ముఖ్యమంత్రి ఫ్లాగ్ ను పైకి పంపే సమయంలో అతడిని నువ్వు పైకి పంపేయాలి" అన్నాడు కామరాజు.

"మీరు భయపడకండి. అంతా అనుకున్న ప్రకారం జరుగుతుంది" అన్నాడు రవి.

కామరాజు వైపు చూశాడతను. పిశాచంలా ఉన్నాడతను. పగ అతడి హృదయంలో, కళ్ళలో మండుతోంది!

"నువ్వు యిక్కడకు రావడం యెవ్వరూ చూడలేదుగా?"

"ఎవ్వరూ చూడలేదు."

కామరాజు లేచాడు. అతడితో కరచాలనం చేశాడు.

"రవీ, రేపు ఈపాటికి మనం షాంపేన్ తాగుతూ ఉంటాం" అన్నాడు కామరాజు.

"తాగడానికి నేనుండను. మీరే తాగాలి" అన్నాడు రవి.

అతడికి బైబై చెప్పి రవి వెళ్ళిపోయాడు. ఆటోలో దేవర్ యింటికి చేరుకున్నాడు.

"మీకోసమే చూస్తున్నా" అంది కాంతమ్మ.

"ఏమిటి సంగతి?" అడిగాడు రవి.

"నేను యింటికి పోవాలి. నా కూతురి ఆరోగ్యం బాగా లేదు."

"వెళ్ళిరా" అన్నాడతను.

కాంతమ్మ వెళ్ళిపోయింది. అతడు తల్లి గదిలోకి వెళ్ళాడు. ఆమె నిద్రపోతోంది. మౌనంగా అతడు తన గదికి చేరుకున్నాడు.

# 12

ఇండిపెండెన్స్ డే!

ముఖ్యమంత్రి విజయచంద్రన్ వెనకనే రవి నిలబడి ఉన్నాడు. ఫ్లాగ్ హోయిస్టింగ్ కార్యక్రమం సాగుతోంది.

మంత్రులందరూ లైనులో నిలబడి ఉన్నారు. ఫుల్ సూట్‌లో ఉన్న కామరాజు దూరంనుంచి ప్రజలమధ్య నుంచి, రవివైపు డేగలా చూస్తున్నాడు—

కామరాజు వేళ్ళతో సౌజ్ఞ చేయగానే తను షూట్ చేయాలి. రవి ఆలోచిస్తున్నాడు.

ముఖ్యమంత్రి విజయచంద్రన్ నవ్వుతూ తాడు కొన పట్టుకున్నాడు. కామరాజు వేళ్ళతో సౌజ్ఞ చేశాడు.

రెండుసార్లు రవి పిస్టల్ భయంకరంగా మ్రోగింది.

"మీ రిక్కడే వుండండి" అని విజయచంద్రాన్ని హెచ్చరించి రవి పరుగెత్తాడు.

నడిచిపోతున్న కామరాజును బలంగా పట్టుకున్నాడు.

ముఖ్యమంత్రి, యితర మంత్రులు, పోలీసు ఆఫీసర్లు అక్కడకు వెళ్ళారు. కామరాజు కోటుజేబులో వున్న పిస్టల్ని రవి బయటకు లాగాడు. ముఖ్యమంత్రికి చూపించాడు.

"ఈయన మీ వైపు పిస్టల్ గురిపెట్టడం చూసి గాలిలోకి షూట్ చేశాను" అన్నాడు రవి.

"కామరాజుగారా?" అన్నాడు ముఖ్యమంత్రి.

"మీ సెక్యూరిటీగార్డు చెప్పింది నిజంకాదు. నేను మిమ్మల్ని యెందుకు చంపుతాను?" అన్నాడు కామరాజు.

రవి ముఖ్యమంత్రివైపు వినయంగా చూశాడు.

"దేవర్, యేదేనా చెప్పాలా?" అడిగాడు ముఖ్య మంత్రి.

"నేను దేవర్‌ని కాను, సార్. దేవర్‌కీ నాకూ బాగా పోలికలు వున్నాయి. దేవర్‌ని ఖైదీ చేసి, అతడి స్థానంలో నన్ను ప్రవేశపెట్టాడొక వ్యక్తి. మిమ్మల్ని చంపమన్నాడు."

"ఎవరా వ్యక్తి?"

"ఆయనే! కామరాజు గారు! నేను మిమ్మల్ని చంపడం లేదని గ్రహించి తనే పిస్టల్ని మీవైపు తిప్పారు. అదే క్షణంలో నేను షూట్ చేశాను. ఆయన పిస్టల్ని జేబులో పడేసుకుని పోతూంటే పట్టుకున్నాను" అన్నాడు రవి.

"దేవర్ యెక్కడున్నాడు?" అడిగాడు ముఖ్య మంత్రి.

"ఆయన యింట్లో" అన్నాడు రవి.

"దేవర్ నా యింట్లో లేడు! అతడిని చంపి నా తోటలో పాతేశాను. అటుపైన యిక్కడకు వచ్చాను. నన్ను నమ్మించి ఈ దుర్మార్గుడు నాకు ద్రోహం చేశాడు" అన్నాడు కామరాజు.

కొందరు పోలీసు ఆఫీసర్లు కామరాజును జీప్‌లో యెక్కించుకుని వెళ్ళిపోయారు.

ముఖ్యమంత్రి రవివైపు చూశాడు.

"నీ పేరు?"

"రవి, సార్."

"మరో సెక్యూరిటీ గార్డును నియమించిన దాకా నువ్వు అదే పదవిలో వుండు" అన్నాడు ముఖ్యమంత్రి.

ఇండిపెండెన్స్ డే కార్యక్రమం పూర్తయింది. జండా

జయప్రదంగా ఎగురుతోంది!

ముఖ్యమంత్రి విజయచంద్రన్ తన కారులో కూర్చు న్నాడు. తలుపు మూసి రవి ముందు సీటుమీద కూర్చు న్నాడు.

పోలీసు కమీషనర్ కరీమ్ కారు దగ్గరకు పరుగెత్తు కొచ్చాడు.

"తోటలో తవ్వి దేవర్ శవాన్ని బయటకు తీయించాం. కామరాజును అరస్టు చేశాం!" అన్నా డతను.

కారు కదిలింది. ముఖ్యమంత్రి మెదడులో ఆలోచ నలు సాగుతున్నాయి.

"రవీ!" పిల్చాడతను.

వెనక్కి తిరిగాడు.

"ఇంతకు ముందే దీన్ని గురించి నువ్వు ఎందుకు చెప్ప లేదు?"

"ఆయన యేం చేస్తాడో అని భయపడ్డాను."

"పోలీసునులు నిన్నూ అరస్టుచేస్తారు. ఆ కేసు ముగిస్తే నా పెర్సనల్ సెక్యూరిటీ గార్డుగా వుండొచ్చు. కాని నువ్వు ఒక సేవ చెయ్యాలి."

"ఏమిటో చెప్పండి!"

"తన కొడుకు పోయాడని తెలిస్తే దేవర్ తల్లి గుండె బాదుకుని చస్తుంది. ఆమె యెంతో కాలం బతికుండదు. అంతవరకూ ఆమె కొడుకులా నటించి, ఆమెకు ఆనందాన్ని యియ్యి."

"అలాగే, సార్" అన్నాడు రవి.

ముఖ్య మంత్రి నవ్వుతూ రవితో కరచాలనం చేశాడు.

# 40

"గాడ్ బ్లెస్ యు!" అన్నాడు ముఖ్య మంత్రి.

తారురోడ్డుమ్మీట కారు మాసుకుపోయింది. ఇంటిముందు కారు ఆగింది. ముఖ్యమంత్రి దిగాడు.

ఎస్. పి. సుందరం రవి చెయ్యి పట్టుకున్నాడు.

"నిన్ను అరెస్టు చేస్తున్నాం" అన్నాడు సుందరం.

"మీ యిష్టం" అన్నాడు రవి నవ్వుతూ.

——:అ యి పో యి ం ది:——

# వజ్రాల దొంగలు

పి. అరుణ

అర్థరాత్రి—పన్నెండు గంటలు దాటి పది నిమిషాలు.

చలికాలం కావటంతో మనుషులంతా ఇళ్ళలో పడుకుని తలుపులు బిగించుకున్నారు.

ఆ భవనం బయట గేటు దగ్గర వున్న చిన్న కేబిన్ బయట బల్లమీద కూర్చున్న గూర్ఖా నిద్రతో కునికి పాట్లు పడుతున్నాడు. అతను ఆ రోజు సాయంత్రం కొంచెం మందు సేవించాడు.

అందువల్ల ఆ చీకటి వీధిలో గోడవారగా చప్పుడు చెయ్యకుండా నడిచివచ్చిన ఇద్దరుమనుషులను గూర్ఖా గమనించే అవకాశం లేకుండా పోయింది.

నిద్రపోతున్న గూర్ఖాను చూడగానే వాళ్ళకు సంతోషం కలిగింది. నిద్రపోతున్నాడని అతన్ని వదలేదు.

ఆ ఇద్దరిలో ఒకడైన రాజు పాంటుజేబులోనించి క్లోరోఫాం చల్లిన కర్చీఫ్ తీసి గూర్ఖా మొహంమీద

వుంచి గట్టిగా అదిమాడు వెనుకనిల్చుని.

రెండు నిమిషాల తర్వాత గూర్ఖా స్పృహ కోల్పోయాడని గ్రహించి ఇద్దరూ అతన్ని కేబిన్‌లోకి లాగి ఓ కార్నర్‌లో పడుకో బెట్టారు.

క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా ఇద్దరూ గోడ మీదనించి లోపలకు దూకారు.

తోటలో మొక్కలు గుబురుగా పెరిగి వున్నాయి. దీపం దూరంగా ఎక్కడో వెలుగుతోన్నది.

రెండు నిమిషాలు అక్కడే నిల్చుని చూశారు.

అంతా నిశ్శబ్దంగా వుంది.

అక్కడినించి కదిలి రివ్వున ముందుకు దూసుకు వెళ్లారు. వాళ్ళిద్దరి నీడలు తోటలో వెలుగుతున్న దీపం వెలుగులో పొడుగ్గా సాగుతున్నాయి.

నీటిగొట్టం దగ్గర ఆగిపోయారు.

ముందు విక్రమ్ దాన్ని పట్టుకుని పైకి పాకాడు. అతని తర్వాత రాజుకూడా పైకి వెళ్లాడు.

బాల్కనీలో దీపం వెలగడంలేదు.

నడవాలో గుడ్డిదీపం వెలుగుతోంది. నడుస్తున్నారు.

విక్రమ్ బాగా పొడుగ్గా ఉన్నాడు — సన్నగా వున్నాడు—రాజు కొంచెం పొట్టిగా వున్నాడు. లావుగా వున్నాడు.

వరుసగా చూసుకుంటూ నడుస్తున్నప్పుడు వాళ్ళకు తాళాలు బిగించి వున్న గదులు కనిపించాయి.

ఓ గది దగ్గర ఆగిపోయారు.

ఆ గదికి అద్దాల కిటికీలు వున్నాయి. అద్దాల వెనుక తెరలు వేల్లాడుతున్నాయి.

వంగి చూశాడు విక్రమ్.

ఫోమ్ బెడ్ మీద పడుకుని గాఢనిద్రలో వున్న సేట్ చందన్‌లాల్ కనిపించాడు.

చిన్నగా నవ్వాడు విక్రమ్.

నవ్వుతూ రాజును చూశాడు.

రాజు భుజానికి వున్న నల్లని బ్యాగ్‌లోనించి ఓ పరికరాన్ని బయటకు తీశాడు. నిమిషాల్లో పొడుగ్గా వున్న కిటికీ అద్దాన్ని కోశాడు.

అద్దం కిందపడి చప్పుడవకుండా పట్టుకుని కింద పెట్టాడు విక్రమ్.

లోపలకు వెళ్ళారు.

చందన్‌లాల్ వెల్లకింతలా పడుకుని వున్నాడు. నిద్రలో అతని పెదవుల మధ్యనించి ఏదో సన్నని శబ్దం బయటకు వస్తోన్నది.

ఆ గదిలోనే ఓ కార్నర్‌లో వున్న సేఫ్‌ను ఆ ఇద్దరూ చూశారు.

వాళ్ళ కళ్ళు మెరిశాయి.

"బాస్ చెప్పింది ఈ సేఫ్ గురించే కదూ?"

"అవును" తల వూపాడు రాజు.

"చందన్‌లాల్‌ను నిద్రలేపకుండా మనం ఈ సేఫ్‌ను తెరువగలమా?" అడిగాడు విక్రమ్.

"అసాధ్యం. ఐనా నేను సేఫ్ తెరవటానికి అవసరమైన సాధనాలన్నీ తీసుకురాలేదు. అందువల్ల సేట్‌ను నిద్రలేపక తప్పదు."

ఇద్దరూ జేబుల్లోనించి పిస్తోళ్ళు బయటకు తీశారు. చందన్‌లాల్‌కు రెండువైపులా నిల్చున్నారు.

రాజు—చందన్‌లాల్ భుజంమీద పిస్తోలు మొనతో పొడిచాడు. రెండు నిమిషాలు ఆగి కళ్ళు తెరిచి ఉలిక్కి

పడ్డాడు చందన్‌లాల్.

భయంతో పెద్దగా అరవటానికి నోరు తెరిచాడు. క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా రాజు పిస్తోలును చందన్‌లాల్ నోట్లో వుంచి—

"అరిస్తే పిస్తోలు పేలుతుంది. చస్తావ్" అన్నాడు క్రూరంగా చూస్తూ....

చందన్‌లాల్ కళ్ళు మరింత భయంతో విచ్చుకున్నాయి.

ఆ ఇద్దరు దొంగలూ దున్నపోతులాంటి గూర్ఖాను తప్పించుకుని లోపలకు ఎలా రాగలిగారో ఆయనకు అంతుపట్టలేదు.

విక్రమ్ ప్యాంటు జేబులోనించి సెలో టేప్ తీసి దాన్ని చందన్‌లాల్ నోటికి అంటించివేశాడు.

లేచి నిల్చోమన్నాడు.

నిల్చున్నాడు చందన్‌లాల్.

"ఇక నువ్వు నేను చెప్పినట్టు చెయ్యి. ఏ మనిషికైనా ప్రాణాలే ముఖ్యం చందన్‌లాల్. ప్రాణాలు వుంటే ఎంత సంపదనైనా మళ్ళీ సంపాదించవచ్చు. ఈ విషయం అరవైయేళ్ళున్న నువ్వు తెలుసుకునే వుంటావు. అందువల్ల నీ ప్రాణాలు దక్కించుకోవాలంటే నేను చెప్పినట్టుగా చెయ్యి. నీ దగ్గర కోటి రూపాయలు ఖరీదు చేసే ఎనిమిది వజ్రాలు వున్నాయి. వాటిని నువ్వు ఈ గదిలో వున్న సేఫ్‌లో భద్రంగా దాచావు. ఆ ఎనిమిది వజ్రాలనూ సేఫ్ తెరిచి మాకివ్వు. అలా ఇవ్వటంవల్ల నీ ప్రాణాలను కాపాడుకునే అవకాశం వుంటుంది" అన్నాడు విక్రమ్.

సేట్ చందన్‌లాల్ తలను అడ్డంగా వూపాడు.

'ఆ వజ్రాలు నా దగ్గర లేవు' అన్నట్టుగా సైగ చేసి చూపాడు చందన్‌లాల్.

చిన్నగా నవ్వాడు విక్రమ్.

నవ్వి "ఈ ప్రపంచంలో ఎవరైనా పొరపాటుపడే అవకాశం వుంది. కాని మా బాస్ అలా పొరపడే అవకాశంలేదు. ఈ విషయం నీకు తెలీదు. నువ్వు వారం రోజుల క్రితం విదేశాలనించి వచ్చిన మనుషుల దగ్గర ఆ వజ్రాలను కొన్న విషయం మా బాస్‌కు తెలిసింది. అందువల్లనే ఆయన మా ఇద్దర్నీ పంపించాడు. కాబట్టి నువ్వు బుకాయించి ప్రయోజనంలేదు" అన్నాడు.

ఐనా చందన్‌లాల్ మళ్ళీ ఆ వజ్రాలు లేవన్నట్టు తల వూపాడు.

"నువ్వు లేవని చెప్పినా నిన్ను చంపి ఆ సేఫ్‌ను తెరుస్తాము. అందుకు నువ్వు ఒప్పుకుంటావా?" అన్నాడు రాజు.

వద్దన్నాడు చందన్‌లాల్.

"ఐతే.... సేఫ్ తెరిచి ఆ ఎనిమిది వజ్రాలనూ ఇచ్చెయ్యి. నీ ప్రాణాలు దక్కించుకో" అన్నారిద్దరూ ఒకేసారి.

చందన్‌లాల్‌కు యేడుపు వచ్చింది. ఏడ్చినందువల్ల ప్రయోజనం వుండదని తలగడ కిందినించి సేఫ్ తెరిచే కీస్ తీసుకుని సేఫ్ దగ్గరకు నడిచాడు.

ఐదు నిమిషాల తర్వాత సేఫ్ తెరిచాడు. ఆయన సేఫ్ తెరిచేలోపుగా ఆ ఇద్దరూ నాలుగుసార్లు పిస్తోలుతో ఆయన్ని బెదిరించవలసి వచ్చింది.

కోటిరూపాయలు ఖరీదు చేసే వజ్రాలను ఇద్దరు మనుషులకు ప్రాణాలకు భయపడి ఇచ్చెయ్యటం ఆయనకు

ఇష్టంలేక పోయింది.

ఐనా రెండు పిస్తోళ్ళకు — క్రూరులైన ఇద్దరు దొంగలకు భయపడి వాటిని ఇవ్వక తప్పటంలేదు.

సేఫ్ తెరుచుకుంది.

మొదటి అరలో కొంత కరెన్సీ వుంది. దాన్ని లాక్కుని నల్లని బ్యాగ్ లో వుంచాడు రాజు.

తర్వాత పిస్తోలు మొనతో విక్రమ్ వెన్నులో పొడిచిన తర్వాత రహస్య అరను కూడా తెరిచి అందులో వున్న చిన్న పెట్టెలో వున్న ఎనిమిది వజ్రాలనూ తీశాడు చందన్ లాల్.

ఆ వజ్రాల పెట్టెను తీసుకున్న తర్వాత చందన్ లాల్ కు తన ప్రాణంకన్నా ఆ వజ్రాలే విలువైనవిగా అనిపించాయి. అందుకే మొండిగా ఆ వజ్రాలను ఇవ్వనని మొరాయించాడు.

విక్రమ్ నవ్వి "నువ్వు ఆఖరి నిమిషాల్లో తెలివి తక్కువగా ప్రవర్తిస్తున్నావు. అందువల్ల నువ్వు ప్రాణాలు పోగొట్టుకుంటావు" అన్నాడు.

చందన్ లాల్ వినలేదు.

రాజు ఏమరుపాటుగా వున్నాడని తెలుసుకున్నాడు. రాజు దృష్టి చందన్ లాల్ చేతిలో వున్న వజ్రాల పెట్టె మీద వున్నది.

అందుకే అతన్ని వెనక్కి నెట్టి ఆ పెట్టెతో అక్కడి నించి పరుగుదీసే ప్రయత్నం చేశాడు సేట్.

విక్రమ్ చేతిలో వున్న సైలెన్సర్ బిగించిన పిస్తోలు రెండుసార్లు పేలింది. సేట్ బోర్లాపడిపోయాడు ముందుకు — చేతిలో వున్న వజ్రాల పెట్టె పడిపోయింది.

విక్రమ్ దాన్ని తీసుకుని "క్విక్.... వెంటనే మనం

ఇక్కడినించి బయటపడాలి" అన్నాడు రాజుతో.

రాజు మాట్లాడలేదు.

మరోసారి తెరచివున్న సేఫ్‌ను తెరిచి అందులో ఉన్న రెండు బంగారు గొలుసులను ప్యాంటు జేబులో పెట్టుకుని ఆ గదిలోనించి వచ్చిన దారిలోనే బయట పడ్డాడు. అప్పటికే విక్రమ్ పీటిగొట్టం పట్టుకుని కిందికి జారే ప్రయత్నంలో వున్నాడు.

ఆ ఇద్దరూ సేట్ చందన్‌లాల్ బతికివున్నాడో— ప్రాణాలు వదిలాడో గమనించకుండానే వెళ్ళిపోయారు.

కాని — చందన్‌లాల్ చావలేదు. ఆయన బతికే ఉన్నాడు. కొన ఊపిరితో ఉన్నాడు. ఆ కొన ఊపిరితోనే నోటికి ఉన్న టేప్‌ను లాగేసుకుని ఆ గదిలోనే ఉన్న ఫోన్ దగ్గరకు వెళ్ళి పోలీసులకు విక్రమ్—రాజు తన దగ్గర దోచుకుని వెళ్ళిపోయిన ఎనిమిది వజ్రాల గురించి చెప్పాడు.

## 2

పబ్లిక్ టెలిఫోన్ బూత్. లోపలకు వెళ్ళాడు విక్రమ్. డయల్ చేశాడు. అవతలివైపు ఫోన్‌ను ఎవరో తీశారు.

రాజు బూత్ వెనుక చీకట్లో నిలబడి ఉన్నాడు.

"బాస్, మోసం జరిగింది"

"ఏమయ్యింది?"

"సేట్ చందన్‌లాల్ ఆ ఎనిమిది వజ్రాలను మీరు చెప్పినట్టుగా తన గదిలో ఉన్న సేఫ్‌లో ఉంచలేదు. షాపులో ఉంచాడుట. పది వేలు డబ్బు దొరికింది సేఫ్‌లో."

"డామిట్....అలా జరగటానికి వీల్లేదు. సేట్ ఆ వజ్రాలను తన ఇంట్లో సేఫ్‌లోనే దాచి వుంచాడని

నాకు గట్టిగా ఇన్ఫర్ మేషన్ వచ్చింది."

"తర్వాత సేట్ వాటిని సేఫ్‌లోనించి తీసి షాపులో ఉంచాడేమో!"

"నో....కోటి రూపాయల విలువైన ఆ వజ్రాలను సేట్ షాపులో ఉంచడు. ఇంట్లోనే ఎక్కడో దాచి ఉంటాడు. మీరు అడగలేదా?"

"అడిగాం. చెప్పలేదు. తప్పించుకునే ప్రయత్నం చేశాడు. పిస్తోలుతో కాల్చి అక్కడినించి పారిపోయి వచ్చేశాం. అప్పటికే సేట్ ఇంట్లో ఎవరో నిద్రలేచారు."

కోపంగా అన్నాడు బాస్ "నా ప్లానంతా నాశనం అయ్యింది. ఆల్ రైట్ .... మీరిద్దరూ మన స్థావరానికి వచ్చెయ్యండి."

"బాస్ .... వెంటనే రావటానికి కుదరదు. ఇప్పుడే సేట్ ఇంటివైపు రెండు పోలీసు జీపులు వెళ్ళటం చూశాము. అంటే యెవరో పోలీసులకు ఫోన్ చేసి ఉంటారు. అందువల్ల తెల్లవారేలోపల అక్కడకు చేరు కుంటాం."

బాస్ ఫోన్ పెట్టేశాడు.

విక్రమ్ బయటకు వచ్చి చీకట్లో నిలబడివున్న రాజాను చూశాడు.

"ఏమన్నాడు బాస్?" ఆత్రంగా అడిగాడు రాజా.

"నా మాటలు నమ్మేశాడు. ఇంతకీ సేట్ ఇంటివైపు పోలీసు జీపులు ఎందుకు వెళ్ళాయి? సేట్ చచ్చిపోలేదా? మనం చూసి వుండాల్సింది. చందన్‌లాల్ బతికివుంటే మనల్ని గురించి పోలీసులకు వర్ణించి చెబుతాడు. అందు వల్ల మనం చిక్కుల్లో ఇరుక్కోవలసి వుంటుంది" అన్నాడు విక్రమ్.

"అవును. ఆ విషయం గురించి తర్వాత ఆలోచిద్దాం. ముందు మనం వజ్రాలను పంచుకుందాం. చెరి నాలుగు వజ్రాలు అంటే ఒక్కొక్కరికి యాభై లక్షలు. అదృష్టం అంటే ఇలా వుండాలి. ఈ పనికి బాస్ మనల్ని పంపించటం మన లక్" అన్నాడు రాజు.

"లక్ అంటే మనదే. మనం సంపాదించి బాస్ చేతిలో వుంచటం నిజంగా అవివేకం. ఈ వజ్రాలను మనం ఏ విదేశీయుడికైనా సులభంగా అమ్మకోవచ్చు. ముందు నా గదికి వెళదాం. వజ్రాలను దాచి వుంచి బాస్ దగ్గరకు వెళ్ళాలి. అక్కడ మనం జాగ్రత్తగా వ్యవహరించాలి" అన్నాడు విక్రమ్.

తల వూపాడు రాజు.

కొంత సేపటికి ఇద్దరూ విక్రమ్ గదికి వెళ్ళారు. అక్కడ ఎవ్వరూ తెలుసుకోలేని రహస్య ప్రదేశంలో ఆ ఎనిమిది వజ్రాలనూ దాచి వుంచారు.

అక్కడే కొంచెం విస్కీ సేవించారు.

కొంచెం సేపు ఆ వజ్రాలను అమ్మి ఆ డబ్బుతో యే దేశానికి పారిపోవాలో చర్చించుకున్నారు.

ఆ పైన ఓ గంటకు బాస్ సావరాన్ని చేరుకున్నారు.

అప్పుడు తెల్లవారటానికి ఇంకో అరగంట సమయముంది.

బాస్ ఈ ఇద్దరికోసమే ఎదురుచూస్తున్నాడు. అతన్ని కలుసుకున్నారు వెళ్ళగానే—

ఆ ఇద్దరూ బాగా నమ్మకమైన మనుషులుగా బాస్ దృష్టిలో ఓ ఆలోచన వున్నందువల్ల అనుమానించలేదు.

సేఫ్‌లో దొరికిన పదివేలూ బాస్‌కు ఇచ్చాడు విక్రమ్.

తనకు దొరికిన రెండు బంగారు గొలుసులను కూడా బాస్‌కు ఇచ్చాడు రాజు.

"ఐతే సేట్ చందన్‌లాల్ ఆ ఎనిమిది వజ్రాలనూ షాపులో వుంచానని చెప్పాడన్నమాట" అన్నాడు బాస్ చుట్టపొగ వదులుతూ.

"అవును బాస్" అన్నాడు రాజు.

"ఐతే.... షాపు దోపిడీకి ముహూర్తం పెట్టాలి."

"త్వరగా పెట్టండి బాస్. ఆలస్యమైతే ఆ వజ్రాలను మరెక్కడైనా దాచే అవకాశం వుంది" అన్నాడు విక్రమ్—

తెల్లవారింది.

బయట ప్రపంచంలో న్యూస్ పేపర్లు రిలీజైనాయి. వాటిల్లో సేట్ చందన్‌లాల్ ఇంట్లో ఇద్దరు దొంగలు కోటిరూపాయల వజ్రాలను అపహరించుకు పోయారని పోలీసులకు చెప్పి చందన్‌లాల్ ప్రాణాలు వదిలాడనే వార్త వుంది.

ఆ ఇద్దర్లో ఒకడు పిస్టోలుతో రెండుసార్లు కాల్చాడనీ ఇద్దరిలో ఒకడు పొడుగ్గా వున్నాడనీ— రెండోవాడు పొట్టిగా వున్నాడనీ వాళ్ళని వర్ణించి పోలీసులకు చెప్పాడని కూడా వుంది.

న్యూస్ పేపర్లు బయటకొచ్చిన పదినిమిషాలకు బాస్‌కు ఓ ఫోన్ కాల్ వచ్చింది.

ఎవరో మాట్లాడారు.

ఫోన్‌లో మాట్లాడుతున్నప్పుడే బాస్ కళ్ళు ఎర్రగా మారిపోయాయి. పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

వెంటనే ఫోన్ పెట్టేసి విక్రమ్‌ను రాజును పిలిపించాడు.

ఎదురుగా నిల్చున్నారు— బాస్ ముహం చూడటం

తోనే ఇద్దరూ ఏదో వార్త బాస్‌కు చేరిందని తెలుసుకున్నారు.

"ఆ వజ్రాలు యెక్కడ దాచారు?"

"బాస్!" ఆశ్చర్యంగా అన్నాడు విక్రమ్.

"నటించకండి....ఆ వజ్రాలు సేట్ దగ్గర్నించి తీసుకున్నారు. సేట్‌ను కాల్చి వచ్చేశారు. చందన్‌లాల్ చావలేదు. పోలీసులను ఫోన్ చేసి పిల్చి మీ ఇద్దరి గురించి వజ్రాల గురించీ చెప్పి చచ్చిపోయాడు. కాబట్టి— మర్యాదగా ఆ వజ్రాలను ఇచ్చెయ్యండి" అన్నాడు బాస్.

"మమ్మల్ని నమ్మండి బాస్. చావబోయే ముందు సేట్ మా ఇద్దరిమీదా కసి తీర్చుకునేందుకు పోలీసులతో ఆ వజ్రాలను మేము తీసుకున్నామని చెప్పి వుంటాడు. నిజంగా వాటిని మాకు ఇవ్వలేదు" అన్నాడు రాజు.

అంతే—

అతని మొహం అదిరిపోయింది.

తూలి వెనక్కు పడిపోయాడు.

అతన్ని లేవదీసి డొక్కలో పిడికిలితో బలంగా పొడిచాడు బాస్.

బాధగా అరిచాడు రాజు.

ఐనా నిజం చెప్పలేదు.

"విక్రమ్, మీ ఇద్దరూ నమ్మకమైన మనుషులని ఈ పనికి మిమ్మల్ని పంపాను. మీరు నాకే ద్రోహం చెయ్యాలని చూశారు. ఇప్పటికైనా ఆ వజ్రాలను తెచ్చి ఇవ్వండి. మిమ్మల్ని క్షమించి ప్రాణాలతో వదులుతాను. లేకపోతే మిమ్మల్ని రకరకాలుగా హింసించి మీ చేతే ఆ నిజాన్ని చెప్పిస్తాను" అన్నాడు.

"బాస్, మిమ్మల్ని ఎలా నమ్మించాలో మాకు తెలీటం లేదు. ఎన్నో యేళ్ళుగా మీ దగ్గర పనిచేస్తున్నాం. మా గురించి మీకు తెలుసుకదా? ఆ ఇడియట్ సేట్ మా కొంప ముంచాడు—వాడ్ని కాల్చినందుకు" అన్నాడు విక్రమ్.

"ఇడియట్!"

ఈడ్చి విక్రమ్ చెంపమీద కొట్టాడు బాస్.

పక్కకు పడిపోయాడు విక్రమ్.

"డర్టీ రోగ్స్....మీ ఇద్దరి అంతూ చూస్తాను. కోటి రూపాయల వజ్రాలను మాయం చేస్తారా?"

ఐదు నిమిషాల్లో బాస్ ఆజ్ఞమీద ఇద్దరు అనుచరులు విక్రమ్‌నీ రాజునీ నైలాన్ తాళ్ళతో చేతులను వెనక్కు విరిచి కట్టేశారు.

అప్పుడు బాస్ పొడుగాటి కొరడా తీసుకుని ఇద్దరినీ ఆ వజ్రాల గురించి చెప్పమని బాగా హింసించాడు.

ఎంతగా హింసించినా ఆ ఇద్దర్లో యే ఒక్కరూ నోరు తెరవలేదు. స్పృహ తప్పిపోయారు.

# 3

విక్రమ్—రాజు వాళ్ళిద్దరికీ కాపలాగా అక్కడ ఓ దున్నపోతులాంటి మనిషి కుర్చీలో కూర్చుని వున్నాడు.

వాడి ఆలోచనలు ఆ సమయంలో కోటిరూపాయలు ఖరీదుచేసే ఆ ఎనిమిది వజ్రాల గురించే వున్నాయి. వాటిల్లో ఒక్క వజ్రం తను సంపాదించగలిగినా తన జాతకం మారిపోతుంది.

ఎలాగైనా బాస్‌కంటే ముందుగా ఆ ఇద్దరి దగ్గిర్నించీ ఆ వజ్రాలు యెక్కడ వున్నాయో తను తెలుసుకోవాలనుకున్నాడు.

అతని పేరు జాకబ్.

అందుకే ఆ ఇద్దరికీ స్పృహ వచ్చేవరకూ అక్కడే కాచుకుని వున్నాడు.

ఎప్పటికో వాళ్ళకు స్పృహ వచ్చింది.

"దాహం.... దాహం" అని అరిచారు ఇద్దరూ—

వెంటనే వాళ్ళకు జగ్‌తో నీళ్ళు తాగించాడు జాకబ్.

"థాంక్స్" అన్నారు.

"ఊరికే థాంక్స్ చెబితే చాలదు. మీరు తెలివిలోకి రాగానే మిమ్మల్ని ఎన్ని రకాల హింసలయినా పెట్టి, మీ చేత ఆ రహస్యాన్ని చెప్పించమని బాస్ నాకు చెప్పి వెళ్ళిపోయాడు. కాని నేను అన్ని హింసలను పెట్టదల్చుకోలేదు. ఎందుకంటే మీరుకూడా బాస్ అనుచరులే. మనందరం ఒకేచోట పనిచేస్తున్నాం. అందువల్ల వెంటనే ఆ వజ్రాలను ఎక్కడ దాచివుంచారో చెప్పెయ్యండి" అన్నాడు జాకబ్.

"ఏమిటీ? మేము అబద్ధం చెబుతున్నామని నువ్వుకూడా నమ్ముతున్నావా?" అన్నాడు రాజు.

"నేనే కాదు. ఎవరైనా నమ్ముతారు. చావబోయే మనిషి యెప్పుడూ అబద్ధం చెప్పడు. ఆ వజ్రాలను మీరు తీసుకుపోయారని సేట్ చందన్‌లాల్ పోలీసులకు చెప్పిన తర్వాతనే చచ్చిపోయాడట. కాబట్టి మీరు ఆ వజ్రాలను కొట్టెయ్యటానికి ఈ ప్లాను ఆలోచించారు. అవును కదూ?"

"కాదు. అంతా అబద్ధం. చందన్‌లాల్ మా ఇద్దరి మీదా వున్న కోపంతో పోలీసులకు అలా చెప్పాడు. నిజం మా ఇద్దరికే తెలుసు."

"అవును. నిజం మీ ఇద్దరికే తెలుసు—ఆ వజ్రాలను

యెక్కడ దాచివుంచారో .... త్వరగా చెప్పండి. ఐనా కష్టపడి మీరు సంపాదించిన అంత విలువైన వజ్రాలను తెచ్చి బాస్‌కు అప్పగించాలంటే మీకు బాధగానే వుంటుంది. మీతో కలిసి నేను కూడా వచ్చి వుంటే నేనుకూడా ఇలాగే చేసేవాడిని" అన్నాడు జాకబ్ సిగరెట్టు వెలిగించి—

జాకబ్ మాటలకు వాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

"అందుకే—నువ్వు నిజంగానే ఇలా అంటున్నావా? లేక బాస్ నిన్ను మామీద గూఢచారిగా వుంచివెళ్ళాడా? కూపీలాగటానికి" అనడిగాడు రాజు.

"నిజంగానే అంటున్నాను బ్రదర్. కష్టమంతా మనది. రిస్కు తీసుకునేది మనం. సంపాదించినదాన్ని అనుభవించేది బాస్. ఇది అన్యాయం. మనందరం ఒకటి. బాస్ మన శ్రమను దోచుకుంటున్నాడు. అందుకే మనం బాస్‌ను మోసగించాలి."

ఒకర్నొకరు చూసుకున్నారు—విక్రమ్—రాజు.

"నీ మాటల్ని నమ్మలేకుండా వున్నాం."

"నన్ను నమ్మకపోతే మీకే నష్టం... ఆ రహస్యాన్ని చెప్పేవరకు బాస్ మిమ్మల్ని ప్రాణాలతో వదలడు. బాస్ గురించి మీకూ తెలుసు. బాస్ మొండిమనిషి."

"ఐతే... ఇంతకీ నువ్వనేదేమిటి?" అడిగాడు విక్రమ్.

"మీరు దాచిన వజ్రాల రహస్యం నాకు తెలియజెయ్యాలి."

"అందువల్ల మాకు ప్రయోజనం యేమిటి?"

"ఆ వజ్రాలు నా చేతికి రాగానే నేను వచ్చి మిమ్మల్ని వదిలించి ఇక్కడినించి తప్పిస్తాను. ఆ వజ్రాలను ముగ్గురం పంచుకుందాం."

"ఇలా జరగదు జాకబ్. నిన్ను నమ్మటంవల్ల చెబుతున్నాను. ఆ వజ్రాలను ఎక్కడ దాచివుంచినదీ నీకు చెప్పినా నువ్వు తెలుసుకోలేవు. అందువల్ల నువ్వు మమ్మల్ని ఇక్కడినించి బయటకు తీసుకువెళ్ళు. వెళ్ళిన తర్వాత ఆ వజ్రాలను ముగ్గురం పంచుకుని వాటిని అమ్ముకుని ఎటైనా పారిపోదాం...." అన్నాడు విక్రమ్.

సిగరెట్ ని విసిరి కొంచెంసేపు ఆలోచించాడు జాకబ్. విక్రమ్ చెప్పిన ఆలోచన బావున్నట్టుగానే అనిపించింది.

"బయటకు వెళ్ళగానే మీరిద్దరూ నన్ను మోసం చేస్తే?" అనుమానంగా అడిగాడు.

"చెయ్యం. మన ముగ్గురం ఒకటి. మనం ఈ పరిస్థితుల్లో ఒకరొన్నొకరు నమ్మక తప్పదు."

జాకబ్ వాళ్ళిద్దరి కట్లు వూడదీశాడు.

ముగ్గురూ ఆ స్థావరంలోనించి జాగ్రత్తగా బయటపడ్డారు. అక్కడినించి విక్రమ్ గదిని చేరుకున్నారు.

"ఈ గదిలోనే వజ్రాలను దాచివుంచారా?" అడిగాడు జాకబ్.

"అవును. ఆ అటకమీద చిన్న ప్లాస్టిక్ పెట్టె వుంటుంది. దాన్ని కిందికి దించు. అందులోనే ఇంకో చిన్న పెట్టెలో వున్నాయి" అన్నాడు రాజు.

వెంటనే జాకబ్ అక్కడే ఉన్న టేబుల్ మీదకు ఎక్కటానికి వెనక్కు తిరిగాడు.

అంతే—విక్రమ్ చేతిలో ప్రత్యేకమైన సైలెన్సర్ అమర్చిన పిస్తోలు ఒకే ఒక్కసారి పేలింది. గుండు జాకబ్ వెన్నులోనించి దూసుకువెళ్ళింది. జాకబ్ చిన్నగా మూల్గి వెనక్కు విరుచుకు పడిపోయాడు.

"క్విక్.... టైమ్ లేదు. ముందు మనం ఇక్కడినించి

బయటపడాలి. మనం పారిపోయామని తెలియగానే బాస్ మనకోసం వేటకుక్కల్ని వదులుతాడు" అరిచాడు రాజు.

అప్పటికప్పుడే జాకబ్ శవాన్ని బాత్‌రూమ్‌లోకి ఈడ్చి లాక్ చేశారు.

ఆ తర్వాత ఐదు నిమిషాలకు ఇద్దరూ కావలసినవన్నీ రెండు బ్యాగ్‌లలో సర్దుకుని ఆ ఎనిమిది వజ్రాలతో ఆ గదినించి బయటపడ్డారు.

# 4

ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్ బయల్దేరటానికి సిద్ధంగా వుంది. సిగ్నల్ కూడా ఇవ్వబడింది.

ట్రెయిన్ నిండా క్రిక్కిరిసి వున్నారు జనం.

విక్రమ్—రాజు పరిగెత్తుకుంటూ అప్పుడే స్టేషన్‌లోకి ప్రవేశించారు.

సరిగ్గా అప్పుడే ట్రెయిన్ బయల్దేరింది. కొంచెం కూడా ఆలస్యం చెయ్యకుండా రివ్వున పరిగెత్తుకుంటూ వెళ్ళి కదులుతున్న ట్రెయిన్‌లోకి ఎక్కేశారు.

వాళ్ళు ఎక్కగానే రైలు వేగాన్నందుకుంది.

ఎంట్రెన్స్ డోర్ దగ్గర నిల్చుని ఒక్కసారి ఇద్దరూ వెనక్కి తిరిగి చూశారు.

ప్లాట్‌ఫారంమీద ఉస్మాన్ పరిగెత్తుకుంటూ వస్తున్నాడు.

"మై గాడ్. ఉస్మాన్ మనల్ని చూశాడు. పరిగెత్తుకొస్తున్నాడు" అన్నాడు రాజు కంగారుగా.

"భయంలేదు. వాడు ఈ ట్రెయిన్‌ని అందుకోలేడు. అంతేకాదు. ఈ రైలు మూడొందల కిలోమీటర్లు వెళ్ళే వరకూ ఎక్కడా ఆగదు. అందువల్ల మనకు వాడివల్ల

ప్రమాదంలేదు" అన్నాడు విక్రమ్.

వాళ్ళు చూస్తుండగానే రైలు దూరమయిపోయింది.

ఉస్మాన్ ప్లాట్‌ఫారం చివరి వరకూ వచ్చి ఆగిపోయాడు. అతను బాస్ అనుచరుల్లో ఒకడు. అతనే సేట్ చందన్‌లాల్ ఇంట్లో వజ్రాల దొంగతనం గురించి బాస్‌కు ఇన్ఫర్మేషన్ ఇచ్చాడు.

ట్రెయిన్‌లో విక్రమ్ రాజూ లోపలకు జనాన్ని నెట్టుకుంటూ వెళ్ళారు. ఓ ఇద్దరు మనుషులను బెదిరించి ఎలాగో సీట్లు సంపాదించుకున్నారు. వాళ్ళ అదృష్టంకొద్దీ జనరల్ బోగీలో ఎక్కారు. అందువల్ల టిక్కెట్లు ఎగ్జామిన్ చెయ్యటానికీ ఎవ్వరూ రాలేదు.

కొంచెం సేపటికి ఇద్దరికీ నిద్రపట్టింది బాస్ కొట్టిన దెబ్బలు మంటగా అనిపిస్తున్నా.

తిరిగి వాళ్ళకు మెలకువ వచ్చేసరికి తెల్లవారబోతున్నది.

ఆగివున్నది ట్రెయిన్.

ఎదురుగా ట్రాక్ రిపేర్‌లో వుంది. అందువల్ల మళ్ళీ నెమ్మదిగా కదులుతోంది రైలు.

"ఇక్కడ దిగిపోదాం" అన్నాడు రాజు.

"ఎందుకు?"

"మనం ఈ ట్రెయిన్‌లో ఎక్కి పారిపోతున్నట్టు బాస్‌కు ఉస్మాన్ తెలియజేస్తాడు. ఈ ట్రెయిన్ ఎక్కడ ఆగుతుందో బాస్‌కు తెలుసు కాబట్టి అక్కడ మనకంటే ముందుగానే బాస్ కార్లో వెళ్ళి మనకోసం యెదురు చూస్తూ వుంటాడు. అందువల్ల మనం ఇక్కడే దిగిపోదాం."

"గుడ్ ఐడియా ....పద...."

ఇద్దరూ దిగారు అక్కడే.

కొంచెం సేపటి తర్వాత రైలు వేగంగా కదిలి వెళ్ళిపోయింది.

వెనక్కు తిరిగి చూశారు.

కొంచెం దూరంలో చిన్న స్టేషన్ కనపడుతోంది. అక్కడ అంతగా ఎత్తుగా లేని ప్లాట్ ఫారంమీద జనం అటూ ఇటూ తిరుగుతున్నారు.

"ఆకలిగా వుంది" అన్నాడు రాజు.

"స్టేషన్ లో క్యాంటీన్ వుంటుంది" అన్నాడు విక్రమ్.

ఐదు నిమిషాల్లో ఇద్దరూ ఆ స్టేషన్ లో ఉన్నారు. క్యాంటీన్ వుంది.

కొంచెం సేపట్లో రాబోయే ప్యాసింజర్ రైలుకోసం ప్రయాణికులు ఎదురుచూస్తున్నారు.

టిఫిన్ తిని సిగరెట్లు వెలిగించారు రాజు—విక్రమ్.

"ఇప్పుడు మనం ఎక్కడికి వెళ్ళాలి?" అడిగాడు విక్రమ్ పొగ వదులుతూ—

"ఆ విషయం గురించే నేనూ ఆలోచిస్తున్నాను. ఈ బయట నాగరిక ప్రపంచంలో మనం యెక్కడ దాక్కున్నా బాస్ మనల్ని పట్టుకుంటాడు. వేటకుక్కల్లాంటి అనుచరులందర్నీ మనమీదకు వదులుతాడు. ఇప్పుడు మన దగ్గర కోటిరూపాయలు విలువచేసే ఎనిమిది వజ్రాలున్నాయనే విషయం బాస్ పూర్తిగా తెలుసుకుని వుంటాడు. కాబట్టి కొన్ని రోజులు మనం ఎక్కడైనా అజ్ఞాతవాసం చెయ్యాలి. ఆ తర్వాత మనం ఈ దేశం వదిలి పారిపోవాలి...."

వాళ్ళలా మాట్లాడుకుంటున్నప్పుడే రైలుపట్టాల పక్కనే ఉన్న మట్టి రోడ్డుమీద దుమ్ము లేపుకుంటూ

వస్తున్న లారీని ఎవరో ఇద్దరు మనుషులు ఆపుచేశారు. అందులోనించి ఎవరో లావుగా ఉన్నాయన కిందికి దిగి కొంచెం పక్కగా వాళ్ళిద్దరినీ తీసుకెళ్ళాడు.

జేబులోనించి పర్సుతీసి అందులోనించి ఎంతో డబ్బు తీసి వాళ్ళిద్దరికీ ఇచ్చాడు. వాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

కొన్ని నిమిషాల తర్వాత ఆ లారీ దుమ్ము లేపుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ లారీ నిండుగా ముక్కలుగా నరికిన పెద్ద పెద్ద చెట్ల బోదెలు వున్నాయి.

"వాళ్ళిద్దరు ఎవరు? ఆ లారీని ఎందుకు ఆపారు?" అడిగాడు రాజు తమకు కొంచెం దూరంలో నిలబడిన మనిషిని.

"వాళ్ళు అడవిలోనించి కలప నరుక్కుని తోలు కెళుతున్నారు. ఆ ఇద్దరు ఫారెస్టు డిపార్టుమెంటు మనుషులు. లంచం తీసుకుని లారీని వదిలేశారు. వీళ్ళకు ఇది మామూలే" అన్నాడు.

రాజు కళ్ళు మెరిశాయి అడవి అనగానే. మెరుస్తున్న కళ్ళతోనే విక్రమ్‌ని చూశాడు.

"ఇక్కడకు అడవి ఎంతదూరంలో వుంది?" అడిగాడు విక్రమ్ అతడిని.

"ముప్ఫయ్ మైళ్ళు వుంటుంది."

"బాగా పెద్ద అడవేనా?" రాజు అడిగాడు.

"అవును. ఎన్నో మైళ్ళవరకు వుంది. క్రూరజంతువులు కూడా వున్నాయంటారు. ఎందుకు ఇదంతా అడుగుతున్నారు? అడవితో మీ కేమిటి పని?"

"మేమిద్దరం కొన్ని రకాల మొక్కలను గురించి పరి

శోధనలు చేస్తున్నాం. అందుకే యిక్కడికి వచ్చాం"
అన్నాడు రాజు వెంటనే.

"అలాగా?" అన్నాడు అతను.

ఇంతలోనే రైలు రావటానికి సూచనగా స్టేషన్లో గంట కొట్టారు.

"అడవిలోకి వెళ్ళే దారి యేమిటి?" విక్రమ్ అతన్నే అడిగాడు.

"కొంచెం దూరం ఈ రోడ్డునే వెళితే ఓ జంక్షన్ వస్తుంది. అక్కడ నిలబడితే కలపకోసం అడవిలోకి వెళ్ళే లారీలు వస్తాయి. వాటిల్లో ఎక్కి వెళ్ళొచ్చు" అని అతను వెళ్ళిపోయాడు.

"మన అదృష్టం. బాస్ బారినించి తప్పించుకోటానికి మనకు ఇక్కడ ఓ అడవి దొరికింది" అన్నాడు విక్రమ్ సంతోషంగా—

"అవును. ఇక మనం ఆలస్యం చెయ్యటం ఎందుకు? నలుగురి దృష్టిలో ఎక్కువసేపు వుండటం కూడా అంత మంచిదికాదు. పద. వెళ్ళిపోదాం" అన్నాడు రాజు చిన్నగా.

విక్రమ్ మాట్లాడకుండా అక్కడినించి కదిలాడు.

ఇద్దరూ మట్టిరోడ్డుమీదకు వచ్చారు.

అప్పుడే సూర్యుడు ఉదయిస్తున్నాడు.

పల్చని ఎండ వాళ్ళమీద పడుతోంది. వాళ్ళ నీడలు రోడ్డుమీద సాగుతున్నాయి.

వాళ్ళు కొంతదూరం వెళ్ళగానే వెనకనించి అప్పుడే రైలు వచ్చిన మోత వినిపించింది.

"ఈ రైలు ఎక్కడినించి వచ్చిందో?" అన్నాడు రాజు గబగబా నడుస్తూ—

"ఎందుకు?"

"ఎవరయినా మనల్ని వెంటాడుతూ ఈ రైల్లో వచ్చారేమో!"

"అసాధ్యం....ఇది ప్యాసింజర్ రైలు. ఎక్స్‌ప్రెస్ రైళ్ళు యింత చిన్న స్టేషన్లో ఆగవు. అందువల్ల మనకు భయం లేదు."

పది నిముషాల తర్వాత అతను చెప్పిన జంక్షన్ దగ్గరకు చేరుకున్నారు. అక్కడే ఇంకో రెండు రోడ్లు వచ్చి కలుస్తున్నాయి.

అరగంట కాలం ఎదురుచూసిన తర్వాత అక్కడకు ఓ లారీ వచ్చింది.

చెయ్యెత్తి ఆపాడు విక్రమ్.

"ఎవరు? ఎక్కడకు వెళ్ళాలి? ఈ లారీ అడవిలోకి వెళుతోంది" అన్నాడు డ్రయివర్.

"మేం కూడా అడవిలోకి వెళ్ళాలి."

"ఎందుకు?"

"కొన్ని రకాల వనమూలికలు కావాలి."

"లోపల ఖాళీ లేదు. పైన ఎక్కండి" అన్నాడు డ్రయివర్.

అప్పుడప్పుడు మూలికల కోసం—ఆకుల కోసం కొంత మంది మనుషులు అడవిలోకి వస్తుంటారని డ్రయివర్‌కు తెలుసు. అందుకే అతను ఆ ఇద్దరి మాటలనూ సులభంగా నమ్మేశాడు.

నవ్వుకున్నారు పైన కూర్చుని.

"ఇప్పటివరకూ అంతా సవ్యంగానే జరుగుతోంది. కొన్ని రోజులు మనం ఎలాగో ఈ అడవిలోనే గడిపెయ్యాలి. మనం ఈ దేశంనించి పారిపోయామని బాస్

మనకోసం వెతకటం మానేస్తాడు. అప్పుడు మనం బయ టకు వచ్చి ఈ వజ్రాలను అమ్ముకుని ఆ డబ్బుతో యీ దేశం వదలి పారిపోవాలి" చిన్నగా అన్నాడు విక్రమ్.

## 5

లారీ వేగంగా వెళుతుంటే దుమ్ము రేగుతోంది.

పావుగంట గడిచేసరికి లారీ ఎత్తుగా పెరిగిన చెట్ల మధ్యనించి వెళ్ళటం గమనించి "అప్పుడే అడవి మొద లయ్యింది" అన్నాడు రాజు ఉత్సాహంగా.

చూస్తుండగానే లారీ కొంచెం దట్టంగా వున్న అడవి లోకి ప్రవేశించింది.

ఇంకో అరగంట తర్వాత లారీ ఆగిపోయింది. అక్కడ కొంతమంది పెద్ద పెద్ద చెట్లను నరుకుతున్నారు.

అంతా కిందికి దిగారు.

విక్రమ్—రాజు కిందకు దిగగానే "లారీ యిక్కడే ఆగిపోతుంది....ఇక్కడన్నీ పెద్ద పెద్ద చెట్లే. ఇంకొంచెం లోపలకు వెళ్ళండి. మీకు కావలసిన మూలికలు దొరుకు తాయి" అన్నాడు డ్రయివర్.

తల వూపి అక్కడనించి కదిలారు.

నవ్వాడు విక్రమ్.

"మనల్ని బాగా నమ్మారు. మన దగ్గర కోటి రూపా యల వజ్రా లున్నాయని ఈ అమాయకులకు ఏం తెలుసు? నిజంగానే వనమూలికలకోసం వచ్చామని అనుకుంటు న్నారు. వీళ్ళు మనల్ని ఇంత ఈజీగా నమ్మేశారంటే యెవరో తరచుగా ఈ అడవిలోకి వనమూలికల కోసం వస్తూ వుండాలి."

"అవును. అందువల్లనే మనల్ని ఎవరూ అనుమానించ లేదు" అన్నాడు రాజు సిగరెట్టు వెలిగించుకుంటూ.

చలికాలం కావటంతో ఎండ అంత గాలేదు. ఉన్నదో లేదో కూడా వాళ్ళకు తెలీటంలేదు. ఎందుకంటే దట్టంగా వున్న ఆ అడవిలో చెట్లు విశాలంగా కొమ్మలు పరచుకుని పెరిగివున్నాయి.

వాచీ కేసి చూసుకున్నాడు రాజు.

తొమ్మిది గంటలు కావస్తోన్నది.

పదకొండు గంటలయ్యేవరకూ ఇద్దరూ కబుర్లు చెప్పు కుంటూ అడవిదారి వెంట చెట్లని చూసుకుంటూ భవి ష్యత్తు గురించి ఆలోచనల్లో మునిగిపోతూ నడిచారు.

ఒకచోట ఆగిపోయారు.

అక్కడ ఆ దారి రెండుగా చీలిపోయింది. ఏ వైపుకు వెళ్ళాలో నిర్ణయించుకోటానికి అక్కడే ఆగిపోయారు.

అప్పుడే వాళ్ళకు ఓ దారిలోనించి వస్తున్న జీపు కని పించింది. రెండు నిముషాల తర్వాత జీపు వాళ్ళదగ్గరకు వచ్చి ఆగిపోయింది.

అందులో ముగ్గురు మనుషులు యూనిఫారంలో వున్నారు. ఆ ముగ్గురిలో ఒకాయన ఫారెస్ట్ ఆఫీసర్. ఆ క్రితంరోజు నే ఆయన అడవిలో వున్న ఫారెస్టు హౌవుస్ లోకి భార్యతో కలిసివచ్చాడు—

"ఎవరు మీరు?" అడిగాడాయన.

"నా పేరు శేషాచారి. ఇతని పేరు గరుడాచారి. కొన్ని రకాల మూలికలు, ఆకులకోసం యిక్కడికి వచ్చాం" అన్నాడు విక్రమ్ ఎంతో వినయంగా—

"ఓహో.... వైద్యులా.... జాగ్రత్తగా వెళ్ళండి. మరీ లోపలగా వెళ్ళకండి. క్రూరజంతువులు వున్నాయి ఈ అడవిలో. ఒకవేళ మీరు రాత్రికి కూడా వుండవలసి వస్తే ఇక్కడికి కొంతదూరంలో వున్న మా హౌవుస్ కు

రండి. బస చెయ్యవచ్చు. మాకూ కొంత కాలక్షేపంగా వుంటుంది" అన్నాడాయన.

తల వూపాడు విక్రమ్ సరేనంటూ—

ఆయనకు నలభై యేళ్ళుంటాయి—లావుగా పొడుగ్గా బలంగా వున్నాడు.

జీపు వెళ్ళిపోయింది.

"చివరకు మనల్ని ఫారెస్టు ఆఫీసర్ కూడా వనమాలి కలు కోసం వచ్చినట్టుగా అనుకున్నాడు. ఇక మనకు యేలాంటి భయంలేదు" అంటూ నవ్వాడు రాజు.

మళ్ళీ నడిచారు.

వాళ్ళకు ఒక్క క్రూరమృగం కూడా కనిపించలేదు. ఎక్కడో రెండు చెట్లమీద నాలుగు కోతులు కనిపించాయి.

# 6

"ఆకలిగా వుంది" అన్నాడు రాజు.

"అవును. ఇంతదూరం నడవటంవల్ల నాకూ ఆకలిగా వుంది" అన్నాడు విక్రమ్.

దారిపక్కనే వున్న పెద్ద చెట్టుకింద కూర్చుని ఇద్దరూ బ్రెడ్ తిన్నారు. తర్వాత బాటిల్లోని నీళ్ళు తాగారు.

"నాకు కొంచెంసేపు రెస్టు తీసుకోవాలని వుంది" అన్నాడు రాజు.

"ఇక్కడెందుకు? కొంచెందూరంలో తన ఫారెస్టు హౌస్ వుందని ఆయన చెప్పాడు. వెళ్ళి అక్కడే మనం రెస్టు తీసుకోవచ్చు."

లేచి నిల్చున్నారు.

దార్లో అన్నాడు విక్రమ్—

"మనిద్దరికోసం ఒకవైపు పోలీసులు, మరోవైపు

బాస్ గాలిస్తూ వుంటారు."

రాజు నవ్వి "వాళ్ళకేం తెలుసు—మనిద్దరం ఈ క్షణాల్లో ఈ చిట్టడవిలో చెట్లకింద నడుస్తున్నామని. మన ఉనికి దేవుడుకూడా తెలుసుకోలేడు" అన్నాడు.

"అలా అనకు నువ్వు. బాస్‌ను తక్కువగా అంచనా వెయ్యకు. బాస్‌కు లక్ష కళ్ళు. అందువల్ల అడవిలో వున్నా మన జాగ్రత్తలో మనం వుండాలి."

"నిజమే" రాజు అన్నాడు.

కొంచెం దూరంలోనే వాళ్ళకు చెట్లమధ్యగా చిన్న ఇల్లు కనిపించింది. దాన్నే ఫారెస్టు హావుస్ అనుకున్నారు.

దగ్గరకు వెళ్ళేసరికి దాని చుట్టూ తీగతో ఫెన్సింగ్ వుంది. పెద్ద కొయ్యగేటు.

దాన్ని నెట్టుకుని లోపలకు వెళ్ళారు. అప్పుడు వరండాలో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్న ముసలి నౌకరు కనిపించాడు.

"ఎవరు మీరు?" అనడిగాడు వాళ్ళని చూడటంతోనే.

అందరికీ చెప్పినట్టుగానే వాళ్ళు ఆ ముసలి నౌకరు కూడా చెప్పి "చాలా దూరంనించి నడిచివచ్చాం. అలసిపోయి వున్నాం. కొంచెంసేపు వరండాలో విశ్రాంతి తీసుకుంటాం" అని చెప్పాడు రాజు.

వాళ్ళ మాటలు విని కర్టెన్ తొలగించుకుని ఇంట్లో నించి అప్పుడే బయటకు వచ్చింది ముప్ఫయేళ్ళు దాటుతున్న ఓ స్త్రీ.

"ఎవరు?" అంటూ—

ఆమెను చూడగానే వాళ్ళిద్దరూ షాక్ కొట్టినట్లుగా ఐపోయారు.

ఎందుకంటే—ఆమె అందం అలాంటిది—

చెంపక చేరదేసి కళ్ళు—సన్నని ముక్కు. ఎర్రని పెదవులు—గులాబిరంగు బుగ్గలు—ఆమెలో యెక్కువగా వున్న ఆకర్షణ.

ఎవరో ఆమెక్కూడా చెప్పి అక్కడ విశ్రాంతి తీసుకుంటామని చెప్పారు, కొంచెంసేపటి తర్వాత ఆ షాక్ నించి తేరుకుని.

తల వూపి ఆమె లోపలకు వెళ్ళిపోయింది ఫారెస్టు ఆఫీసర్ భార్య. ఆమెకు పిల్లలు లేరు.

టవల్స్ పరచుకుని వరండాలో పడుకున్నారు.

ఇంటిముందు ఎక్కువగా చెట్లు లేకపోవటంతో ఎండ బాగా పడుతోంది అక్కడ.

కళ్ళు మూసుకున్నా ఇద్దరి కళ్ళముందు ఆమె రూపమే కదులుతోన్నది. అందువల్ల వాళ్ళు విశ్రాంతి తీసుకోవాలనే ఆలోచన గురించే మరచిపోయారు.

కొంచెంసేపటి తర్వాత రాజు కళ్ళు తెరిచి చూసే ఆ ముసలి నౌకరుకూడా కొంచెం దూరంలో ఏదో గుడ్డ పరుచుకుని ముడుచుకుని నిద్రపోతూ కనిపించాడు.

వెంటనే రాజు—విక్రమ్‌ను తట్టి చిన్నగా యేదో చెప్పాడు.

తల వూపాడతను.

క్షణంలో నిల్చున్నారు.

రాజు లేచివెళ్ళి తలుపుమీద చిన్నగా చప్పుడు చేశాడు.

రెండు నిమిషాల తర్వాత తలుపు తెరిచింది ఆమె.

కర్టెన్ లోనించి మొహం బయటకు పెంచి "ఏమిటి?" అన్నది.

"దాహంగా వుంది" అన్నాడు రాజు యెంతో మర్యాదగా.

ఆమె వెంటనే లోపలకు వెళ్ళింది.

చప్పుడవకుండా ఇద్దరూ ఆమె వెనుకే లోపలకు వెళ్ళారు.

ఆమె ఓ గదిలోకి నడిచి ఆగిపోయి కూజాలో వున్న నీళ్ళు గ్లాసులోకి వంచుతున్నప్పుడు వెనుకగా వెళ్ళి ఇద్దరూ ఒక్కసారి ఆమెను పట్టుకున్నారు.

ఉలిక్కిపడి వెంటనే పెద్దగా అరిచిందామె—ఐనా వాళ్ళు ఆమెను వదల్లేదు. విక్రమ్ అర చేత్తో ఆమె నోటిని మూశాడు.

కాని—అప్పటికే బయట పడుకున్న నౌకరుకు ఆమె కేక వినిపించి లోపలకు పరిగెత్తుకు వచ్చాడు.

వాళ్ళు ఆమెను లొంగదీసుకునే ప్రయత్నంలో వున్నారు.

ఆ దృశ్యాన్ని చూడగానే నౌకరు పెద్దగా అరుస్తూ దగ్గర్లో వున్న కొయ్యను తీసుకుని వాళ్ళమీదకు వచ్చాడు.

ప్రమాదాన్ని రాజు గుర్తించాడు. క్షణంకూడా ఆలస్యం చెయ్యలేదు. ఎగిరి నౌకరుమీదకు దూకాడు. దూకుతూనే అతని చేతిలో వున్న కొయ్యను లాక్కుని నౌకరు తలమీద బలంగా కొట్టాడు. కాని నౌకరు తల పక్కకు తిప్పటంతో ఆ దెబ్బ అతని భుజంమీద పడింది. కెవ్వున అరిచి స్పృహతప్పి పడిపోయాడు.

"నువ్వు బయట నిలబడు. తర్వాత పిలుస్తాను" అన్నాడు విక్రమ్ ఆమె బలహీనపడిపోవటం గమనించి.

అతడి బలంముందు ఆమె ఓడిపోయింది.

రాజు బయటకెళ్ళాడు.

కొన్ని నిమిషాలు గడిచాయి.

రాజును పిల్చాడు విక్రమ్.

అతను బయటకు వెళ్లాడు.

ఇంకొన్ని నిమిషాలకు రాజు కంగారుగా బయటకు వచ్చాడు.

"ఆమె చచ్చిపోయింది" అన్నాడు భయంగా.

"మై గాడ్. క్విక్ ....మనం వెంటనే ఇక్కడినించి వీలైనంత దూరంగా పారిపోవాలి. ఇప్పటివరకూ మనం పోలీసుల గురించి, బాస్ గురించే భయపడుతున్నాం. ఇప్పుడు మనకు ఈ ఫారెస్ట్ ఆఫీసర్ కూడా శత్రువు. ఆయన మనల్ని వేటాడి చంపుతాడు. రన్ ఫర్ లైఫ్" ఆదుర్దాగా అన్నాడు విక్రమ్—

తర్వాత వాళ్ళు ఆ ఫారెస్టు హౌస్‌లోనించి బయట పడి ఇంటి వెనకవైపున వున్న అడవిదారిలోనించి పరుగు తీయటం మొదలు పెట్టారు-చావునించి తప్పించుకోటానికి-

కాని వాళ్ళకు చావు తప్పుతుందా?

# 7

దట్టంగా వున్న అడవి మధ్యలోకి చేరుకుని వుండ టంతో—చీకట్లు అలుముకున్నట్టుగా అనిపించి టైము చూశాడు విక్రమ్.

ఐదుగంటలు దాటి ఇరవై నిమిషాలు.

ఎక్కడినించో సన్నగా వెలుతురు అస్పష్టంగా పడు తోంది.

"ఇప్పటికే మనం చాలాదూరం వచ్చేశాం" అన్నాడు రాజు బాగా ఆయాసపడుతూ.

"అవును. ఇక మనకు భయంలేదు. ఐనా చీకట్లో ముందుకు ప్రయాణం చెయ్యటం ప్రమాదం. ఈ రాత్రికి ఇక్కడే పడుకుందాం" విక్రమ్ అన్నాడు పరిసరాల్ని చూస్తూ.

కింద చెట్ల ఆకులు రాలి వున్నాయి.

"ఈ అడవిలో రాత్రంతా ఈ చెట్లకింద పడుకోవటం ప్రమాదం కదూ?" అన్నాడు రాజు.

"ప్రమాదమే. ఐనా తప్పదు. కిందపడుకోవటం కంటే ఈ చెట్టుమీద పడుకోవటం మంచిది. ఏమంటావ్?"

"నాకు చెట్టు ఎక్కటం రాదు. కిందనే పడుకుందాం. అవకాశం వున్నంతవరకు మెలకువగానే వుందాం."

ఆకులను పక్కకు నెట్టేశారు.

బ్లాంకెట్ పరిచారు.

బ్యాగ్‌లలో వెతికితే బ్రెడ్ కనపడలేదు.

"మనం గమనించలేదు. బాగా ఆకలిగా వున్నందున బ్రెడ్ అంతా ఉదయమే తినేశాం. ఇప్పుడెలా?" అన్నాడు రాజు.

"అవును. మనం రాత్రి విషయం మరచిపోయాం—"

అప్పుడు చూశాడు విక్రమ్-వాళ్ళు కూర్చున్న చెట్టుకు పైన వేల్లాడుతున్న ఎర్రటి కాయలు.

"ఈ కాయలు కోసుకుతిందాం."

"బావుంటాయా?" అడిగాడు రాజు.

"తెలీదు" అంటూ దగ్గర్లోనే కింద ఏదో పిట్ట కొరికి పడేసిన కాయను అందుకుని కొరికాడు.

తియ్యగా వుంది.

"బావుంది. ఎన్నైనా తినొచ్చు. నువ్వు చెట్టెక్కి

కాయలుకోసి పడెయ్యి."

నవ్వేడు రాజు—

"ఇప్పుడే చెప్పాను. నాకు చెట్టెక్కడం రాదు."

"అవును. మరచిపోయాను. ఐతే నేను ఎక్కుతాను."

"మరచిపోయాను. మనం పడుకుంటాంకదా. మన జేబులో ఈ వజ్రాల పెట్టె ఎందుకు? బ్యాగ్‌లో పెడదామా?" అన్నాడు రాజు.

"వద్దు. మనం నిద్రలో వున్నప్పుడు ఏ అల్లరి కోతులైనా వచ్చి మన బ్యాగ్‌లను తీసుకుపోవచ్చు. అందుకే ఆ పెట్టెను ఇలా ఇవ్వు. నేనో సురక్షితమైన ప్రదేశంలో దాచి వుంచుతాను."

"ఎక్కడ?" వజ్రాలు వున్న చిన్న బాక్స్‌ను ఇస్తూ అడిగాడు రాజు.

"ఇక్కడ" అన్నాడు విక్రమ్. ఆ బాక్స్‌ను ఆ చెట్టుకు వున్న తొర్రలోకి జారవిడిచి.

"గుడ్ ప్లేస్" అన్నాడు రాజు.

అప్పుడు విక్రమ్ నిల్చుని గబగబా చెట్టుపైకి ఎక్కాడు.

రాజు కింద నిల్చుని కాయలు ఎక్కడ ఎక్కువగా వున్నాయో చెబుతున్నాడు.

విక్రమ్ రెండు కాయలుకోసి కిందకు వదిలాడు.

'కెవ్వ'న అరిచాడు రాజు.

ఉలిక్కిపడి వంగి కిందకు చూశాడు విక్రమ్.

వణికిపోయాడు—

ఏదో పులి రాజుమీద దాడిచేసింది. మరోసారి అరిచాడు రాజు—కిందపడి దొర్లుతూ—

విక్రమ్ కాళ్ళు వణికాయి—

జేబులో తడుముకున్నాడు పిస్తోలుకోసం — లేదు. ఎక్కడో పడిపోయి ఉండాలి. అవును. ఎక్కడో కాదు—ఆమెను లొంగదీసుకోటానికి పెనుగులాడుతున్నప్పుడు పడిపోయి వుండాలి.

ఒక్కసారిగా గాండ్రించింది పులి.

మరింత బిగుసుకుపోయాడు.

కిందికి చూస్తూనే వున్నాడు విక్రమ్.

రాజు పులి బారినించి తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నాడు అనుకుంటూనే.

ఐనా అతని ప్రయత్నం ఫలించలేదు. అతని జేబులో పిస్తోలు వుంది. ఐనా దాన్ని బయటకు లాగే అవకాశం పులి ఇవ్వటంలేదు.

పులి అతనిమీద పంజా విసురుతోంది — గాయాలైనాయి బాగా — నెత్తురు కారుతోంది.

లాస్ట్ మినిట్ — ఆఖరి క్షణం —

బాధగా — మృత్యు ముఖంలోకి వెళుతూ అరిచాడు రాజు.

పులి అతడి గొంతును కొరికింది కసిగా —

చిన్న మూలుగు....తూలి కిందపడపోయాడు విక్రమ్-

భయంకర సంఘటన.

వూహించని ఇన్సిడెంట్ —

అతను చూస్తుండగానే పులి రాజు శరీరాన్ని చీకట్లో పొదలవైపుకు ఈడ్చుకు వెళ్ళింది.

ఏడుపొచ్చింది అతనికి — ఏడ్చాడు. అప్పుడు అతన్ని హఠాత్తుగా గొప్ప పిరికితనం ఆవహించింది.

ఇప్పుడు తను ఒంటరివాడు.

ఆ రాత్రి అతను చెట్టు దిగిరాలేదు. చెట్టుమీదనే

కొమ్మలమధ్య కూర్చొని వున్నాడు___

రాత్రి అంతా యేవో జంతువుల అరుపులు అతనికి వినిపించాయి. అనుక్షణం మృత్యువువాత పడుతూ ఆర్త నాదం చేస్తున్న రాజు రూపమే అతని కళ్ళముందు కదిలింది___

ఎలాగో తెల్ల వారింది.

అప్పుడు కూడా అతను చెట్టు దిగి రావటానికి భయపడి బాగా ఎండవచ్చేవరకు అక్కడే కూర్చున్నాడు.

## 8

ఎండొచ్చింది.

పిట్టలు ఎగురుతున్నాయి.

పొదల్లోనించి బయటకు వచ్చి కుందేళ్ళు గడ్డి తింటున్నాయి.

అతనికి బాగా దాహంగా కూడా వుంది.

ఇక తప్పదనుకుని చెట్టుదిగి కిందకు వచ్చాడు.

కింద అతనికి నెత్తురుమరకలు కనిపించాయి.

అతనికి కన్నీళ్లొచ్చాయి.

అక్కడినించి గబగబా ముందుకు వెళ్లాడు. అలా కొంచెందూరం వెళ్ళేసరికి దూరంగా చిన్న నీటి మడుగు కనిపించింది. ఎప్పుడో కురిసిన వర్షానికి మిగిలిపోయిన నీళ్ళు.

నడుస్తున్న అతను నీటిమడుక్కి కొంచెం దగ్గరకు రాగానే ఉలిక్కిపడ్డాడు.

నల్లగా వున్న పొడుగాటి పాము అతనివైపుకే వస్తోంది.

దాన్ని చూడగానే అతను నడక వేగాన్ని పెంచి ముందుకు పరుగుదీశాడు.

అంతే—

పెద్దగా అరిచాడు.

విక్రమ్ ఆ ఊబిలో దిగిపోయాడు సగం వరకు—

పాము అతనిముందునించే వెళ్ళిపోయింది మెలికలు తిరుగుతూ—ఆ నల్లపాము చాలా ప్రమాదకరమైనది—అది కాటువేస్తే కేవలం మూడునిమిషాల్లోనే ప్రాణం పోగొట్టుకుంటారు.

తనో వూబిలో దిగబడ్డాడని తెలియగానే ప్రాణ భయంతో "రక్షించండి...." అని పిచ్చి పట్టినట్టుగా అరిచాడు.

అది అడవి అనీ, అక్కడ యెవ్వరూ లేరనీ అతడికి తెలుసు—ఐనా అరిచాడు.

కాని వూహించని విధంగా చెట్లమధ్యనించి చేతిలో తుపాకీతో ఆక్కడికో మనిషి వచ్చాడు.

ఫారెస్టు ఆఫీసర్—

ఆయన్ని చూడగానే విక్రమ్‌కు ఆశ కలిగింది—కాని ఆయినకు తను—రాజు చేసిన ద్రోహం గుర్తుకు వచ్చింది.

ఐనా—"ప్లీజ్....రక్షించండి" అన్నాడు దీనంగా.

"రెండోవాడు యెక్కడ?" ఉరిమినట్టు అడిగాడాయన.

ఆయన తనని రక్షించడని అతనికి అర్థమయ్యింది. అప్పటికే అతను ఛాతీవరకు ఊబిలో దిగబడిపోయాడు.

ఫారెస్టు ఆఫీసర్ తుపాకి అతనికి గురిపెట్టాలనే అనుకున్నాడు—ఆయనకు నౌకరు జరిగిన ఘోరాన్ని చెప్పాడు.

ఎదురుగా ఊబిలో దిగి మృత్యువు కౌగిలిలోకి వెళుతున్న విక్రమ్‌ను చూడగానే ఆయన తుపాకీ దించాడు.

తమ కథనంతా గబగబా ఆయనతో చెప్పి రాజును రాత్రి పులి చంపి తీసుకుపోయిందని కూడా చెప్పాడు. ఏడుపుతో —

ఐనా ఫారెస్టు ఆఫీసర్ జాలిపడలేదు.

"మీకు మేముచేసిన ద్రోహానికి క్షమించండి. ద్రోహిని చావు యెప్పుడూ వెంటాడే వుంటుంది. చావబోయే ముందు మీతో నిజం చెబుతాను. యెదురుగా వున్న ఈ దారిలో కొంచెం దూరంలో పెద్ద చెట్టువుంది. అక్కడ మా బ్యాగ్ లుకూడా వున్నాయి. ఎనిమిది అపురూపమైన వజ్రాలున్న పెట్టె ఆ చెట్టు తొర్రలో వుంది. వాటి విలువ కోటిరూపాయాలని చెప్పానుకదా. వెళ్ళండి. వాటిని తీసుకోండి...."

విక్రమ్ చెప్పిన ఆ మాటలను ఫారెస్టు ఆఫీసర్ తో పాటు మరో మనిషికూడా అక్కడికి దగ్గర్లోనే ఉన్న చెట్టు చాటున పొంచి వుండి విన్నాడు.

అతనే బాస్.

బాస్ కు లక్ష కళ్ళు. అందుకే ఆ ఇద్దరినీ ట్రేస్ చేసి అక్కడకు రాగలిగాడు ఆ టైముకు.

సంతోషం కలిగింది బాస్ కు.

ఎలాగైతేనేం ఇంత దూరం శ్రమపడి వచ్చినందుకు ఆ వజ్రాలు తనకు దొరుకుతున్నాయి.

గబగబా చప్పుడవకుండా అక్కడినించి కదిలాడు.

విక్రమ్ పూర్తిగా ఊబిలో మునిగిపోయాడు.

ఫారెస్టు ఆఫీసర్ భారంగా నిట్టూర్చి వెనక్కు తిరిగాడు.

ఆయన ఆ చెట్టు దగ్గరోకి వచ్చేసరికి అప్పటికే చెట్టు తొర్రలో చెయ్యిపెడుతున్న బాస్ ను చూసి ఆశ్చర్య

పోయాడు.

ఆశ్చర్యంనించి తేరుకోవటానికిముందే బాస్ 'కెవ్వ్'న అరుస్తూ చేతిని బయటకు లాక్కుని వెనక్కు పడి పోయాడు.

ఒక్క నిమిషంలో ఆ చెట్టు తొర్రలోనించి రెండు పొడుగాటి నల్లపాములు బయటకు వచ్చి చెట్టు వెనక్కు పాకుతూ వెళ్ళిపోయాయి.

బాస్ దగ్గరకు వెళ్ళాడు ఆయన.

"ఎవర్నువ్వు?"

బాస్‌కు లక్ష కళ్ళు. కాని రెండు నల్లపాములు వేసిన నాలుగు కాట్లకు అతని లక్ష కళ్ళూ మూసుకుపోయాయి.

తనెవరో చెప్పకుండానే కళ్ళూ మూశాడు. అతని శరీరం నిమిషాల్లో నీలిరంగులోకి మారిపోయింది.

జాగ్రత్తగా లోపలకు చూసి తుపాకి బారల్‌తో రెండుసార్లు తొర్రలో పొడిచి తర్వాత అందులోనించి బాక్స్ తీసి మూత తెరిచాడు.

అపురూపమైన ఎనిమిది వజ్రాలు కనిపించాయి.

ఒక్క నిమిషం వాటిని చూశాడు—తర్వాత ఇలా అనుకున్నాడు మనసులో—

'ఈ వజ్రాల గురించే ఇద్దరు దుర్మార్గులు అడవిలోకి పారిపోయి వచ్చారు. ప్రాణప్రదంగా చూసుకునే తన భార్యను చంపారు. తర్వాత ఆ ఇద్దరూ ఘోరంగా చచ్చిపోయారు. మరో మనిషి కూడా ఈ వజ్రాల కోసమే పాము కాట్లకు బలైపోయాడు. ఇక ఈ వజ్రాలు....'

మళ్ళీ ఊబి దగ్గరకు నడిచాడు.

వజ్రాల గురించి ప్రాణాలు పోగొట్టుకున్న ఇద్దరిలో

ఒకడ్ని పులి యెక్కడకు ఈడ్చుకుపోయిందో తెలీదు. రెండో మనిషి తన కళ్ళముందే వూబిలో మునిగిపోయాడు.

చేతిలో వున్న వజ్రాల పెట్టెను ఊబిలోకి విసిరాడు ఆయన.

కోటి రూపాయల విలువైన వజ్రాలు ఊబిలో దిగిపోయాయి—నిమిషంలో.

భారంగా అక్కడినించి కదిలాడు ఫారెస్టు ఆఫీసర్.

—: అయిపోయింది :—

# నేరస్థుడితో పెళ్ళి

ప్రతాప రవిశంకర్

టేబిల్ మీద వున్న గడియారం టిక్కు టిక్కు మంటోంది.

గోడనున్న క్యాలెండర్ ని చూసింది సుజాత — పన్నెండో తారీఖు. ఆమె వరుసగా క్యాలెండర్ మీద అంకెలను చూస్తూ ఇరవై మూడవ తారీఖు దగ్గర ఆగి పోయింది.

ఇరవై మూడు —

ఆ రోజున ఆ ఇంట్లోకి మరో మనిషి తిరిగిరాబో తున్నాడు — జైలునించి.

అతనే జీవన్.

ఐదేళ్ళ క్రితం ఓ యువతిని రేప్ చేసినందుకు అతను జైలుకు వెళ్ళాడు.

ఐదేళ్ళ తర్వాత తిరిగి ఆ ఇంట్లోకి రాబోతున్నాడు. అందుకే ఆ ఇంట్లో వున్న యిద్దరు మనుషులు సంతో షంగా వున్నారు — ఆ ఇద్దరికీ జీవన్ కొడుకు.

కాని — సుజాతకు విచారంగా వుంది ఇరవై మూడవ

తారీకను చూస్తున్నకొద్దీ.

ఎందుకంటే ఆమెకు జీవన్ అంటే కొంచెంకూడా ఇష్టంలేదు.

జీవన్ ఆమెకు మేనమామ కొడుకు.

అతను జైలునించి తిరిగి రాకుండా వుంటే బావుండు ననుకుంది.

అలా అనుకున్నా అతను తప్పక తిరిగి వస్తాడు. అత నొచ్చిన తర్వాత ఆ ఇంట్లో తనమీద వత్తిడి బాగా పెరిగిపోతుంది—ఏం చెయ్యాలి తను?

గంట క్రితం జరిగిన సంఘటన ఆమె కళ్ళముందు మెదిలింది—

ఆమె మేనమామ సుందర్రావు ఆమె గదిలోకి వచ్చాడు.

"ఇరవై మూడో తారీకు వాడొస్తున్నాడు" అన్నాడు ఆయన వస్తూనే.

"జైలునించి" అన్నదామె—

నవ్వాడాయన.

నవ్వి "అవును, జైలునించే—జైలునించి వచ్చిన మనిషి తిరిగి అలాంటి పనులు చేసి మళ్ళీ జైలుకు వెళ్ళకూడదు" అన్నాడు.

"ఆవును బుద్ధిగా వుండాలి. ఐనా ఐదేళ్ళు జైలు శిక్షను అనుభవించిన తర్వాత మళ్ళీ జైలుకు వెళ్ళే సాహసం చెయ్యడనుకుంటాను" అన్నది సుజాత.

"అలా అనుకోటానికి వీల్లేదు. ఒకసారి జైలుకు వెళ్ళి వచ్చిన మనిషికి జైలంటే నిర్లక్ష్యం కలుగుతుంది. జైలు శిక్ష అంటే భయం పోతుంది-అందువల్ల వాళ్ళ దృష్టిలో మనకు వుండే భయం వాళ్ళకు వుండదు, అందుకే అంటు

న్నాను— వాడు తిరిగి జైలుకు వెళ్ళకూడదు."

"అలాగే కోరుకుందాం" అన్నది.

"కోరుకోవటం కాదు సుజాతా, ఆ బాధ్యతను నేను నీమీద వుంచుతున్నాను."

ఆమె వులిక్కిపడి "నామీదనా!" అన్నది.

"అవును. పూర్తిగా నీ మీద నే. వాడ్ని మంచి మనిషిగా మార్చగల అవకాశం నీ వొక్కదానికే వుంది. అందుకు నేనో మార్గం ఆలోచించాను."

"ఏమిటా మార్గం?" భయంగానే అడిగింది.

"జీవన్‌తో నీ పెళ్ళి."

"మామయ్యా" అన్నది....

"అవును. వాడ్ని నువ్వు పెళ్ళిచేసుకుంటే వాడి బాధ్యత నీదవుతుంది. అందుకే వాడు తిరిగి రాగానే వీలైనంత త్వరలో మీ ఇద్దరి పెళ్ళి జరిగేలా చూస్తాను."

ఆమెకు మాతిపోయింది.

ఇలాంటి పరిస్థితి ఏదో ఒక రోజు యెదురవుతుందని ఆమె అనుకుంటూనే వుంది.

"నువ్వంటే వాడికి గౌరవం వుంది. నిన్ను చేసుకున్న తర్వాత వాడు గౌరవప్రదమైన జీవితాన్ని గడుపుతాడని నాకు నమ్మకం వుంది."

ఆమె వెంటనే అన్నది—

"నాకు ఆ నమ్మకం లేదు మామయ్యా—ఇలా చెబుతున్నందుకు నన్ను క్షమించు. ఎందుకంటే జీవన్‌ని నేను చేసుకోటానికి సిద్ధంగాలేను."

ఈసారి సుందర్రావు ఉలిక్కిపడి—

"ఏమిటి నువ్వంటున్నది?" అన్నాడు.

"జీవన్‌ని నేను పెళ్ళి చేసుకోనన్నాను."

ఆయన కోపంగా అడిగాడు—

"ఎందుకు?"

"ఎందుకు? అని నువ్వడగటం ఆశ్చర్యంగా వుంది. అతనెలాంటి మనిషో మీకూ్కడా తెలుసు. అలాంటి మనిషిని నేనెలా చేసుకోగలను?"

"పైవాళ్ళెవరో చేసుకోటానికి ఇష్టపడకపోవచ్చు. కాని నువ్వు యెందుకు ఇష్టపడవు?"

"నేనూ అందరిలాంటి ఆడదాన్నే-పరువు, మర్యాద, సంస్కారం వున్న మనిషిని పెళ్ళి చేసుకోవాలనే నేనూ కోరుకుంటున్నాను. కాని—జీవన్‌లాంటి జైలుకు వెళ్ళి వచ్చిన మనిషిని చేసుకోవాలని ఎలా అనుకుంటాను?"

"సుజాతా" అరిచాడు సుందర్రావు.

ఇంతలోనే ఆ గదిలోకి సుందర్రావు భార్య వచ్చింది. అప్పటివరకూ ఆమె తల నొప్పితో బాధపడుతూ పక్క గదిలో కూర్చుంది.

భార్యతో సుజాత యేమంటున్నదో చెప్పాడు సుందర్రావు.

ఆమె కళ్ళు ఎర్రగా చేసి "పదేళ్ళ క్రితం మీ అమ్మ నాన్న పోయినప్పుడు నిన్ను ఈ ఇంటికి తీసుకొచ్చాం. అప్పటినించీ నిన్ను పెంచాం. ఈ రోజు నువ్వు మా మాటను కాదంటున్నావంటే నీలో విశ్వాసం లేదు. నువ్వనుకుంటున్నట్టు యేదీ జరగదు. జీవన్‌ని నువ్వు పెళ్ళి చేసుకోక తప్పదు" అన్నది.

"మీరు ఎన్నైనా చెప్పండి....జీవన్‌ని నేను పెళ్ళి చేసుకోను. అతను మరేదో నేరం చేసి జైలుకు వెళ్ళలేదు. ఓ ఆడదాన్ని రేప్ చేసి జైలుకు వెళ్ళాడు. అలాంటి మనిషిని చేసుకొని నేను జీవితాన్ని నరకం చేసుకోలేను.

క్షమించండి" అన్నడు.

వెంటనే వాళ్ళిద్దరూ విరుచుకు పడ్డారు.

చివరగా "నువ్వు ఒప్పుకోకపోయినా బలవంతానైనా వాడిచేత నీ మెళ్ళో తాళి కట్టిస్తాం" అని చెప్పి వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిన తర్వాత సుజాత తీవ్రంగా ఆలోచించసాగింది. ఆ రాత్రి చాలా సేపటి వరకూ అలాగే ఆలోచిస్తూ ఉండిపోయింది.

ఏం చెయ్యాలి?

తను ఏం నిర్ణయించుకోవాలి?

జైలుకు వెళ్ళిన మనిషిని పెళ్ళిచేసుకొని జీవితానికి ఉరితాడు తగిలించుకోవటమా?

ఎప్పటికో సుజాత ఓ నిర్ణయానికి వచ్చింది.

ఏమిటా నిర్ణయం?

## 2

"ఆశ్చర్యంగా వుందా?" అడిగింది సుజాత—అదోలా నవ్వి.

"అవును. ఒక్క ఉత్తరమైనా రాయకుండా ఇలా వచ్చినందుకు ఆశ్చర్యంగా వుంది" అన్నది శ్యామల.

"ఉత్తరం రాసే అవకాశంలేదు" అని జరిగిన కథనంతా తన ఫ్రెండ్‌తో చెప్పింది సుజాత.

"మై గాడ్.... రేప్ చేసి జైలుకు వెళ్ళి వచ్చిన నేరస్థుణ్ని పెళ్ళిచేసుకోవటమా? రియల్లీ హెల్" అన్నది—

శ్యామల—సుజాత కాలేజీలో క్లాస్‌మెట్స్. శ్యామల ప్రస్తుతం ఓ ప్రయివేట్ ఫర్మ్‌లో జాబ్

చేస్తోంది.

"నీకోసం మీవాళ్ళు వెతుకుతారు కదూ?" అడిగింది శ్యామల.

"అవును. అయితే నేను యెక్కడకు వెళ్ళి వుంటానో వాళ్ళు ఊహించలేరు కదా? అందువల్ల నన్ను వెతుక్కుంటూ వాళ్ళు ఇక్కడికి వస్తారనే భయంలేదు."

"ఏమైనా నువ్వో గొప్ప ప్రమాదంనించి బయట పడ్డావు. నువ్వు అక్కడే వుంటే ఆ నేరస్థుడితో నీ పెళ్ళి వాళ్ళు అనుకున్నట్టుగానే జరిపించగలరు."

తర్వాత సుజాత వారం రోజులు శ్రమపడి తనుకూడా ఓ ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగాన్ని సంపాదించుకున్నది.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నది శ్యామల.

"నీకు భారంగా ఎన్ని రోజులు నేనిక్కడ వుండాలో అని భయపడ్డాను. ఇప్పుడు నీకు ఆ బర్డెన్ లేదు" సుజాత అన్నది.

"అలా మాట్లాడకు. నువ్వు నాకు భారంకాదు. ఫ్రెండ్ అవసరంలో వున్నప్పుడు సాయం చెయ్యటం భారమెలా అవుతుంది?"

"థాంక్ యూ శ్యామలా."

"అన్నట్లు ఈ రోజు తారీకు ఇరవైమూడు కదా!"

"అవును. ఈ రోజు జీవన్ జైలునించి తిరిగివచ్చి వుంటాడు" అన్నది సుజాత.

"అతను రాగానే నీ గురించి అడుగుతాడా?"

"అవును. ఇంట్లోనించి పారిపోయిందని చెబుతారు."

"అతను నీకోసం వెతకడూ?"

నవ్వింది సుజాత — నవ్వి "నాకోసం వెతకాల్సిన

అవసరం ఆ మహానుభావుడికి ఏముంది? మళ్ళీ ఏ ఆడదాన్నో రేప్ చేసి జైలుకు వెళతాడు" అన్నది.

నవ్వింది శ్యామల.

సుజాత నిద్రపోయింది—ఆ రాత్రి ఆలోచిస్తూనే.

కాని ఆమెకు కొంచెం సేపటికే మెలకువ వచ్చింది.

ఎందుకంటే—

ఎవరో తలుపులమీద చప్పుడు చేస్తున్నారు. తను లేచి శ్యామలను నిద్రలేపాలని అనుకుంది.

కాని—ఇంతలోనే శ్యామల లేచి తలుపు తెరిచింది.

తర్వాత చిన్నగా "సువ్వా" అన్నది.

"అవును. వచ్చేదా?" ఎవరో అడిగారు.

"వద్దు....మా ఫ్రెండ్ వచ్చింది వారం రోజులక్రితం. ఇక్కడే వుంది" చిన్నగా చెప్పింది శ్యామల.

"ఎప్పుడు వెళ్ళిపోతుంది?"

"తెలీదు."

"మరెలా?"

"రేపు కలుసుకుని మాట్లాడదాం. వెళ్ళు....అది లేస్తే బావుండదు."

వాళ్ళ సంభాషణ సుజాతకు వినపడుతూనే వుంది.

ఎవరో అతను? శ్యామల మగ స్నేహితుడా? ప్రేమికుడా? ఎవరైనా ఒకటే. తను ఆ గదిలో శ్యామలతో కలిసి వుండటం ఆమెకు ఇబ్బందిని కలగజేయటమే—

మరో మనిషి వుంటే ఇబ్బందిగా వుంటుందనే విషయం సుజాతకు అర్థమైన తర్వాత ఆమె తను మరో గది వెతుక్కుని అక్కడినించి వెళ్ళిపోవాలని అనుకున్నది—

తెల్లవారిన తర్వాత తన మనసులో వున్న అభి

ప్రాయాన్ని శ్యామలతో చెప్పింది.

"ఎందుకు మరో గదిలో వుండటం? ఇక్కడ నీకు బాగా లేదా?" అన్నది శ్యామల — అదోలా చూస్తూ — ఆమెకు అనుమానం కలిగింది రాత్రి తమ మాటల్ని సుజాత విన్నదేమోనని.

"కాదు. ఆఫీసుకు బాగా దూరంగా వుంది ఈ గది.. బస్సులుకూడా టైముకు దొరకటంలేదు. అందుకే ఆఫీసు దగ్గర్లో ఓ గది తీసుకుంటాను."

శ్యామల మాట్లాడలేదు — మనసులో ఆమెకూ్కడా సుజాత వెళ్ళిపోతే బావుండును అనుకుంది కాబట్టి.

ఓ నాలుగు రోజులు కష్టపడి ఆఫీసుకు దగ్గర్లోనే ఓ గదిని అద్దెకు తీసుకుంది సుజాత.

ప్రతి రాత్రీ ఆమెకు సుందర్రావు — జగదాంబ — జీవన్ గుర్తుకు వచ్చేవాళ్ళు.

వాళ్ళేం చేస్తున్నారు?

తన గురించి ఏమనుకుంటున్నారు? తను ఒంటరిగానే ఇంట్లోనించి పారిపోయిందనుకుంటున్నారా? లేక —

ఎవరితోనైనా లేచి పోయిందని అనుకుంటున్నారా?

అలాంటి ఆలోచన కలిగినప్పుడు ఆమెకు నవ్వొచ్చింది.

ఆ ఇడియట్ జీవన్ని పెళ్ళి చేసుకోవటం కంటే మరో మనిషితో లేచిపోవటం ఘోరమేం కాదు — అనుకుంది.

సుజాత ఆఫీసునించి యింటికి వచ్చేదార్లో ఓ పెద్ద పార్కు వుంది. ఆ పార్కు రోజూ ఎంతో సందడిగా వుంటుంది.

రోజూ ఆఫీసునించి వచ్చేటప్పుడు ఆమె రోజూ ఆ పార్కులో ఓ గుబురుగా వున్న పువ్వుల చెట్టు దగ్గర

కానేపు కూర్చుంటున్నది. అక్కడ కూర్చునే తన భవిష్యత్తు గురించిన ఆలోచనలు చేస్తున్నది.

తన జీవితం ఏ వైపుకు వెళుతుంది?

ఎన్నాళ్ళీ ఒంటరితనం?

ఆమె ఆలోచనలను చదవలేకపోయినా ఆమెను ఆ పార్కులో రోజూ ఓ యువకుడు గమనిస్తున్నాడని ఆమెకు తెలీలేదు.

# 3

"నా పేరు ఆనంద్" అన్నాడతను ఆమెకు కొంచెం దూరంలో నిల్చుని—

అప్పుడు సాయంత్రం ఐదున్నర గంటలయ్యింది.

ఆశ్చర్యంగా అతడికేసి చూసింది సుజాత.

అందంగా వున్నాడు—చిరునవ్వుతో.

"నా గురించి పరిచయం చేసుకుంటాను. ఆ తర్వాత మీకు ఇష్టమైతే నాతో మాట్లాడండి. లేకపోతే చెప్పెయ్యండి. వెళ్ళిపోతాను" అన్నాడు.

అతడి మాటలతీరు ఆమెకు మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

"నా పేరు చెప్పానుకదా! మా ఊరు అమలాపురం. బి.కాం వరకు చదువుకున్నాను. ఓ రెండేళ్ళనించి ఇక్కడే వరుణ్ ఇంజనీరింగ్ కంపెనీలో క్లర్కుగా పనిచేస్తున్నాను. నా వయసు ఇరవై ఆరు. నా జీతం.... చెప్పకూడదు కాబట్టి చెప్పను" అన్నాడు.

సుజాత నవ్వి, "కూర్చోండి" అన్నది.

"థాంక్ యూ.... అంటే మీకు నాతో మాట్లాడటం ఇష్టమేనన్నమాట" అన్నాడు ఆమె యెదురుగా గడ్డిలో కూర్చుని.

ఆమె మాట్లాడలేదు.

"నా గురించిన వివరాలు చెప్పాను. ఇక మీ గురించిన వివరాలు చెప్పండి. కొన్ని రోజులుగా మిమ్మల్ని ఈ పార్కులో ఒంటరిగా చూస్తున్నాను. ఒక్కసారికూడా మీరు యెవ్వరితోనూ కలిసి రాలేదు. అంటే మీకు ఇక్కడ స్నేహితులెవరూ లేరా? మీరు ఇక్కడకు కొత్తగా వచ్చారా?"

"అవును. నేను ఈ మధ్యనే ఇక్కడికి వచ్చాను" అని తను ఎక్కడ ఉద్యోగం చేస్తున్నదీ చెప్పింది.

"థాంక్స్ .... నాకూ రోజూ పార్కుకు వచ్చి కొంచెంసేపు కూర్చోకపోతే యేదోలా ఉంటుంది. అందుకే రోజూ వస్తాను. ఐయామ్ లక్కీ—అలా రోజూ వస్తుండబట్టే మీతో పరిచయం కలిగింది" అన్నాడు ఆనంద్.

ఆమె నవ్వింది.

అతను కొంచెంసేపు నిరుద్యోగ సమస్య గురించి మాట్లాడాడు.

సుజాతకు అతడు మాట్లాడుతున్నతీరు బాగా నచ్చింది. అతడిలో యేదో ఆకర్షణ ఉన్నట్టుగా కూడా అనిపించింది.

ఆమెకు ఎంత టైము గడిచిందీ తెలీలేదు.

ఆమె టైమును గమనించేసరికి చీకటిపడింది.

పార్కులో దీపాలన్నీ వెలుగుతున్నాయి.

చటుక్కున లేచి నిల్చుంది.

"ఈ రోజు ఆలస్యమయిందికదూ మీకు?" అన్నాడు అతను.

"అవును, మీ మాటల్లోపడి గమనించనే లేదు"

అన్నది.

"సారీ."

"ఫర్వాలేదు" నవ్వుతుంటూ అక్కడినించి కదిలింది.

వెనుకనించి ఆనంద్ 'గుడ్ నైట్' అనటం ఆమెకు వినిపించింది.

ఆ రాత్రి ఆమె ఆనంద్ గురించి ఆలోచించకుండా ఉండలేకపోయింది. అతడితో పరిచయాన్ని పెంచుకోవటం గురించికూడా ఆమె బాగా ఆలోచించింది.

అతనుకూడా తన గురించి ఇలాగే ఆలోచిస్తూ వుంటాడా? ఏమో!

సుజాతకు ఉన్నట్టుండి ఆ క్షణంలో జీవన్ గుర్తుకు వచ్చాడు.

ఆ రోగ్ తనని తిరస్కరించి పోయినట్టు తెలుసు కాబట్టి తనమీది పగతో వెతుకుతున్నాడా?

తనెక్కడ ఉన్నదీ తెలుసుకుంటాడా?

ఒకవేళ తెలుసుకుని వస్తే?

అతడినించి తనని కాపాడగలిగిన మనిషెవరు?

అప్పుడు ఆమె కళ్ళముందు ఆనంద్ కదిలాడు.

మళ్ళీ ఆనంద్ గురించి ఆలోచించింది సుజాత.

అతడితో పరిచయాన్ని పెంచుకోవాలనే నిర్ణయించుకున్నది.

## 4

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది. గోడనున్న గడియారాన్ని చూసి లైవ్ మిషన్ రోలర్‌కు వున్న కాయితాలను తీసింది సుజాత.

వాటిని ఫైల్లో వుంచి అటెండర్‌కు ఇచ్చి మేనేజర్ గదిలోకి పంపించింది.

మిషన్ మీద కవర్ తొడుగుతున్నప్పుడు అటెండర్ వచ్చి "మేనేజర్ గారు మిమ్మల్ని పిలుస్తున్నారు" అని చెప్పాడు.

లోపలకు వెళ్ళింది సుజాత.

అప్పటికే అంతా బయటకు వెళ్ళిపోతున్నారు— మిగిలిన ఉద్యోగులు.

"సారీ ఫర్ ది రిస్క్....ఐనా తప్పదు. ఓ గంట స్పేర్ చెయ్యండి చాలు. ఇవి చాలా అర్జంటు కాయితాలు. అందుకే వెంటనే టైప్ చేసి తీసుకురండి" అన్నాడు మేనేజర్ ప్రకాష్.

ఇబ్బందిగా అతడ్ని చూసింది ఆమె.

"మరోసారి సారీ....ఈ ఒక్క సారికే...." అంటూ రిక్వెస్టు చేశాడు ఆయన.

ఇక కాదనలేక పోయింది సుజాత. ఆమెకు మనసులో త్వరగా వెళ్ళి పార్కులో ఆనంద్‌ను కలుసుకోవాలని గాఢంగా వుంది.

ఆ కాయితాలను తీసుకుని బయటకు వచ్చింది.

ఆనంద్‌ను కలుసుకోవాలనే తొందరలో ఆ కాయితాలను అరగంటలోనే టైప్ చేసి తనే మేనేజర్ దగ్గరకు తీసుకెళ్ళింది.

"వెరీగుడ్....క్విక్ వర్క్....మీలాంటి మనుషులకు మంచి ప్రోగ్రెస్ వుంటుంది" అన్నాడు ప్రకాష్.

"ఇక నే వెళతాను సర్."

"కూర్చోండి....మీతో ఓ విషయం చెప్పాలి" అన్నాడు...

"నాకు కొంచెం పనుంది."

"ఫర్వాలేదు....జస్ట్ ఫైవ్ మినిట్స్....అంతే."

కూర్చుంది.

"మీ రెంత కష్టపడి సిన్సియర్ వర్క్ చేస్తున్నారో గ్రహించాను. అందుకే ఈ నెలనించీ మీ జీతం మరో వంద రూపాయలు పెంచుతున్నాను" అన్నాడు సిగరెట్టు వెలిగించి.

"థాంక్ యూ సర్" అన్నది సంతోషంగా.

"ఊరికే థాంక్స్ చెప్పటమేనా? నాకు ఓ పార్టీ యివ్వరా?" నవ్వుతూ అడిగాడు.

"చెప్పండి. ఏ పార్టీ యివ్వమంటారు?"

"సుజాతా — నాకు మీనించి యెలాంటి పార్టీ అవసరంలేదు. మీరే నాకో పార్టీ. ఒక్కసారి మిమ్మల్ని మీరు యిచ్చుకుంటే...." హఠాత్తుగా మాట్లాడుతూనే ముందుకువంగి ఆమె చేతుల్ని పట్టుకున్నాడు ప్రకాష్.

ఆమె షాక్ తిన్నది ప్రకాష్ మాటలకు.

వెంటనే తేరుకుని అతని చెంపమీద శక్తికొద్దీ కొట్టింది అతని చేతులను విడిపించుకుని.

ఈసారి మేనేజర్ షాక్ తిన్నాడు— చెంపదెబ్బతో పాటు ఆమె అలా అంత గట్టిగా కొడుతుందని అతను పొరపాటునకూడా ఊహించలేదు.

వందరూపాయలు జీతం పెంచుతున్నట్టుగా చెప్పగానే సంతోషపడిపోయి తను చెప్పినట్టుగా వింటుందను కున్నాడు.

రివ్వున నిల్చుని "ఇడియెట్ ....నువ్వు మనిషివేనా? నీ భార్యను మరో మగవాడి దగ్గరకు పంపించి—ఆ తర్వాత నువ్వు నా దగ్గరకురా" అని అక్కడినించి బయటకొచ్చేసింది.

బయటకు వస్తున్నప్పుడు "నీ అంతు చూస్తాను. నువ్వు

నాకెలా లొంగవో చూస్తాను" అని ప్రకాష్ అనటం ఆమె విన్లేదు.

సుజాత జేవురించిన మొహంతో పార్కులోకి వెళ్ళేసరికి అతనొక్కడే కూర్చుని ఆమె కోసమే యెదురు చూస్తున్నాడు.

ఆమెను చూస్తూనే "ఏమిటలా వున్నారు?" అనడిగాడు.

వెంటనే చెప్పలేకపోయింది ఆమె——

కాని అప్పటికి అతనే ఆమెకు ఆత్మీయుడిగా అనిపించటంవల్ల మేనేజర్ గురించి అతడితో చెప్పింది.

"డర్టీ రోగ్. అలాంటి వెధవలకు ఒక చెంపదెబ్బ సరిపోదు. కాలో — చెయ్యో విరగదీయాలి" అన్నాడతను.

"మగాళ్ళందరూ ఇంతేనేమో" అన్నది సుజాత.

"చంపేశారు....అలా అనకండి.... నేనూ మగాడినే. కాని అలాంటి వాడ్ని కాదు. ఎక్కువమంది మగాళ్ళు ఆడదాన్ని వేటాడాలనే అనుకుంటారు. ఇందుకు నేను కూడా ఒప్పుకుంటాను. తమ దగ్గర పని చేసే ఆడవాళ్ళంటే మగాళ్ళకు ఓ చులకన భావం వుంటుంది" అన్నాడు....

"ఐనా అలా అడగటానికి వాడికెంత ధైర్యం?" ఆమెలో ఆవేశం ఇంకా తగ్గలేదు.

"ఇంతకీ ఆ ఆఫీసులో మీ ఉద్యోగం సంగతేమిటి?" అడిగాడు ఆనంద్.

"ఇంకేం ఉద్యోగం. ఆ వెధవ దగ్గర ఉద్యోగం చెయ్యటం ఇంపాసిబుల్. ఇప్పుడు నాకు అదే దిగులుగా వుంది. రేపటినించి మళ్ళీ ఉద్యోగాల వేటలో పడాలి" అన్నది.

"వర్రీ అవకండి.... నేనుకూడా ప్రయత్నం చేస్తాను. ఓ వారం రోజుల్లోనే యేదో ఓ ఫర్మ్‌లో మీకు ఉద్యోగం వచ్చేలా నేను చూస్తాను. ఆ విషయం నాకు వదిలెయ్యండి."

"థాంక్ యూ."

"నో థాంక్స్....ఇది నా డ్యూటీ .... అవసరంలో వున్న ఓ స్నేహితురాలికి సహాయపడటం నా డ్యూటీగా భావిస్తాను."

ఆ రాత్రి ఆమెకు జీవన్ గుర్తు రాలేదు. కాని మేనేజర్ ప్రకాష్ ఎక్కువగా గుర్తొచ్చాడు.

# 5

క్లాత్ షో రూంలోనించి బయటకు వచ్చింది సుజాత. అప్పుడే చీకటి పడుతోంది.

అక్కడికి బస్టాపు కొంచెం దూరంలోనే వుంది. రెండు నిమిషాల్లో బస్టాపు దగ్గరకు వచ్చి నిల్చుంది. అప్పుడే బస్సు వచ్చి ఆగింది.

ఎక్కింది—సుజాత.

ఆమె బస్సులో యెక్కి కూర్చుని రోడ్డు పక్కనే వున్న దుకాణాలను చూస్తోంది.

ఆమె భవిష్యత్తు గురించి ఆలోచిస్తోంది.

మళ్ళీ త్వరలో ఉద్యోగం దొరుకుతుందా?

ఆమె ఆలోచనలు కాసేపు ఆనంద్ మీదకు మళ్లాయి.

బస్సు ఆగింది.

దిగి ఇంటికేసి నడిచింది. ఆమెను ఒక వ్యక్తి నీడలా వెంటాడుతున్నాడని ఆమెకు తెలియదు.

గది తలుపులు తెరిచి లోపలకు వెళ్ళింది. డ్రెస్ మార్చుకుంది. తలుపులు మూసి స్టవ్ వెలిగించింది.

ఇంతలోనే తలుపులమీద చప్పుడయ్యింది. ఆమె చెంగున నిల్చుంది.

ఆనంద్ వచ్చి వుంటాడు — అనుకుంది.

ఇలా అనుకుని తలుపులు తెరిచి షాక్ ఫీలయ్యింది.

ఎదురుగా — వికృతంగా నవ్వుతూ అతను నిల్చుని వున్నాడు. గళ్ళ షర్టు—నల్లటి ప్యాంటు వేసుకున్నాడు. సన్నగా పొడుగ్గా వున్నాడు. ఎత్తుగా పెరిగిన జుట్టు—సన్నగా గీసుకున్న గడ్డం.

"క్షేమంగానే వున్నావా?" నవ్వుతూ అడిగాడు.

అప్పుడు షాక్‌నించి తేరుకుని "నువ్వా! యెప్పుడొచ్చావ్?" అన్నది నీరసంగా.

"ఎక్కడినించి జైలునించా? ఈ నగరానికా? జైలునించయితే ఇరవై మూడో తారీకునే వచ్చాను. ఈ ఊరికి నాలుగు రోజుల క్రితం వచ్చాను. నీకోసమే అంతా వెతుకుతున్నాను."

భయపడింది ఆమె—

"లోపలకు ఆహ్వానించవా?" అంటూనే ఆమెను నెట్టుకుంటూ లోపలకు వచ్చి అక్కడే వున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఇప్పుడేమిటి చెయ్యటం?

జీవన్ ఏం చేస్తాడు? తనని ఇంటికి తీసుకెళతాడా?

"నాన్నా — అమ్మ జరిగిన కథంతా చెప్పారు. నన్ను చేసుకోనని పారిపోయి వచ్చావుట. అవునుకదూ?"

తల వూపింది.

పెద్దగా నవ్వాడతను.

"అసలు నేను జైలుకు యెందుకు వెళ్ళానో తెలుసా? ఇంకో ఆడదాన్ని రేప్ చెయ్యబట్టి. అసలు నిన్నే రేప్

చెయ్యాలనుకున్నాను. కాని నువ్వు నా కాబోయే పెళ్ళానివని, నిన్ను రేప్ చెయ్యాల్సిన అవసరంలేదని చెయ్యలేదు. నువ్విలా నన్ను కాదని పారిపోయి వస్తావని అనుకుంటే అప్పుడే నిన్నే రేప్ చేసి వుండేవాడ్ని."

ఉలిక్కిపడింది.

"ఇంతకీ నన్ను వెతుక్కుంటూ యెందుకు వచ్చావ్?"

మళ్ళీ నవ్వాడు జీవన్.

"ఎందుకొస్తాను? నువ్వు నా కాబోయే పెళ్ళానివి. అందుకే వచ్చాను. త్వరగా నీ బట్టలు సర్దుకో... ఇప్పుడే మనం ఇక్కడినించి వెళ్ళిపోతున్నాం. అమ్మ—నాన్న నీకోసం యెదురుచూస్తున్నారు."

"నేను రాను. నిన్ను పెళ్ళిచేసుకోను."

"నాకేం తక్కువ?"

"నీకు తెలీదా? నువ్వు మంచివాడివైనట్లయితే సంతోషంగా ఒప్పుకునేదాన్ని. కాని నువ్వు నేరస్థుడివి. జైలుకు వెళ్ళిన మనిషిని నేను చేసుకోను."

ఊహించలేదు సుజాత.

జీవన్ గబుక్కున నిలబడి ఆమె చెంపమీద కొట్టాడు.

"చంపేస్తాను. జైలుకు వెళ్ళి వచ్చినా నేనే నీ మొగుడ్ని. మర్యాదగా వెంటనే బయల్దేరు."

కెవ్వున అరిచింది సుజాత.

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

సరిగ్గా ఆమె అరుస్తున్నప్పుడే అక్కడకు వచ్చాడు ఆనంద్.

అతదెవరో ఆమెను హింసిస్తున్నాడని అతనికి అర్థమయ్యింది.

లోపలకు వస్తూనే "సుజాతా....ఎవరీ మనిషి?" అని

అడిగాడు.

ఆనంద్‌ను చూడగానే అంత దుఃఖంలో సుజాతకు సంతోషం కలిగింది.

"ఇడియట్ ....నన్ను తనతో రమ్మని కొడుతున్నాడు" ఏడుస్తూ చెప్పింది.

"వీడెవరు? ఓహో....అర్థమయ్యిందిలే. వీడ్ని చూసుకునేనా నాతో రానంటున్నావు" అన్నాడు జీవన్.

అంతే—ఆతని మొహం అదిరిపోయింది. విసురుగా వెళ్ళి గోడను ఢీకొన్నాడు. జీవన్ లేవకముందే బూటుకాలితో అతని డొక్కలో గట్టిగా తన్నాడు ఆనంద్.

కీచుమంటూ అరిచాడు జీవన్—బాధగా.

జీవన్‌కంటే ఆనంద్ నాలుగురెట్లు బలవంతుడు.

"ఇంతకీ ఎవడీ వెధవ?" అడిగాడు ఆనంద్.

"తర్వాత చెబుతాను."

జీవన్ మూల్గుతూ లేచి నిల్చున్నాడు.

అతడ్ని విసురుగా బయటకు నెట్టాడు ఆనంద్.

వెళ్ళి రోడ్డుమీద పడ్డాడు.

"మీ ఇద్దరి అంతు చూస్తాను. ఈ జీవన్ అంటే యేమిటో తెలియజేస్తాను" అని అంటుతూ అక్కడినించి కదిలాడు జీవన్.

ఆనంద్ గుండెలమీద వాలిపోయి చిన్నగా ఏడ్చింది సుజాత. ఆతనే రాకుండా ఉన్నట్లయితే జీవన్ తనని ఏం చేసేవాడో?

"ఇంతకీ యెవరు ఆ ఇడియట్?" అడిగాడు మళ్ళీ ఆనంద్.

జీవన్ గురించి అంతా చెప్పింది ఆమె ఏడుస్తూనే.

"గుడ్ గాడ్ ....ఇతను జైలుకు వెళ్ళి వచ్చిన మనిషా.

ఆ విషయం నువ్వు ముందే చెప్పినట్లయితే ఇంకో నాలుగు తన్ని పోలీసులకు అప్పజెప్పేవాడిని" అన్నాడతను.

ఆమె కథ ఆనంద్ కు జాలిని కలిగించింది.

"నీకు ఓ ఉద్యోగం గురించి చెప్పాలని వచ్చాను. మా ఆఫీసులో టైపిస్టుకు బ్యాంకులో జాబ్ వచ్చిందిట. ఆమె రెండు రోజుల్లో రిజైన్ చేసి వెళ్ళిపోతుంది. మా బాస్ కు నీ గురించి చెప్పాను. ఆయన అప్లయ్ చెయ్యమన్నాడు. ఈ విషయం చెప్పాలనే ఇప్పుడు వచ్చాను."

"మీరు రావటం మంచిదే అయింది. లేకపోతే ఆ నీచుడు నన్ను బలవంతంగానైనా తనతో తీసుకెళ్ళేవాడు. ఇప్పుడు నాకు భయంగా వుంది. ఈ గదిలో నేను ఒంటరిగా వుంటున్నాను. జీవన్ మళ్ళీ యెప్పుడో వచ్చి నన్ను తీసుకెళతాడు. ఈసారి అత్తయ్యను, మామయ్యను తీసుకుని వస్తాడేమో."

"భయపడకు.... నేను వుండగా నీకు భయంలేదు. పోనీ అంతగా నువ్వు భయపడుతుంటే నువ్వు కూడా నా గదిలోకి వచ్చి వుండు...." అన్నాడు ఆనంద్.

ఆమె అతడి కళ్ళలోకి చూసింది.

నిర్మలంగా వున్నాయి అతడి కళ్ళు.

"బావుండదు—వద్దు" అన్నాడతను మళ్ళీ.

సుజాత మాట్లాడలేదు.

కొంచెంసేపటి తర్వాత ఆమెను జాగ్రత్తగా ఉండమని చెప్పి వెళ్ళిపోయాడు ఆనంద్.

## 6

సుజాత పడుకుని ఆలోచిస్తోంది. ఆమెకు మనసులో భయంగా వుంది.

జీవన్ తనవాళ్ళిద్దరినీ తీసుకుని వస్తాడేమో! అప్పుడు

తనేమిటి చెయ్యటం? తనని ఎవరు ఆపగలరు?

ఆనంద్ కోరినట్టుగా అతనివెంట గదికి వెళ్ళినట్లయితే బావుండేదేమో? కాని అలా వెళ్ళటం తనకు ఇష్టంలేదు. ఓ మగాడి గదిలో తను పెళ్ళికాకుండా గడపటమా?

శ్యామల దగ్గరకు వెళ్లాలనుకుంది.

అవును.

తప్పదు.

కొన్ని రోజులు ఆమె దగ్గరే వుండటం తనకు మంచిది. ఈ ఒక్క రాత్రి యెలాంటి గొడవ జరక్కుండా తెల్లవారితే రేపు శ్యామలను కలుసుకుని తన పరిస్థితిని తెలియజేసి అక్కడే వుండొచ్చు.

ఇలా అనుకుంటూ నిద్రపోయింది.

అప్పుడు రాత్రి పదకొండు గంటలయ్యింది.

నిద్రలో ఉన్న సుజాత ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. ఆమెకు మసగ్గా గదనంతటినీ ఆక్రమించుకున్న వెలుతురు కనిపించింది.

ఆమెకు నిద్రలో యెవరిదో కేక వినిపించింది.

ఇంతలోనే బయట యెవరివో అరుపులు వినిపించాయి.

లేచి నిల్చుంది.

తలుపులు తెరుచుకొని బయటకు చూసింది. తనగది యెదురుగా కొంతమంది జనం మూగి వున్నారు.

"ఏం జరిగింది" అడిగింది సుజాత.

వాళ్ళు ఒక్కసారి వెనక్కి తిరిగి సుజాతను చూశారు.

ఆమెకేమీ అర్థంకాలేదు.

దగ్గరగా వెళ్ళింది.

జనం మధ్య నెత్తురు మడుగులో వెల్లికింతలా పడి

వున్న మనిషిని చూసి 'కెవ్వున' అరిచింది.

అతను జీవన్!

అతని గుండెల్లోనించి నెత్తురు కారుతోంది.

"ఇతను మీకు తెలుసు కదూ?" ఎవరో అడిగారు ఆమెను.

సుజాత మాట్లాడలేదు.

ఆమెకు మతిపోయినట్లనిపించింది.

జీవన్‌ను ఎవరు హత్య చేశారు?

ఆనంద్!

ఊహు. అతను కాదు. జీవన్‌ని చంపవలసిన అవసరం లేదు.

ఐతే ఎవరు?

ఎవరో పోలీసులకు ఫోన్ చేశారు.

సుజాత అక్కడ నిలబడలేక పోయింది. లోపలకు వచ్చి కూర్చుంది.

ఊహించని పరిణామం.

పోలీసు లొచ్చారు.

అప్పటికే అక్కడి జనం పెరిగిపోయింది.

ఇన్‌స్పెక్టర్ మహేంద్ర యెవరొన్నో పిలిచి యేదో అడిగాడు. అయన యేదో చెప్పాడు — కొంచెంసేపు సుజాత గది చూపుతూ—

మహేంద్ర—సుజాత గదిలోకి వచ్చాడు.

అతన్ని చూడగానే ఆమె భయపడింది.

"హత్య చెయ్యబడిన యువకుడు మీకు తెలిసిన మనిషని చెప్పారు. నిజమేనా?"

"అవును" అంటూ జీవన్ గురించి అంతా చెప్పింది.

అతను తనని బెదిరించటం గురించి కూడా చెప్పింది.

"ఆ ఘర్షణ జరిగినప్పుడు ఇక్కడ మరో యువకుడు ఇతన్ని కొట్టి బయటకు నెట్టాడని చెప్పారు. అత నెవరు?"

ఆమె ఉలిక్కిపడింది.

తను చెప్పకపోయినా యెలాగైనా వాళ్ళు ఆనంద్ గురించి తెలుసుకుంటారు. అతని గురించి చెప్పకపోవటం వల్ల తను ఈ హత్యా నేరానికీ అతనికీ సంబంధం వుందనే అనుమానాన్ని ఇన్‌స్పెక్టర్‌కు కలిగించినట్లవుతుంది.

ఆ క్రితం రోజు జరిగినదంతా మహేంద్రతో చెప్పేసింది ఆమె—

చెప్పి "ఆనంద్ నిర్దోషి. నన్ను జీవన్ బలవంతంగా తీసుకెళ్ళటానికి ప్రయత్నం చేశాడని అతన్ని కొట్టి బయటకు నెట్టాడు. అంతకుమించి ఆనంద్‌కు జీవన్ మీద శత్రుత్వం లేదు. ఆనంద్ నిర్దోషి. ఈ హత్యను చెయ్యలేదు. నా మాట నమ్మండి" అన్నది.

బయట యెవరి పనుల్లో వాళ్ళు మునిగి ఉన్నారు. పోలీసులు జనాన్ని మారంగా నెట్టి వేస్తున్నారు.

ఇన్‌స్పెక్టర్ "అలాంటప్పుడు జీవన్‌ని ఈ గదిముందే హత్య చెయ్యవలసిన అవసరం యెవరికి వుంది? అతనికి ఇంకెవరైనా శత్రువులున్నారా?" అన్నాడు.

"ఏమో! వుండొచ్చు. ఎందుకంటే అతను నేరస్థుడు. అతని స్నేహితులంతా రౌడీలు. మంచివాళ్ళు కాదు. అంతర్గతంగా ఒకరంటే ఒకరికి ద్వేషం వుండొచ్చు. అలాంటి వాళ్లెవరో అతన్ని ఇక్కడ పొడిచి చంపి వుండొచ్చు."

"మీ వాదన బాగానే వుంది. అతన్ని పొడిచినప్పుడు

మీకు కేక వినిపించలేదా?" అడిగాడు.

"చిన్నగా వినిపించింది. ఏదైనా కలవచ్చిందేమో అనుకున్నాను. కాని బయట యెవరివో మాటలు వినిపించాయి. అప్పుడు తలుపు తెరిచాను. ఎదురుగా గుంపుగా మనుషులు వున్నారు. వెళ్ళి చూశాను."

అతను తల ఊపాడు.

ఆమె మాటలు అతనికి నమ్మశక్యంగా అనిపించాయి. ఎందుకంటే ఎదురుగా వున్న ఇంటాయన కూడా కేక వినిపించగానే తామంతా బయటకొచ్చామనీ, ఆ తర్వాత కొంచెం సేపటికి సుజాత తలుపులు తెరిచిందనీ చెప్పాడు.

అందువల్ల అతని హత్యకీ సుజాతకీ సంబంధం లేదని నిర్ణయించుకున్నాడు.

ఇక—ఆనంద్!

అతన్ని కలుసుకుంటేనే తెలుస్తుంది.

"ఆనంద్ ఎడ్రస్ చెప్పండి."

చెప్పింది సుజాత.

"మళ్ళీ కలుస్తాను. దయచేసి మీరు నగరం విడిచి యెక్కడికీ వెళ్ళకండి" అని జీవన్ తండ్రి ఎడ్రసుకూడా తీసుకుని బయటకు వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్.

సుజాత మొహం పాలిపోయింది.

జీవన్ హత్య ఆనంద్‌ను ప్రమాదంలోకి నేడుతోంది. ఆనంద్—జీవన్‌ని తన్ని బయటకు నెట్టటం అక్కడ చాలామంది చూశారు.

ఐనా జీవన్‌ని తన గదిముందే ఎందుకు హత్య చేశారు? తనమీదకు అనుమానాన్ని మళ్ళించటానికా?

ఎందుకు?

హత్యాయుధం దొరకలేదు.

కొంచెంసేపటి తర్వాత జీవన్ శవంతో పోలీసులు వెళ్ళిపోయారు.

సుజాతకు యేడుపు వచ్చింది.

జీవన్ పోయినందుకు ఆమెకు కొంత బాధ కలిగింది. అతను యెంత దుర్మార్గుడైనా తన మేనమామ కొడుకు.

గదిలో వుండలేకపోయింది.

శ్యామల దగ్గరకు వెళ్ళాలని అనుకుంది. అవును. ఈ విషయంలో తను శ్యామల సలహా తీసుకోవాలి.

గదికి తాళంపెట్టి, దగ్గర్లో వున్న ఆటో స్టాండ్‌లో ఓ ఆటో ఎక్కి శ్యామల ఇంటికి వెళ్ళింది సుజాత.

శ్యామలకు జరిగిందంతా చెప్పింది.

"మై గాడ్, మీ బావ నీ గదిముందే హత్య చెయ్యబడ్డాడా?" ఆశ్చర్యపోయింది శ్యామల.

"అవును. అంతేకాదు. ఆనంద్ అతన్ని కొడుతున్నప్పుడు కొందరు చూశారు. వాళ్ళు ఇన్‌స్పెక్టర్‌తో అతని గురించి చెప్పారు. ఇన్‌స్పెక్టర్ ఆనంద్ గురించి అడిగాడు. చెప్పాను. ఇన్‌స్పెక్టర్—ఆనంద్‌ను అనుమానించవచ్చు. ఈ హత్యా నేరాన్ని అతనిమీదకు నెట్టే ప్రయత్నం చెయ్యొచ్చు. ఆనంద్ నిర్దోషి. ఎలాగైనా అతన్ని ఈ ప్రమాదంనించి కాపాడాలి. కాని ఎలా?"

శ్యామల కొంచెంసేపు ఆలోచించింది. తర్వాత సుజాతను తీసుకుని బయటకు నడిచింది.

## 7

డిటెక్టివ్ రణధీర్—సుజాత చెప్పినదంతా విన్నాడు.

అంతా విని—

"మీరు చెప్పినదంతా విన్న తర్వాత ఆనంద్ నిర్దోషి అనే నమ్మకం నాకు కలుగుతోంది. ఈ హత్యను ఆనంద్

చెయ్యలేదు. అతనే చేసివుంటే మీ గది యెదురుగా ఈ హత్య జరిగి వుండేదికాదు. ఎవరో కావాలనే మీమీదకు అనుమానం రావాలనే మీ గదిముందు ఈ హత్యను చేశారు. అంటే హంతకులకు ఆనంద్ కీ హతుడికీ జరిగిన ఘర్షణ తెలిసి వుండాలి. మీ ఎడ్రసు ఇచ్చి వెళ్ళండి. నేను యిప్పుడే నా పరిశోధన మొదలుపెడతాను. అలస్యంచేస్తే హంతకులు పారిపోయే అవకాశం వుంది" అన్నాడు సిగరెట్టు వెలిగిస్తూ—

"మీ ఫీజు" అన్నది సుజాత.

"ఇప్పుడేమీ అవసరంలేదు. దాని గురించి తర్వాత మాట్లాడుకుందాం."

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

రూమ్ లాక్ చేసి స్కూటర్ మీద బయల్దేరాడు రణధీర్.

ముందుగా అతను ఇన్ స్పెక్టర్ మహేంద్రను కలుసుకున్నాడు స్టేషన్ లో — అప్పటికే అతను ఆనంద్ ను హత్యానేరం అనుమానంమీద అరెస్టుచేసి తీసుకొచ్చాడు.

డిటెక్టివ్ రణధీర్ — ఆనంద్ తో పది నిమిషాలు మాట్లాడాడు.

"ఈ కేసులో నీ ఇంట్రస్టు యేమిటి? అప్పుడే ఈ హత్య గురించి నీకెలా తెలిసింది?" ఆశ్చర్యంగా అడిగాడు మహేంద్ర.

"ఆనంద్ నిర్దోషి. అసలు నేరస్థులను పట్టుకోగలను అనే నమ్మకం నాకు వుంది" అన్నాడు.

"అవును. ఆ హత్యను అతను చేశాడని నేనుకూడా అనుకోవటంలేదు. కాని—ప్రస్తుతం అతనొక్కడే అనుమానితుడు. అందుకే అతడ్ని తీసుకొచ్చాను" అన్నాడు

ఇన్ స్పెక్టర్ మహేంద్ర.

"వెళతాను."

రణధీర్ అక్కడినించి బయల్దేరాడు.

పదినిమిషాల్లో హత్య జరిగిన ప్రదేశాన్ని చేరుకున్నాడు. సుజాత గదిలో దీపం వెలుగుతోంది. కిటికీ సందుల్లోనించి వెలుతురు బయటకు పడుతోంది.

స్కూటరు ఆమె గదిముందు ఆపాడు.

చప్పుడుకు ఆమె తలుపు తెరిచింది.

ఆనంద్ ను కలిసి మాట్లాడిన విషయం ఆమెకు చెప్పాడు.

"ఇన్ స్పెక్టర్ కూడా ఆనంద్ ని అనుమానించటంలేదు. అందువల్ల మీరు అతని విషయంలో వర్రీ అవకండి. నేను ఈ వీధిలో ఎంక్వాయిరీ చేస్తాను. జీవన్ ని హత్యచేసిన మనిషిని ఎవరైనా చూసే అవకాశం వుండేమో తెలుసుకుంటాను" అని ఆమెతో చెప్పి అక్కడినించి ఆ రోడ్డు చివరకు నడిచాడు—ఆ రోడ్డు చివర యెంతో దూరంలేదు.

అక్కడ నిల్చున్నాడు రణధీర్.

ఓ ఇంటి పైనించి దీపం వెలుతురు రోడ్డుమీదకు పడుతోంది.

పైకి చూశాడు.

డాబామీద రోడ్డు యెదురుగా కూర్చుని చదువుకుంటున్నాడు ఇరవై యేళ్ళ యువకుడు.

అతడిని చూడగానే రణధీర్ కళ్ళు మెరిశాయి. అతను చాలా సేపటినించీ అక్కడ కూర్చుని చదువుకుంటూ వుండొచ్చు.

గేటు నెట్టుకొని పైకి వెళ్ళాడు.

హఠాత్తుగా పైకి వచ్చిన రణధీర్ ని చూసి ఆ

యువకుడు ఉలిక్కిపడ్డాడు.

పరిచయం చేసుకున్నాడు రణధీర్.

"కూర్చోండి" అన్నాడతను.

"ఇక్కడ నువ్వు ఎన్ని గంటలనించి చదువుకుంటున్నావు?" అడిగాడు రణధీర్.

"పదిగంటలనించి."

"ఈ వీధిలో రెండుగంటల క్రితం హత్య జరిగింది నీకు తెలుసుకదూ?"

"తెలుసు."

"అప్పుడు నీకు కేక వినిపించిందా?"

"విన్నాను."

"అప్పుడు నువ్వు ఈ రోడ్డున ఎవరైనా పరుగుదీయటం చూశావా?"

అతను వెంటనే మాట్లాడలేదు. భయంగా రణధీర్‌ని చూశాడు.

ఆ చూపుల్లోనే తనేదో చెప్పడానికి భయపడుతున్నాడని గ్రహించాడు డిటెక్టివ్.

"భయపడకు. నువ్వు చూసిందంతా ధైర్యంగా నాతో చెప్పు. అందువల్ల నువ్వు ఒక నిర్దోషిని హత్యానేరంనించి కాపాడినవాడివవుతావు."

"పోలీసులకే చెబుదామనుకున్నాను. కాని భయం వేసింది. అందుకే చెప్పలేదు. హత్య జరిగిన సమయంలో నాకు తలనొప్పిగా వుండి లైటు ఆర్పేసి యిక్కడే కూర్చున్నాను. ఆ సమయంలో హత్య చెయ్యబడిన మనిషి సందు మలుపు తిరిగి గబగబా నడిచివెళ్ళాడు. ఒక్క నిమిషం తర్వాత మరో మనిషి అతని వెనకే వచ్చాడు. చూస్తూనే వున్నాను. ముందు వెళుతున్న

మనిషి ఆగిపోయాడు. వెంటనే వెనుక వెళుతున్న మనిషి కత్తితో చటుక్కున గుండెల్లో పొడిచి కత్తిని చేతిలో వున్న ఏదో తోలు సంచీలో వేసుకొని ఇటునించే పరుగు దీశాడు. ఆ తర్వాత కొంచెం సేపటికి జనం ఇళ్ళలోనించి బయటకు వచ్చారు."

"ఆ రెండో మనిషి ఎలా వున్నాడు?"

"పొట్టిగా-లావుగా వున్నాడు. నల్లని బట్టలు వేసుకున్నాడు. భుజాలు ఎత్తుగా ఉన్నాయి."

"థాంక్ యూ....ఇక నువ్వు కిందకెళ్ళి పడుకో.... హంతకుడ్ని పట్టుకోటానికి ఈ ఆధారాలు చాలు" అని అక్కడినించి కిందికి వచ్చాడు రణధీర్.

ఆ రోడ్డు మలుపు చివర్లో ఆటోరిక్షా స్టాండు వుంది. అక్కడ వున్న ఆటోరిక్షా డ్రయివర్లకు పొట్టిగా, లావుగా వున్న మనిషి గురించిన గుర్తులు చెప్పాడు.

"అవును సార్ ఆ మనిషి చేతిలో తోలుసంచీ కూడా వుంది. అతన్ని నేనే విశాస్ లాడ్జికి తీసుకెళ్లాను" అన్నాడో డ్రయివర్.

రణధీర్ కళ్ళు మెరిశాయి.

అతనికి థాంక్స్ చెప్పి, ఆ ఆటోలోనే రణధీర్ విశాస్ లాడ్జికి వెళ్ళాడు. కునికిపాట్లు పడుతున్న రిసెప్షనిస్టుని నిద్రలేపి పొట్టిగా లావుగా ఉన్న మనిషి గురించి అడిగాడు.

"ఓహో .... అతనా .... నాలుగు రోజుల క్రితమే వచ్చాడు. రూం నెంబర్ నూటనాలుగులో ఉంటున్నాడు" అన్నాడతను.

వెంటనే రణధీర్ ఇన్‌స్పెక్టర్ మహేంద్రకు ఫోన్ చేశాడు.

సరిగ్గా పదినిమిషాల్లో పోలీసులతో వచ్చాడు మహేంద్ర.

అంతా రూం నెంబర్ నూటనాలుగులో లావుగా—పొట్టిగా ఉన్న మనిషిని పట్టుకున్నారు—ఆ గదిలో ఉన్న తోలు సంచీలో నెత్తురు తడి ఆరని కత్తికూడా దొరికింది.

అతని పేరు మనోహర్. అతను తనే జీవన్‌ని హత్య చేసినట్టుగా ఒప్పుకున్నాడు.

"జీవన్—ఆ దుర్మార్గుడు ఐదేళ్ళ క్రితం నా చెల్లెల్ని రేప్ చేసి జైలుకు వెళ్ళాడు. ఆ తర్వాత నా చెల్లెలు ఆ అవమానాన్ని భరించలేక దిగులుపడి క్రుశించిపోయి చివరకు ప్రాణాలు వదిలింది. అప్పుడే ఆ నీచుణ్ని చంపాలనుకున్నాను....

అందుకే వాడు జైలునించి రాగానే అవకాశం కోసం వెంటాడాను. వెంటాడుతూనే ఇక్కడికి వచ్చాను. వాడికీ మరో మనిషికీ ఘర్షణ జరగటం చూశాను. అదే అవకాశమనుకున్నాను. అందుకే రాత్రి పదకొండు గంటలకు మళ్ళీ జీవన్‌ని నీడలా వెంటాడాను. సుజాత గది ముందుకు రాగానే చటుక్కున కత్తితో గుండెల్లో పొడిచి అక్కడినించి పోయాను.

నేరాన్ని యెవ్వరూ చూడలేదనుకున్నాను. కాని నా దురదృష్టం, ఎవరో చూశారు. ఐనా దొరికిపోయినందుకు నాకు బాధగా లేదు. ఎందుకంటే ఆ నీచుడ్ని చంపినందుకు నా చెల్లెలి ఆత్మ శాంతిస్తుంది. నా లక్ష్యం అదొక్కటే!"

ముగించాడు మనోహర్.

—:అయిపోయింది:—

# సుజాత కథ

## మిస్. కె. మధుబాల

లేడీస్ క్లబ్ టెన్నిస్ కోర్టులో టెన్నిస్ ఆడి, అలసి పోయి, సుజాత కుర్చీలో కూర్చుంది. వంటినిండా చమట కారోంది. ఆమె స్వెట్టర్ ధరించింది. పక్క కుర్చీల్లో రమా, శ్రీప్రియ, పద్మ కూర్చుని వున్నారు. యింకా ఆట సాగుతోంది.

"ఏమిటి నీ ప్రోగ్రామ్?" అడిగింది పద్మ సుజాతవైపు చూస్తూ.

"కాస్సేపు విశ్రాంతి తీసుకొని యింటికి పోవడం" అంది సుజాత.

"అలా బీచ్ కి వెళ్తే బాగుంటుంది" అంది శ్రీప్రియ.

"నాన్ సెన్స్, చలికాలంలో బీచ్ యేమిటి?" అంది రమా.

"కారులో వెళ్తే హాయిగా వుంటుంది" అంది శ్రీప్రియ.

"ఇవాళ వెళ్ళ్యంలే. నాన్న ఒక అమెరికన్ కి పార్టీ

యిస్తున్నాడు. నేను హోస్టెస్‌గా యింట్లో వుండాలి"
అంది సుజాత.

"ఆల్వేస్ బిజీ బీయింగ్" అంది శ్రీప్రియ.

అప్పుడే మేరీ వచ్చి సుజాత పక్క కుర్చీలో కూర్చుంది.

"నాకొక డౌట్! సుజాత కారు డ్రయివర్ నిజంగా డ్రయివరేనా?" అడిగింది మేరీ.

"డ్రయివర్ కాక మరేవరు అనుకుంటున్నావు?" అంది రమా.

సుజాత నవ్వింది.

"మా డ్రయివర్ గోపీ, మేరీని బాగా ఆకర్షించి ఉంటాడు" అంది నవ్వుతూ.

"ఐ లైక్ హిమ్" అంది మేరీ నిర్మొహమాటంగా.

"గోపీ వస్తాదులా ఉంటాడు. సుజాతకు బోడీగార్డు!" అంది శ్రీప్రియా.

"సుజాత బోడీకిగార్డా, గండమా?" అడిగింది పద్మ.

అందరూ నవ్వారు.

"వాడు నాకు గార్డూకాదు, గండమూ కాదు! నాన్న నెలకు ఐదువందలు యిస్తున్నాడు. అందుకోసం వాడు పనిచేస్తున్నాడు" అంది సుజాత.

సుజాత కుర్చీలోంచి లేచి తన కారువైపు నడిచింది. స్నేహితురాళ్ళందరూ ఆమెతో వెళ్ళారు. డ్రయివర్ గోపీ వెనుక తలుపు తెర్చి పట్టుకున్నాడు.

సుజాత సీటుమీద కూర్చోబోతూ డ్రయివర్ గోపీ మీద పడింది. ఆమెను పట్టుకొని అతడు సీటుమీద కూర్చోబెట్టాడు.

"నన్ను డ్రాప్ చేస్తావా?" అంది మేరీ.

"గెటిన్" అంది సుజాత.

"నేనుకూడా తోవలో దిగిపోతాను" అది శ్రీప్రియ.

"నేనుకూడా" అంది రమా.

"నేనూ వస్తాను" అంది పద్మ.

శ్రీప్రియ, రమా, పద్మా వెనుక సీటుమీద కూర్చున్నారు. మేరీ ముందు కూర్చుంది, డ్రయివర్ పక్కనే!

గోపీ కారును పోనిచ్చాడు. తగ్గు స్వరంలో వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. ఒకచోట మేరీ దిగింది. ఆమె సుజాతకు థాంక్స్ చెప్పి, డ్రయివర్ వైపు చూసింది.

"థాంక్స్ మిష్టర్ గోపీ!" అందామె.

"అతడికి థాంక్స్ చెప్ప నక్కరలేదు. డ్రయివర్ గో ఆన్" అంది సుజాత.

గోపీ కారును పోనిచ్చాడు.

"మేరీ యూస్ మాడ్!" అంది శ్రీప్రియ.

"ఆమె యింకా యెక్కువగా జీవితం చూడలేదు. డోంట్ బాదర్" అంది సుజాత.

మరోచోట శ్రీప్రియ, పద్మ, రమా దిగారు. కారు కదిలింది.

"మిస్ ఎక్కడికి కెళ్లాలి?" అడిగాడు గోపీ.

"ఇంటికి" అంది సుజాత.

గోపీ కారును పోనిచ్చాడు. ఆమె గోపీని గురించి ఆలోచించసాగింది.

ఆరు నెలలనుంచి అతడు డ్రయివర్ గా పనిచేస్తున్నాడు ఎక్కువగా మాట్లాడడు. చెప్పింది వినయంగా చేస్తాడు. మనిషి యెప్పుడూ నీట్ గా వుంటాడు. మేరీ అన్నట్లు అతడిలో ఏదో ఆకర్షణ వుంది.

కారు యింటివైపు వేగంగా వెళ్తోంది. చీకటి పడింది.

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి.

"డ్రయివర్!" అందామె.

"చెప్పండి" అన్నాడతను.

"బీచ్‌కి పద!" అందామె.

అతడు కారును ఆపాడు. వెనక్కు తిప్పి బీచ్‌వైపు పోనిచ్చాడు. పదినిమిషాల్లో కారు బీచ్‌కి చేరుకుంది. బీచ్ లోపల రోడ్డుమీద అతడు కారును ఆపాడు. కిందకు దిగి దూరంగా నుంచున్నాడు.

ఒంటరిగా ఆమె కారులో కూర్చుంది. కాస్సేపయ్యాక ఆమె కిందకు దిగింది.

"సముద్రం దాకా వెళ్దాం రా! ఒక్కత్తినే వెళ్ళడం నాకు భయం" అందామె.

"అలాగే మిస్" అని అతడు ఆమె వెనకనే అడుగులు వేశాడు.

కెరటాలు హోరుమంటూ ముందుకొస్తున్నాయి. ఆమె కాళ్ళు కడుక్కొంటోంది. అతడు వెనక నిలబడ్డాడు. పెద్ద కెరటం ముందుకొచ్చింది. అది కొట్టడంవలన ఆమె వెనక్కు పడబోయింది.

వెనుకనున్న గోపీ ఆమెను తన చేతులతో పట్టుకున్నాడు. నురగలు కక్కుతూ కెరటం వెనక్కు పోయింది. ఆమె యింకా అతడి చేతుల్లోనే వుంది. ఆమె తీయగా నవ్వింది. అతడిని కౌగలించుకుంది.

అతడు పైకి చూశాడు. పూర్ణచంద్రుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. అతడు నలువైపులా చూశాడు. యెవ్వరూ సమీపంలో లేరు. చలిలో అతడి ఒళ్ళు వేడెక్కింది. అతడామె ఎర్రటి పెదిమలవంక చూశాడు. ఆమె వక్షోజాలు ఎత్తుగా అగుపిస్తున్నాయి.

వుద్రేకంతో అతడామెను కౌగలించుకొని ఆమె ఎర్రటి పెదిమలను బలంగా ముద్దెట్టుకొన్నాడు. ఆమె చేతులతో అతడిని చుట్టేసింది. ఇద్దరూ తడి నేలమీద పడ్డారు. అతడామెను పదేపదే ముద్దెట్టుకొన్నాడు.

అమాంతంగా ఆమె లేచింది.

"డ్రయివర్. ఏమిటి నువ్వు చేసేది?" అరిచిందామె.

అతడిలో వేడి రగుల్కొంది. అతడామెను వదల్లేదు. ఆమె మీదపడి, నొక్కేస్తూ ఆమెను ముద్దాడుతున్నాడు.

ఆమె అతడిని తోసేసింది. వేగంగా కారువైపు నడిచింది. వెనకనే అతడు వెళ్ళాడు. స్టీరింగ్ వీల్ వెనక అతడు కూర్చున్నాడు. వెనక్కు తిరిగి ఆమె వైపు చూశాడు.

"మిస్ సుజాతా, నేను బి.ఏ. పాసయ్యాను. ఎక్కడా ఉద్యోగం దొరక్క మీ దగ్గర డ్రయివర్ గా చేరాను. ఐ లవ్ యు!" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. అతడు అలాగే కూర్చుని వున్నాడు.

"డ్రయివర్, కారు ఏ యింటికి పోనీ!" అందామె.

కారు స్టార్ట్ అయింది. కదిలింది. వేగంగా కారును అతడు ఆమె యింటికి పోనిచ్చాడు.

## 2

తండ్రి హరిప్రసాద్ ఆమె రాకకోసం యెదురు చూస్తున్నాడు.

పోర్టికోలో ఆగిన కారులోంచి ఆమె దిగింది. ఆమె ఏడుస్తూ హాల్లోకి పరుగెత్తింది. వెనకనే వెళ్ళాడు తండ్రి.

సోఫాలో కూర్చుని ఆమె ఏడుస్తోంది. పక్కనే కూర్చుని ఆమెమీద అతడు చెయ్యివేశాడు.

"ఏమిటమ్మా, ఏమైంది?"

"డ్రయివర్ గాడు నన్ను ముద్దెట్టుకొన్నాడు. బలంగా కౌగలించుకొన్నాడు" అందామె.

"వాడి తోలు వల్చేస్తాను!" అని తండ్రి బయటకు పరుగెత్తాడు.

ముందు వరండాలో గోడ మేకుకు వేళ్ళాడుతున్న కమ్చీని అతడు తీసుకొన్నాడు.

డ్రయివర్ని పిల్చాడు. గోపీ అతడి ముందుకు వచ్చాడు. యజమాని కోపాన్ని, చేతిలో వున్న కమ్చీని చూసి అతడు త్రుళ్ళిపడ్డాడు.

"డాంగ్ రాస్కల్, నా పిల్లను కౌగలించుకొని ముద్దెట్టుకొంటావా? ఎన్ని గుండెలురా నీకు!" అని కమ్చీతో అతడిని నాలుగుసార్లు ఛల్ ఛల్న కొట్టాడు.

డ్రయివర్ గోపీ బాధతో వెనక్కు కదిలాడు. అర డజన్ మంది నౌఖర్లు అక్కడ గుమిగూడారు.

అందరూ భయంతో యజమానివైపు చూస్తున్నారు.

తనవైపు వచ్చిన కమ్చీ కొనలను గోపీ పట్టుకొన్నాడు.

"పొమ్మంటే పోతాను. నన్ను కొడితే వూరుకోను!" అరిచాడతను.

"తిండిలేని ముష్టి వెధవా, నువ్వేం చేయగలవు?" అరిచాడు హరిప్రసాద్.

వరండాలో నిలబడి సుజాత అంతా వింతగా చూస్తోంది. ఇదంతా ఆమెకు తమాషాగా కనిపిస్తోంది.

"తిండి లేకపోవచ్చు, కాని మానమర్యాదలు నాకు లేకుండా పోలేదు" అన్నాడు డ్రయివర్.

హరిప్రసాద్ తలిమ్మ నౌఖర్లవైపు చూశాడు.

"గోపీని చావగొట్టండి! తర్వాత మీరు నన్ను కల్సు కొంటే బహుమతి యిస్తాను" అన్నా డతను.

అందరు నాఖుర్లూ గోపీవైపు కదిలారు.

"ఆగండి!" అర్చాడు గోపీ.

వాళ్ళు ఆగారు.

"మీరు నాలాంటి నాఖుర్లే. అతడికి బానిసలై, డబ్బు కోసం కక్కుర్తిపడి నన్ను కొట్టకండి! నన్ను కొట్టడం మిమ్మల్ని మీరు కొట్టుకున్నట్టే! నేను చేసిన తప్పేమిటో చెప్పితే తగిన శిక్షను నేను అనుభవిస్తాను" అన్నాడు గోపీ.

"వాడికి బాగా కొమ్ములొచ్చాయి! ఇక్కడికి కొచ్చి నపుడు చిరిగిన గుడ్డల్తో, చింపిరి జుత్తుతో వున్నాడు. నేను పెట్టిన తిండి తిని పోతులా బలిశాడు. వేషం మారింది. వీడు ఏం చేశాడో నా కూతుర్ని అడగండి!"

నాఖుర్లు సుజాతవైపు చూశారు. ఆమె యేడవడం ప్రారంభించింది.

"దొంగనాకొడుకు యేదో చేసుంటాడు. లేకపోతే నా తల్లి యేడుస్తుందా?" అన్నాడు పుల్లయ్య.

"చెప్పలేక ఆమె ఏడుస్తోంది" అన్నాడు నల్లయ్య.

అందరూ గోపీమీదపడి కొట్టసాగారు. గోపీ మాటలను ఎవ్వరూ వినలేదు. రక్తం మడుగులో గోపీ నేలమీద పడున్నాడు.

"చచ్చాడు! ఇప్పుడేం చెయ్యాలి?" అడిగాడు పుల్లయ్య.

"సముద్రం వొడ్డున పారేసిరండి! యే గూండాలో వాడిని చంపారని పోలీసులు అనుకుంటారు" హరి ప్రసాద్ సలహా యిచ్చాడు.

జేబులోంచి మూడువేలుతీసి అతడు వాళ్ళకిచ్చాడు.

"ఈ డబ్బు పంచుకోండి! కారులో తీసుకుపోయి పారేసిరండి" అన్నాడు హరిప్రసాద్.

గోపీని వాళ్ళు కారులో సీటుమీద పడేశారు. అందరూ కారులో కూర్చున్నారు. పిచ్చయ్య కారును బీచ్ వైపు పోనిచ్చాడు.

## 3

ఆరుగురు నౌఖర్లూ అతడిముందు చేతులు కట్టుకొని నిలబడ్డారు.

"పోలీసులు ఒకవేళ యిక్కడికొస్తే మీరు నోరు విప్పకండి. వాళ్ళ గొడవ నేను చూసుకొంటాను" అన్నాడు హరిప్రసాద్.

"అలాగే, సార్" అన్నారు వాళ్ళు.

"జరిగిన దాన్ని గురించి ఎక్కడా మాట్లాడకండి. మాట్లాడితే మీరే యిరుక్కుంటారు" అని అతడు హెచ్చరించాడు.

ఆనాటి సాయంత్రం స్నేహితురాళ్ళతో సుజాత బీచ్‌కి వెళ్ళింది. అందరూ కొత్త డ్రయివర్ వైపు ఆశ్చర్యంగా చూశారు.

"ఆ డ్రయివర్ ఏమయ్యాడు?" అడిగింది మేరీ.

"డోంట్ ఆస్క్ నా!" అంది సుజాత.

అందరూ యిసుకలో కూర్చున్నారు. ఇంకా చీకటి పడలేదు. దూరంలో వుంది సుజాత కారు. డ్రయివర్ కూనయ్య కారు పక్కనే కూర్చుని వున్నాడు.

హరిప్రసాద్ సేవలో కూనయ్య వెంట్రుకలు తెల్లబడి పోయాయి. అతడి వయస్సు 60 దాటింది.

సుజాత అందరివైపూ నవ్వుతూ చూసింది.

"నిన్న ఏం జరిగిందో తెలుసా?"

"ఏం జరిగింది?" అడిగింది శ్రీప్రియ.

"మీరు దిగాక నేను కారులో బీచ్ కి వెళ్లాను...."

"బీచ్ కి వెళ్ళానన్నావు!" అంది శ్రీప్రియ.

"అనుకోకుండా వెళ్ళాను" అంది సుజాత.

"డ్రయివర్ గోపీ యేమయ్యాడు?" అడిగింది మేరీ.

"నాన్న వాడిని పొమ్మన్నాడు."

"ఎందుకో!" అంది పద్మ.

"వాడి చూపు ఎప్పుడూ నామీదే వుంటోంది. ఇరవై యేళ్ళ కుర్రాడు అలా నావైపు చూడ్డం నాకు నచ్చలేదు. నాన్నతో చెప్పాను."

మేరీ పకపక నవ్వింది.

"నీ అందాన్ని చూసి ఆనందించే హక్కు కూడా మొగాడికుండ కూడదా? రోడ్డుమీద అందమైన స్త్రీలు నడిచిపోతూంటే ఎందరో చూసి ఆనందిస్తారు. దానిలో తప్పేముంది?" అడిగింది మేరీ.

"అతడి చూపుల్లో ఆకలి మండుతూ అగుపిస్తుంది. అటువంటి వాడు నన్ను ఏమైనా చేస్తాడు" అంది సుజాత.

"నువ్వు అవకాశమిస్తేగాని యే నౌఖరూ హద్దుమీరి వెళ్ళడు" అంది మేరీ.

"నీకు నౌఖర్లతో అనుభవం తక్కువ. మీ ఇంట్లో నౌఖర్లు లేరుగా!" అంది పద్మ.

"నేను సుజాతలా కోటీశ్వరుడి కూతుర్ని కాను. పద్మా, నువ్వూ నాలాంటి దానివే" అంది మేరీ.

"పోనిద్దురూ, గోపీని గురించి మనం కొట్టుకు చావడ

మెందుకు?" అంది రమ.

"నిన్న బీచ్‌లో యేదేనా జరిగిందా?" అడిగింది మేరీ.

"పెద్ద కెరటం నన్ను కొట్టింది. నేను వెనక్కి పడ్డాను. గోపీ నన్ను గట్టిగా పట్టుకొన్నాడు" అంది సుజాత.

"కారు ప్రక్కన వుండవలసిన గోపి నీ వెనుక సముద్రపు ఒడ్డున ఎందుకున్నాడు?" అడిగింది మేరీ.

"వాడు నా వెనుక నే వచ్చాడు" అంది సుజాత.

"నువ్వు అతడిని రమ్మన్నావా?" మేరీ ప్రశ్నించింది.

"పబ్లిక్ ప్రాసిక్యూటర్లా అడుగుతుంది మేరీ" అంది శ్రీప్రియ.

"నే నెందుకు రమ్మంటాను? వస్తేరా అన్నాను" అంది సుజాత.

"అలా అనడం వలన అతడు వచ్చుంటాడు. నువ్వు కిందపడకుండా పట్టుకున్నాడు. అందులో తప్పేముంది?" అడిగింది మేరీ.

"నన్ను ముద్దెట్టుకోడం తప్పు కాదా?"
సుజాత ఆలోచించకుండా అడిగింది.

"కథ అంతవరకూ వెళ్ళిందా?" అంది శ్రీప్రియ.

"ఇద్దరం కిందపడ్డాం, తడి యిసుకమీద. అతడి కౌగిట్లో నేనున్నాను. ఎన్నిసార్లో అతడు నన్ను ముద్దెట్టుకున్నాడు" అంది సుజాత.

"అంత చేసినా నువ్వు వూరుకున్నావు. నీ మౌనాన్ని అంగీకారంగా భావించాడతను" అంది మేరీ.

"నేను వూరుకోలేదు. లేచాను. ఏమిటి చేస్తున్నావని అడిగాను. నన్ను వాడు ప్రేమిస్తున్నాడట. వాడు బి.ఎ.

పాసయ్యాడట. ఎక్కడా వుద్యోగం దొరక్క మా దగ్గర డ్రయివర్ గా చేరాడట!"

"పూర్ లవర్! ఇప్పుడు అతడి జీవితం మళ్లా స్క్వేర్ A లో పడింది. మునుపటిలాగే ఉద్యోగం లేదు" అంది మేరీ.

"దానికి నేనేం చెయ్యగలను? తప్పుచేస్తే మా నాన్న వూరుకోడు. తన్ని తగలేస్తాడు" అంది సుజాత.

"పాపం, అతడిని మీ నాన్న కొట్టాడా?" అడిగింది మేరీ.

"జరిగింది యెవ్వరికీ చెప్పకు!" అని తండ్రి హెచ్చరించడం ఆమెకు జ్ఞాపకమొచ్చింది.

"కొట్టలేదులే. జీతం సెటిల్ చేసి వెళ్ళిపొమ్మన్నాడు."

మేరీ ఆమెవైపు సూటిగా చూసింది.

"సుజాతా, నువ్వు అతడిని ప్రోత్సహించావు. అతడు ఏం చేసినా వూరుకొని అమాంతంగా అతడికి యెదురు తిరిగావు. నేనే జడ్జినైతే నిన్ను కూడా శిక్షించేదాన్ని" అంది మేరీ.

"చీకటి పడింది. పోదాం పదండి" అంది పద్మ.

అందరూ లేచారు. కారు దగ్గరకు నడిచారు. డ్రయివర్ కూనయ్య యిసుకలో నిద్రపోతున్నాడు. సముద్రపు హోరులా వినిపిస్తోంది అతడి గుర్రు.

రమ అతడిని తట్టిలేపింది. అతడు లేచి కూర్చున్నాడు. వాళ్ళవైపు చూశాడు.

"నిద్ర మత్తు పోయిందా?" అడిగింది సుజాత.

"రాత్రి నిద్రలేదమ్మా. నా ఆఖరి కూతుర్కి జ్వరం తగిలింది."

"పద, పోదాం" అంది సుజాత.

అందరూ కారులో కూర్చున్నారు, మేరీ తప్ప. ఆమె బయట నిలబడే వుంది.

"నేను యింటికి నడిచిపోతాను. మీరు వెళ్ళండి" అంది మేరీ.

"డ్రయివర్ గోపీ లేడనా?" అడిగింది శ్రీప్రియ.

"కావాలంటే అలా అనుకోవచ్చు" అంది మేరీ.

"మేరీ కమ్యూనిస్టు, డ్రయివర్లన్నా, కండక్టర్లన్నా అభిమానం యెక్కువ" అంది శ్రీప్రియ.

"కొంపదీసి యీ ముసలి డ్రయివర్ని ప్రేమిస్తావా?" అడిగింది పద్మ.

పద్మవైపు మేరీ సూటిగా చూసింది.

"కూతురులా అతడిని ప్రేమించడంలో తప్పులేదు" అంది మేరీ.

"మీ మాటల్తో నాకు పిచ్చెక్కుతోంది. డ్రయివర్, పద!" అంది సుజాత.

కూనయ్య కారును పోనిచ్చాడు. మేరీ మెయిన్ రోడ్డు మీదకు నడిచింది.

## 4

జిమ్‌ఖానా క్లబ్ కాంపౌండులో ఎన్నో కార్లు ఆగి వున్నాయి. గేటు దగ్గర వాచ్‌మన్ పచార్లు చేస్తు న్నాడు. కార్లలో లోపలకు వెళ్ళేవారికీ, బయటకు పోయేవారికీ వాచ్‌మన్ సలామ్ చేస్తున్నాడు.

గోవింద్ మెహతా బాగా స్కాచ్ విస్కీ సేవించి కారులో కూర్చుని తలుపు మూశాడు. కారును స్టార్టు చేసి బయటకు పోనిచ్చాడు.

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. జనసంచారం లేని అడమ్స్ రోడ్డమ్మట కారు పోతోంది.

ఏదో కత్తి కొన అతడి మెడమీద మెల్లిగా అదిమి నట్లనిపించింది.

“రాస్కెల్, ఏదేనా చేస్తే యిది నీ మెడలో దిగి పోతుంది. నీ దగ్గరున్న డబ్బంతా నాకిచ్చేయి!” అందో భయంకర కంఠం.

మెహతా ఒక బాగ్ను వెనక్కి అందించాడు. ఎవరో బాగ్ను తీసుకున్నారు.

“అందులో యాభై వేలుపైన వుంటుంది” అన్నాడు మెహతా.

“నీ వాచ్, పార్కర్ పెన్ను, మెళ్ళోని గొలుసు యిచ్చేయి.”

మెహతా కారును ఆపి అన్నీ తీసియిచ్చేశాడు.

“కారును పోనీ! ఎక్కడ ఆపాలో నేను చెప్తాను” అందా కంఠం వెనకనుంచి.

మెహతా కారును పోనిచ్చాడు. ఒక ఆటో పక్కనే కారు ఆగింది.

“నా గురించి రిపోర్టు చేస్తే నీ యింటికొచ్చి నిన్ను చంపుతాను!” అని ఒకతను కిందకు దిగాడు. అతడివైపు మెహతా పరీక్షగా చూశాడు.

“పో!” అరిచాడతను.

మెహతా కారును పోనిచ్చాడు. ఆటోలో కూర్చుని ఆ వ్యక్తి మరోవైపుకు మాయమయ్యాడు.

ఆ వ్యక్తి మూడు ఆటోలు మారి, ఒకచోట దిగాడు. తోవలో వైన్ షాపుంది. ఒక విస్కీ బాటిల్ కొన్నాడు. పక్క హోటల్లో బ్రెడ్, కేక్స్, చిప్స్ కొన్నాడు. కొంతదూరం నడిచి అతడు ఒక యింట్లోకి ప్రవేశించాడు.

తాళంతీసి లోపలకు వెళ్ళి తలుపు మూశాడు. చిన్న

హోలు. అతడు పడగ్గదిలోకి చేరుకున్నాడు.

సోఫాలో కూర్చుని టైమ్ చూశాడు. పదకొండున్నర కావస్తోంది.

విస్కీ తాగుతూ అతడు బ్రెడ్ స్లయిసెస్, చిప్స్ తింటున్నాడు. అతడికి బాగా ఆకలిగా వుంది.

ఆలోచిస్తూ అతడు విస్కీ సేవిస్తున్నాడు. వారం రోజులపాటు అతడు గోవింద్ మెహతాను గమనిస్తూ వచ్చాడు. లైసెన్సులేని బుకీగా గుర్రప్పందాలకు అనేకమందినుంచి బెట్లు స్వీకరించి, గుర్రాలు గెల్తే మెహతా వాళ్ళకు డబ్బిస్తూ వుంటాడు. ఓడిపోయిన గుర్రాలమీద పందాలు కట్టినవాళ్ళు యిచ్చిన డబ్బంతా అతడిదే.

ఇల్లీగల్ బుకీగా మెహతా లక్షలు గడించాడు. ఇద్దరు భార్యలను యింట్లో వుంచుకొని హాయిగా జీవితం సాగిస్తున్నాడు.

గ్లాసులోని విస్కీని తాగేసి అతడు తనకు మెహతా యిచ్చిన బాగ్‌ను తెర్చాడు. నోట్లను లెక్కపెట్టాడు. యాభై ఆరు వేలుంది.

అతను లక్షలుంటాయని వూహించాడు. కాని అంతగా బాగ్‌లో లేదు!

సిటిజన్ వాచ్, పార్కర్ పెన్ను, బంగారం గొలుసు—వీటిని తను వీలైనంత త్వరగా అమ్మేయాలి!

గ్లాసులో అతడు మళ్ళా విస్కీ పోసుకున్నాడు. కొద్దిగా నీళ్ళు కలిపాడు. సగంపైన గడగడ తాగేశాడు. ఒళ్ళు వేడెక్కింది. వుషారుగా వుంది.

ఎవరో తలుపును తట్టారు. అతడు వులిక్కిపడ్డాడు. పాంటుజేబులో వున్న కత్తిని తడిమిచూశాడు. ధైర్యంగా

వెళ్ళి తలుపు తెరిచాడు.

ఎదురుగా నిలబడివున్నాడు పక్కింటి పరంధామయ్య. రిటైరు పోస్టుమాస్టర్!

"మీరా?" అన్నాడతను.

"ధర్మరాజుగారూ, ఆలస్యంగా మిమ్మల్ని లేపినందుకు నన్ను క్షమించండి! నా మనవడి ఒళ్ళు జ్వరంతో వేడిగా వుంది. మీ దగ్గర థర్మామీటర్ వుందా?"

అతడు లోపలకు వెళ్ళాడు. థర్మామీటర్ తెచ్చి అతడికిచ్చాడు.

"జ్వరం తగ్గినదాకా మీ దగ్గర వుంచుకొని తర్వాత యివ్వండి" అన్నాడతను.

"ధర్మరాజుగారూ, చాలా థాంక్స్" అని అతడు వెళ్ళిపోయాడు.

అతడు తలుపు మూశాడు. గడియలన్నీ బిగించాడు. వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు.

ఇరుగు పొరుగు వాళ్ళకు తను ధర్మరాజు! యెంతో ప్రేమతో వాళ్ళు తనని చూస్తారు!

అతడు తనలో తను నవ్వుకున్నాడు. గోవింద్ మెహతా తన గురించి పోలీసు రిపోర్టు యిస్తాడా? యివ్వడు. అతడు తనలాగే మరోరకమైన దొంగ!

గ్లాసులోని విస్కీని తాగేసి అతడు మళ్ళా పోసుకున్నాడు. బాటిల్ వంక చూశాడు. సగంపైన విస్కీ అయిపోయింది. తనలా తాగుతూ వుంటే బాటిల్ తొందరగా ఖాళీ అవుతుంది.

అతడు ఆలోచిస్తున్నాడు. అంత నిషాలో అతడి మెదడు యింకా ఆలోచించగలుగుతోంది. గదిలోని వస్తువులు లీలగా అతడికి కనిపిస్తున్నాయి.

అద్దం ముందు అతడు నిలబడ్డాడు. పక్కకు పడబోయి తూలి ఆపుకున్నాడు. ఎన్ని మచ్చలున్నా అతడి మొహం యింకా బాగానే వుంది.

తను ప్లాస్టిక్ సర్జన్ పరంజ్యోతిని కల్సుకోవాలి. అతడు తన రూపాన్ని మార్చగలడేమో కనుక్కోవాలి!

బయట వాన కురుస్తోంది. అతడు కిటికీద్వారా బయటకు చూశాడు. పక్క యింట్లోనివాళ్ళు నిద్రపోతున్నారు.

ఎవ్వరూ తనలా మేల్కొని వుండరేమో! గ్లాసులోని విస్కీని అతడు తాగేశాడు. సోఫాలో పడిపోయాడు. నిద్ర ముంచుకొచ్చేసింది.

## 5

జైపాల్ రెడ్డి వెనుక సీటు మీద వెనక్కువాలి కూర్చుని, సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ స్వేచ్ఛగా ఊపిరి పీల్చాడు.

తన భార్య పంజరంలోంచి తను బయటపడ్డాడు. వారం రోజులు బెంగుళూరులో హాయిగా రేవతితో కాలం గడపొచ్చు!

ట్రంక్ రోడ్డుమ్మట కారు వెళ్తోంది. యూనిఫామ్డ్ డ్రయివర్ కారును పోనిస్తున్నాడు.

“రహీమ్, రోడ్డువారగా కారాపు! కొంచెం పనుంది” అన్నాడు జైపాల్ రెడ్డి.

కారు స్పీడు తగ్గింది. జైపాల్ రెడ్డి ఆలోచిస్తున్నాడు. తన లెదర్ బాగ్ లో యాభై లక్షలు బ్లాక్ మనీ వుంది. ఇది తను రేవతికి యివ్వాలి! అటుపైన జీవితాంతం ఆమె తనదై వుంటుంది!

చింత చెట్టుకింద కారు ఆగింది. జైపాల్ రెడ్డి కిందకు

దిగాడు. డ్రయివర్ వైపు చూశాడు.

అతడు ఉలిక్కిపడ్డాడు.

"నువ్వు రహీమ్ కాదు. ఎవరు నువ్వు?" అడిగాడు జై పాల్ రెడ్డి.

"నేను రహీమ్ తమ్ముడిని, సార్. అతడికి జ్వరం. అందుకని కంపెనీకి సెలవుపెట్టి నేను వచ్చాను" అన్నాడతను.

"అది మొదట చెప్పలేదే!"

"నేను చెప్పేలోపలే మీరు గుర్తించారు" అన్నాడతను నవ్వుతూ.

"నీ పేరు?"

"నజీర్" అన్నాడతను.

జై పాల్ రెడ్డి దూరంగా వెళ్ళిపోయాడు. డ్రయివర్ కారును స్టార్టుచేసి వెనక్కి తిప్పి వేగంగా పోనిచ్చాడు.

జై పాల్ రెడ్డి ఉలిక్కిపడుతూ లేచాడు.

"నజీర్, ఎక్కడికి పోతున్నావు?" అర్చాడు.

డ్రయివర్ జవాబివ్వలేదు. కారు దూరంలో మాయమయ్యింది. జై పాల్ రెడ్డి బస్సులో మద్రాసు చేరుకున్నాడు.

"ఏమిటి తిరిగొచ్చేశారు?" అందతని భార్య.

"డ్రయివర్ నన్ను మోసంచేశాడు, రహీమ్‌కి బదులు వాడి తమ్ముడు వచ్చాడు. వాడు నన్ను ట్రంక్ రోడ్డుమీద వదిలేసి వెళ్ళిపోయాడు కారులో" అన్నాడతను.

"వాడు రహీమ్ తమ్ముడు కాదేమో!" అందామె.

ఆమె చెప్పిందివిని అతడు తృళ్ళిపడ్డాడు. ఆ ఆలోచన అతడికింతవరకూ తట్టలేదు. అయినా తను వెళ్ళి కనుక్కోవాలి!

సులో కారులో జై పాల్ రెడ్డి రహీమ్ ఇంటికి వెళ్లాడు. కారు హారన్ని రెండుసార్లు నొక్కాడు. రహీమ్ పరుగెత్తు కొచ్చాడు.

"మీరా, సార్?" అన్నాడు రహీమ్.

"ఇవాళ ఎందుకు డ్యూటీకి రాలేదు?" అడిగాడు రెడ్డి.

"ఇవాళ రావద్దని మీరు కబురు పంపారుగా?" అన్నాడు రహీమ్.

"ఎవరు చెప్పారలా?"

"మీ నౌఖరు దేవదాస్, సార్."

"దేవదాస్ అనే నౌఖరు మా యింట్లో లేడు."

రహీమ్ మాట్లాడలేదు. అతడివైపు సూటిగా చూశాడు రెడ్డి.

"నీ తమ్ముడు నజీర్ ఎక్కడుంటాడు?"

"నాకు తమ్ముడు లేడు సార్. ఇద్దరు అన్నయ్యలు వున్నారు" అన్నాడు రహీమ్.

జరిగినదంతా జై పాల్ రెడ్డి తన డ్రయివర్ తో చెప్పాడు. అతడు ఆశ్చర్యంతో విన్నాడు.

"వాడెవడో పెద్ద మోసగాడు సార్!" అన్నాడతను.

"ఇక్కడికొచ్చినతను ఎలా వుంటాడు?"

రహీమ్ వర్ణించాడు. అదే వ్యక్తి తన కారును నడిపాడు. సందేహంలేదు. అంతా అతడు ప్లాన్ ప్రకారం చేశాడు.

జై పాల్ రెడ్డి కారును వెనక్కు తిప్పి పోనిచ్చాడు. యాభై లక్షలు బ్లాక్ మనీ గాలిలో ఎగిరిపోయింది! రేవతి తన జీవితంలో దగ్గరవదు!

ఏడుస్తూ రెడ్డి కారును తన యింటికి పోనిచ్చాడు. భార్య అతడివైపు వేగంగా వచ్చింది.

"నేను చెప్పింది నిజమేనా?" అడిగిందామె.

"అక్షరాలా నిజమే. రహీమ్ యింట్లోనే వున్నాడు. అతడికి తమ్ముడు లేడు" అన్నాడతను.

"రహీమ్ ఎందుకు రాలేదు?"

"నా కారు నడిపిన మోసగాడు అతడిని నేను రావద్దన్నానని చెప్పాడట!"

"ఎంత మోసం?" అందామె.

# 6

కారును కపాలీ టాంక్ పక్కనే వదిలేసి నజీర్ వురఫ్ ధర్మరాజు కిందకు దిగాడు. స్టీరింగ్ వీల్‌నీ, తలుపులనూ రుమాల్తో తుడిచేశాడు. లెదర్ బాగ్ తీసుకొని గబగబా వెళ్ళిపోయాడు.

తెల్లటి యూనిఫామ్‌లో వున్నాడతను. లెదర్ బాగ్ పట్టుకొని కొంతదూరం నడిచాడు.

ఒక బట్టలషాపులోకి వెళ్లాడతను. ఒక పంచ, టీషర్టు కొన్నాడతను. సమీపంలో వున్న గణపతి లాడ్జిలో కెళ్ళాడతను. గది అద్దెకు తీసుకుని లోపలకు వెళ్లాడు. తలుపు మూసి తను ధరించిన యూనిఫామ్‌ను విప్పేశాడు. కొత్త పంచ టీషర్టు ధరించాడు.

కాస్సేపు పక్కలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆలోచించసాగాడు.

జైపాల్ రెడ్డి వెంటనే మద్రాసు చేరుకోలేడు. యే బస్సులోనో అతడు రావాలి! అతడు మద్రాసు రాగానే రహీమ్ యింటికి వెళ్తాడు! నిజం తెల్సుకుంటాడు. కాని అతడు ఏం చేయగలడు?

జై పాల్ పేరు పొందిన బిల్డింగ్ కంట్రాక్టరు. ఎంతో బ్లాక్ మనీ అతడి దగ్గర వుంది. ఆ దం తా ముందే కనుక్కొని తన ప్లాన్ ప్రకారం అతడు విజయాన్ని సాధించాడు.

అతను గదిలోంచి బయటకు నడిచాడు. యూనిఫామ్ లెదర్ బాగ్ లో వుంది. బయటకు వెళ్ళాడతను. గది తాళంచెవిని లాడ్జి గుమస్తాకు యిచ్చేశాడు.

"నేను వెళ్ళిపోతున్నాను, మళ్ళా రాను" అన్నాడతను.

"ఆల్ రైట్, సార్" అన్నాడు గుమస్తా.

రోడ్డు వారగా ఆటో వుంది. అతడు దానిలో ఎక్కి కూర్చున్నాడు. బీడీ పీలుస్తూ డ్రయివర్ వచ్చాడు.

"ఎక్కడికి?"

"చెప్పాలా?"

"తక్కువ దూరమైతే రాను."

"ఎక్కువ దూరమే."

ఆటో కదిలింది. మౌంట్ రోడ్డు ప్రాంతంలో అతడు ఆటో దిగాడు. బస్టాప్ దగ్గర నిలబడ్డాడు. అక్కడ వందలాది ప్రజలు నిలబడి వున్నారు.

సైరన్ మ్రోగిస్తూ పోలీసు వాన్ పక్కనుంచి వెళ్ళిపోయింది. క్షణకాలం అతడు ఉలిక్కిపడ్డాడు. అప్పుడే వచ్చిన బస్సులో ఎక్కాడతను.

ఇరవై నిమిషాల తర్వాత ఒకచోట దిగాడు. ఫర్లాంగు దూరం నడిచాడు ఒక హోటల్లోకి ప్రవేశించి బాగా టిఫిన్ తిన్నాడు. బిల్లు చెల్లించి బయటకు కదిలాడు.

పేవ్ మెంటమ్మట నడవసాగాడు. వైన్ షాపుముందు అతడు ఆగాడు. శాంసన్ రమ్ బాటిల్ కొని లెదర్

బాగ్‌లో పెట్టుకున్నాడు.

తన యింటివైపు గబగబా నడిచి వెళ్ళిపోయాడతను.

తాళంతీసి లోపలకు వెళ్ళాడు! సైకిల్ బెల్ విని బయటకు చూశాడు. పోస్టుమన్!

పోస్టుమన్ ఒక ఉత్తరాన్ని అతడికిచ్చాడు. అతడు మరో అడ్రెసు రాసి పోస్టుమన్‌కి యిచ్చేశాడు.

"వేదాచలంగారు విజయవాడలో వున్నారు. అక్కడి అడ్రెసు రాశాను. రీడైరక్టు చేయండి" అన్నాడతను.

"మీ పేరు?"

"ధర్మరాజు. నేనీ యింట్లో అద్దెకుంటున్నాను" అన్నాడతను.

పోస్టుమన్ వెళ్ళిపోయాడు. అతడు టైమ్ చూశాడు. తొమ్మిదయింది. అతడు లోపలకు వెళ్ళి తలుపు మూశాడు. పడగ్గదిలోకి నడిచి సోఫాలో చతికిలబడ్డాడు. అలసటతో కాస్సేపు కళ్ళు మూసుకున్నాడు.

కాస్సేపయ్యాక అతడు లెదర్ బాగ్ తెరిచాడు. నోట్లకట్టలను లెక్కపెట్టాడు. యాభైలక్షలుంది. పెద్ద మొత్తం! అతడు సగర్వంగా నోట్లకట్టలవైపు మళ్ళా చూశాడు.

తనుకూడా ధనవంతుడయిపోయాడు! అతడికెంతో ఆనందంగా వుంది. అతడు అమాంతంగా పళ్ళు బిగబట్టాడు. ఎందుకో కోపంగా చూశాడు.

రమ్ బాటిల్ తెరిచి గ్లాసులో రమ్ పోసుకుని, నీళ్ళు కలిపి గడగడ తాగేశాడు.

రమ్ మండుతూ గొంతులోంచి దిగిపోయింది. అతడు మరో సిగరెట్ ముట్టించాడు.

# 7

తన యింట్లోని హాల్లో జై పాల్ రెడ్డి యిటూ అటూ పచార్లు చేస్తున్నాడు. అతడి భార్య సోఫాలో కూర్చుని వుంది.

"కారును ఎవరో దొంగిలించారని పోలీస్ రిపోర్టు యివ్వండి" అంది భార్య.

అతడు రిసీవర్ యెత్తాడు. పోలీసుస్టేషన్ నంబరు తిప్పాడు.

"రాయపేట పోలీస్ స్టేషన్" అందొక కంఠం అటు వైపునుంచి.

"ఇన్‌స్పెక్టర్ రామన్ వున్నారా?"

"వుండండి సార్."

కాస్సేపయ్యాక ఇన్‌స్పెక్టర్ రామన్ కంఠం అటు వైపునుంచి వినబడింది.

"ఇన్‌స్పెక్టర్ రామన్ హియర్!"

"మైడియర్ ఫ్రెండ్, నేను జై పాల్ రెడ్డిని."

"గుడ్ మార్నింగ్, చెప్పండి."

"నా అంబాసిడర్ కారును యెవరో దొంగిలించారు. హోటల్ చోలాకు వెళ్ళి బయటకొచ్చి చూసేసరికి కారు లేదు. టాక్సీలో యింటికొచ్చాను" అని అతడు కారు నంబరు చెప్పాడు.

"ఎప్పుడు పోయింది?"

"ఇవాళ ప్రొద్దుట ఆరు తర్వాత."

"ఆ కారుకోసం మేం వెతుకుతాం. ఏదైనా తెలిస్తే మీకు చెప్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"థాంక్స్, మై ఫ్రెండ్" అని రెడ్డి రిసీవర్ పెట్టేశాడు.

అతడి భార్య సోఫాలోంచి లేచింది.

"ఇన్‌స్పెక్టర్‌కి మీరు నిజం చెప్పలేదు. ఎందుకలా చెప్పారు?" అందామె.

"పెద్ద కంట్రాక్ట్ కోసం నేను బెంగుళూరు బయలుదేరాను. ఆ విషయం పోలీసులకు తెలియడం నాకిష్టం లేదు."

"తెలిస్తే ఏమవుతుంది?"

"నాకంటె ముందు కామత్ బెంగుళూరు వెళ్ళి ఆ కంట్రాక్టును సంపాదిస్తాడు. కామత్‌కీ, నాకూ పోటీగా!"

"ఓ, అదా" అందామె.

"నేను చెప్పేది వింటూ వుండు. నువ్వు పిచ్చి ప్రశ్నలు వేయకు" అన్నాడతను.

అరగంట గడిచిపోయింది.

"మీ లెదర్ బాగ్ కారులోనే వుందా?"

"వుంది."

"అందులో యేదైనా డబ్బుందా?"

"లేదు—కాగితాలు మాత్రం వున్నాయి" అబద్ధమాడేడతను.

తను నడిపే కంపెనీ ఆమె తండ్రిది. మామగారు పోయాక ఆ కంపెనీని తను నడుపుతున్నాడు. తన భార్యతో ఏదేనా చెప్తే ఆమె వెయ్యి ప్రశ్నలు వేస్తుంది. ఏదో జవాబిచ్చిందాకా తనని చంపుకు తింటుంది.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని అందుకున్నాడు.

"జై పాల్ రెడ్డి స్పీకింగ్" అన్నాడతను.

"ఇన్‌స్పెక్టర్ రామన్ హియర్! కపాలీ టాంక్ పక్కన మీ కారు మాకు దొరికింది. వెంటనే అక్కడకు రండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వస్తున్నాను" అన్నాడు రెడ్డి.

ఫియట్ కారును రహీమ్ పోనిస్తున్నాడు. జై పాల్ రెడ్డి వెనక కూర్చున్నాడు.

"మీ యింటికి వచ్చిన వాడిని యింతకుముందు ఎప్పుడేనా చూశావా?"

"మీ యింటిముందు అతడిని రెండుమూడుసార్లు చూశాను, సార్. అందుకే మీ నౌఖరు అనుకున్నాను" అన్నాడు రహీమ్.

కపాలీ టాంక్ పక్కనే కారు ఆగింది. ఇన్ స్పెక్టర్ రామన్ నవ్వుతూ అతడివంక చూశాడు.

"ఇది మీ కారే!" అన్నాడు రామన్.

"సందేహంలేదు" అన్నాడు రెడ్డి.

"ఇటువంటి దొంగతనాలు పట్నంలో తరచు జరుగుతున్నాయి. ఏ యువకుడో ఈ కారును దొంగిలించి తన గర్ల్ ఫ్రెండ్ను బీచ్ కి తీసుకువెళ్ళి వుంటాడు. తర్వాత కారును వదిలేసి వాళ్ళు వెళ్ళిపోయి వుండాలి" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అలాగే జరిగుండాలి" అన్నాడు రెడ్డి.

"మరికొన్ని ఫార్మాలిటీస్ అయ్యాక కారును మీకు యిచ్చేస్తాం. మళ్లా మీకు ఫోన్ చేస్తాను" అన్నాడు ఇన్ స్పెక్టర్ రామన్.

"చాలా థాంక్స్, మై ఫ్రెండ్" అని రెడ్డి తన కారులో కూర్చున్నాడు.

రహీమ్ కారును పోనిచ్చాడు.

# 8

హరిప్రసాద్, సుజాత పొద్దుటే టిఫిన్ తింటున్నారు. అతడు కూతురివైపు నవ్వుతూ చూశాడు.

"అమ్మాయి, గుడ్ న్యూస్" అన్నాడతను.

ఆమె అతడివంక చూసింది.

"నా మేనల్లుడు రామం న్యూయార్క్‌నుంచి త్వరలో రాబోతున్నాడు. అతను నిన్ను పెళ్ళాడాలని నేనూ, చెల్లెలూ ఎప్పుడూ అనుకునేవాళ్ళం."

"నా పెళ్ళి యిప్పుడే ఎందుకు నాన్నా?" అందామె.

"అమ్మాయి సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. రామాన్ని నేనే అమెరికా పంపాను. అతడు నీకు అన్ని విధాలా సరైన వరుడు!"

"మిమ్మల్ని వదిలి నేను అమెరికా వెళ్ళను, నాన్నా" అందామె.

"అతడూ వెళ్ళడు. పెళ్ళయినాక నా ఫ్యాక్టరీలను చూస్తూ వుంటాడు."

"ఎప్పుడొస్తాడతను?"

"ఇంకా తెలియదు. కేబుల్ యిస్తాడు. అప్పుడు నువ్వు ఏరోడ్రోమ్‌కి వెళ్ళి అతడిని యిక్కడకు తీసుకు రావాలి."

హరిప్రసాద్ హాట్ కాఫీ తాగాడు. ఆమె బూస్టు సేవించింది.

"అతడు అమెరికా వెళ్ళి పదేళ్ళు దాటింది. అతడిని పోల్చడం కూడా కష్టం" అన్నాడతను.

"మనం అంతగా మారలేదుగా! అతడు మన్ని సులువుగా పోల్చగలడు" అందామె.

"గుడ్ ఐడియా" అన్నాడు హరిప్రసాద్ కూతురు బుగ్గను నిమురూ.

ఆనాడు మూడింటికే సుజాత లేడీస్ క్లబ్బుకు వెళ్ళింది. టెన్నిస్ సింగిల్స్ పోటీలో మిస్ మేరీ నెగ్గింది.

అందరూ ఆమెకు అభినందనలు అందజేశారు.

"ఈ సంవత్సరంకూడా నువ్వే నెగ్గావు. కంగ్రాట్స్!" అంది సుజాత.

"వచ్చే సంవత్సరంకూడా నెగ్గాలని నా ఆశ" అంది మేరీ.

"నీతో పోటీగా ఆడేవాళ్ళు లేనంతకాలం మన క్లబ్ ఛాంపియన్ నువ్వే" అంది శ్రీప్రియ.

"పద్మ బాగా ఆడుంది" అంది మేరీ.

"ఎదురుగా నిన్ను చూసేసరికి పద్మ ఆట సగం ఎగిరి పోతుంది. నువ్వు హిప్నాటిస్టులా ఆమెను లొంగదీస్తావు!" అంది రమ.

కప్పులు ఇవ్వడం పూర్తి అయ్యాక అందరూ సుజాత కారులో బీచ్ కి వెళ్ళారు. డ్రయివర్ కూనయ్య కారు లోనే కూర్చుని వుండిపోయాడు.

బీచ్ లో మహా చలిగా వుంది. అందరూ యిసుకలో కూర్చున్నారు. అర్ధ చంద్రుడు ఆకాశంలో కదులు తున్నాడు.

"ఎవరేనా మంచి కథ చెప్పండి" అంది రమ.

"రియల్ రొమాన్స్" అంది పద్మ.

"ట్రూ స్టోరీస్ అంటే నాకిష్టం" అంది సుజాత.

మేరీ ఆమెవైపు నవ్వుతూ చూసింది.

"ఒక ట్రూ స్టోరీ చెప్తాను, నువ్వు ఏమీ అనుకోక పోతే!" అంది మేరీ.

"నేనేమీ అనుకోను" అంది సుజాత.

సముద్రపు హోరు భయంకరంగా వినిపిస్తోంది. మేరీ కథకోసం వాళ్ళు ఎదురు చూస్తున్నారు.

"సుజాత డ్రయివర్ గోపీ నన్ను ఎంతగానో ఆక

రించాడు. చాలాసార్లు లేడీస్ క్లబ్‌లో అతడితో నేను మాట్లాడాను. తటాలున అతడు రావడం మానేసేసరికి నేను చాలా బాధపడ్డాను. అతడు ఏమయ్యాడు? అతడి కోసం వెతకసాగాను. కాని ఎక్కడా అతడు నాకు కనపడలేదు" అంది మేరీ.

"ఇదేం కథ?" అంది సుజాత.

"వినండి. తర్వాత మీకే నచ్చుతుంది."

"కమాన్ చెప్పు" అంది శ్రీప్రియ.

"ఒక దిన పత్రికలో ప్రకటన వేయించాను. ఒకప్పుడు సుజాత డ్రయివర్‌గా వున్న గోపీతో ఒక యువతి మాట్లాడాలి. రాక్సీ టాకీస్ పక్కనున్న పోస్టుబాక్సు దగ్గర ఆదివారం పన్నెండింటికి ఆ యువతి నిలబడి వుంటుంది. గోపీ ఎక్కడున్నా అక్కడకు రావలెను అని ప్రకటనలో చెప్పాను."

"గమ్మత్తుగా వుంది" అంది రమ.

"గోపీ వచ్చాడా?" అడిగింది సుజాత.

"అతడు రాలేదు కాని మరో వ్యక్తి ధర్మరాజు వచ్చి నన్ను కలుసుకున్నాడు. హాస్పిటల్లో తన పక్క పరుపుమీద గోపీ వుండేవాడని ధర్మరాజు చెప్పాడు. గాయాలతో అతడు మరణించాడట. తన కథంతా అతడు ధర్మరాజుకు చెప్పాడట. అందుకే గోపీ పేరు పత్రికలో చూడగానే ధర్మరాజు ఆ పోస్టుబాక్సు దగ్గరకు వచ్చాడు."

"గోపీ అతడితో ఏం చెప్పాడు?" అడిగింది సుజాత.

"నువ్వు అతడిని కవ్వించి, కౌగలించుకొని, ఎన్నిసార్లు ముద్దు పెట్టుకున్నా వూరుకుని యింటికెళ్ళాక అతడిని చావగొట్టించావట!" అంది మేరీ.

"అన్యాయం!" అంది శ్రీప్రియ.

"అంతా అబద్ధం" అంది సుజాత.

"ఆ ధర్మరాజు ఎవరు?" అంది పద్మ.

"హాస్పిటల్లో గోపీకి ధర్మరాజు స్నేహితుడయ్యాడు. గోపీ ప్రాణాన్ని బలితీసుకున్న వాళ్ళమీద తన పగ తీర్చుకుంటానన్నాడు ధర్మరాజు" అంది మేరీ.

"ధర్మరాజు ఎక్కడుంటాడు?" అడిగింది సుజాత.

"ఎంత అడిగినా అతను అడ్రెసు చెప్పలేదు" అంది మేరీ.

"పాపం, గోపీ చచ్చిపోయాడన్నమాట!" అంది శ్రీప్రియ.

"అదే విచిత్రంగా వుంది. ధర్మరాజు చెప్పిన హాస్పిటల్ కి నేను వెళ్ళి గోపీ గురించి దర్యాప్తుచేశాను. గోపీ అనేవాడెవడూ ఆ హాస్పిటల్లో చేరలేదనీ, చావలేదనీ వాళ్ళు అన్నారు."

"డిటెక్టివ్ గా పనిచేశావన్నమాట" అంది రమ.

"హాస్పిటల్ వాళ్ళు చెప్పింది ధర్మరాజు చెప్పిన దానికి విరుద్ధంగా వుంది. ఎవరో అబద్ధం ఆడుతున్నారనిపించింది" అంది మేరీ.

"ఇద్దరూ చెప్పిన దానిలో నిజం దాగివుందేమో! ఇంకా దర్యాప్తుచేసి నువ్వు నిజాన్ని నిరూపించాలి" అంది శ్రీప్రియ.

"దానికేంగాని నా పెళ్ళి సెటిల్ అయిపోయింది" అంది సుజాత.

"ఎవరితో?"

"రామంతో. అతను న్యూయార్క్ లో వున్నాడు. త్వరలో యిండియాకు ప్లేన్ లో వస్తాడు."

"ఎప్పుడొస్తాడు?" అడిగింది మేరీ.

"వచ్చేముందు కేబిల్ యిస్తాడు."

"మమ్మల్ని వదిలి నువ్వు అమెరికా పోతావా?" అడిగింది శ్రీప్రియ.

"అమెరికా వదలి అతడు యిక్కడే వుంటాడు, చూ యింట్లో."

"ఫైన్" అంది రమ.

"అతడు వచ్చినపుడు యేరోడ్రోమ్‌కి మనందరం వెళ్దాం" అంది పద్మ.

"మనందర్నీ చూసి, హడిలిపోయి, అతడు మళ్ళీ అమెరికా పారిపోతాడు!" అంది శ్రీప్రియ.

సుజాత నవ్వింది.

"బావ అమెరికా వెళ్ళి పదేళ్ళయింది. నేను అతడిని పోల్చలేను. అతడే నన్ను పోల్చాలి!" అంది సుజాత.

"మీ నాన్నగారు పోలుస్తారులే" అంది మేరీ.

"ఆయనా పోల్చలేరు" అంది సుజాత.

"పది ఏళ్ళు అమెరికాలో వున్న మనిషి బాగా మారిపోతాడు. వేష భాషల్లో రూపంలో ఎంతో మార్పు వుంటుంది" అంది మేరీ.

"అందుకే అతడు నన్ను పోల్చడం సులువన్నాను" అంది సుజాత నవ్వుతూ.

# 9

హరిప్రసాద్ టెలిఫోన్‌లో మాట్లాడి ఉషారుగా "సుజాతా!" అని పిల్చాడు.

సుజాత అతడి దగ్గరకు నవ్వుతూ వెళ్ళింది.

"అమ్మాయి, రామం వచ్చేశాడు. బొంబేలో వున్నాడు. అక్కడినుండి ఎస్.టి.డి. కాల్ చేసి నాతో

మాట్లాడాడు. ఇవాళ సాయంత్రం ఫ్లయిట్‌లో అతడు వస్తున్నాడు. ప్లేనుకి వస్తుంది" అన్నాడు హరిప్రసాద్.

"నాన్నా, మీరూ వస్తారా?"

"నాకోసం ఒక పార్టీ పారిశ్రామిక వేత్త వస్తున్నాడు. నేను రాలేను. నువ్వే వెళ్ళి అతడిని యింటికి తీసుకురావాలి" అన్నాడతను.

"అలాగే నాన్నా" అందామె.

తన గది పక్కనున్న గదిని ఆమె శుభ్రం చేయించింది. రామం ఆ గదిలో వుంటాడు. ఆమె నీట్‌గా తయారైంది. నాలుగింటికి బయల్దేరి ఏరోడ్రోమ్‌కి కారులో వెళ్ళింది.

డ్రయివర్ కూనయ్య కారును మెల్లిగా పోనిచ్చాడు. అరగంటలో కారు యేరోడ్రోమ్‌కి చేరుకుంది. ఆమె కిందకు దిగింది.

సూటూ, బూటూ ధరించిన ఒకతను ఆమె వంక పరీక్షగా చూశాడు. అతడి పక్కనే ఒక లెదర్ బాక్స్, ఏర్ బాగ్ వున్నాయి.

ఆమె దగ్గరవగానే "హలో, సుజీ!" అని అర్చాడు.

ఆమె అతడివంక చూసింది.

"సుజీ, నేను ప్లేన్‌లోంచి దిగి అరగంట దాటింది. నన్ను పోల్చలేవా?" అన్నాడతను.

"రామం మీరేనా?" అందామె.

"ఫైన్, ఐయామ్ రామమ్! బాక్ టు ఇండియా ఫ్రమ్ న్యూయార్క్! అంకుల్ ఎలా వున్నారు?"

"నాన్న బాగున్నారు పదండి, మన కారులో వెళ్దాం" అందామె.

కూనయ్య అతడి సామానులను కారు డిక్కీలో

పెట్టాడు. ఇద్దరూ వెనక సీటుమీద కూర్చున్నారు. కూనయ్య కారును పోనిచ్చాడు.

"నువ్వు లవ్‌లీ డేమ్‌గా మారిపోయావు. యూ ఆర్ బ్యూటిఫుల్!" అని అతడామెను కౌగలించుకున్నాడు.

ఆమె నవ్వింది. అతడామె పెదిములను ముద్దెట్టుకున్నాడు.

"స్వీట్ లిప్స్" అన్నాడతను.

కారు మెల్లిగా కదుల్తోంది.

"ఎవడీ ఓల్డు బాండికూట్?" అడిగాడతను.

"డ్రయివర్ కూనయ్య. చాలా ఏళ్ళనుంచి మా దగ్గర పనిచేస్తున్నాడు" అందామె.

"అతడు ఎడ్లబండిని నడపాలి, నాట్ ఎ కార్! బ్లడీ, స్టాప్" అన్నాడతను.

కూనయ్య కారును ఆపాడు.

"ముందుకు పద" అన్నాడతను సుజాతతో.

"సిట్ బాక్" అన్నాడతను డ్రయివర్‌తో.

కూనయ్య వెనక కూర్చున్నాడు. అతడు కారును విమానంలా పోనిచ్చాడు. భయంతో సుజాత అతడికి దగ్గరగా జరిగింది. ఆమెను ఒకచేత్తో పట్టుకొని కారును పోనిచ్చాడతను.

"మీరు చాలా ఫాస్ట్‌గా డ్రయివ్ చేస్తారు" అందామె.

"అమెరికాలో మేం ఫాస్ట్‌గా ఆలోచిస్తాం, వేగంగా పనిచేస్తాం. వుయ్ ఆల్‌సో డై ఫాస్ట్!" అన్నాడతను నవ్వుతూ.

ఇంటి ముందు అతడు కారును ఆపి దిగాడు. డార్క్ గ్లాసెస్ ధరించాడతను. తలమీద ఫెల్టు హేట్ వుంది.

హరిప్రసాద్ అతడివైపు నవ్వుతూ వచ్చాడు. అతడిని ఎత్తి గిరగిరా తిప్పి నేలమీద నిలబెట్టాడతను.

"హలో అంకుల్! హలో అంకుల్!" అర్చాడతను.

హరిప్రసాద్ కళ్ళు తిరుగుతున్నాయి.

"అమ్మాయి, రామాన్ని పైకి తీసుకెళ్ళు!" అని వరండాలో వున్న కుర్చీలో కూలిపోయాడతను.

"పైకి వెళ్దాం పదండి" అంది సుజాత.

"ష్యూర్, మైడియర్" అన్నాడతను.

సుజాత వెనకనే విజిల్ చేస్తూ అతడు మెట్లు ఎక్కాడు. ఒక గదిలోకి వాళ్ళు వెళ్ళారు.

"మీ గది" అందామె.

"ఫైన్" అన్నాడతను.

ఆమెను పట్టుకుని సోఫాలో కూర్చున్నాడు. ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

"లవ్లీ కళ్ళు! గోల్డెన్ బేబీ!" అని ఆమెను పదేపదే ముద్దెట్టుకున్నాడతను.

ఆమె ఊపిరాడక వుక్కిరిబిక్కిరైంది.

"ఇప్పుడే వస్తాను" అని ఆమె బయటకు పరుగెత్తింది.

## 10

వంటామె ముందుకు వెళ్ళింది సుజాత.

"పైకి టిఫిన్, కాఫీ పట్టుకెళ్ళి యివ్వండి" అంది సుజాత.

"అలాగేనమ్మా!" అంది వంటామె.

పైకి వెళ్ళిన వంటామె భయపడ్తూ కిందకు పరుగెత్తుకొచ్చింది. ట్రేను సుజాతకిచ్చింది.

"అమ్మా, నువ్వే పట్టుకెళ్ళు! అతడు నా చెయ్యి పట్టుకున్నాడు. నా భర్త పోయాక యెవ్వరూ నామీద

చెయ్యి వెయ్యలేదు" అందామె విచారవదనంతో.

"మీరేమీ అనుకోకండి! ఆయన అమెరికా మనిషి. అక్కడ అందరూ అలాగే వుంటారు" అంది సుజాత.

మరేం గత్యంతరంలేక సుజాత ట్రేను పట్టుకొని పైకి వెళ్ళింది.

అతడు అండర్‌వేర్‌తో అద్దం ముందు నిలబడి ఎలక్ట్రిక్ షేవర్‌తో గడ్డం గీసుకుంటున్నాడు.

అతడు వెనుదిరిగి ఆమె వంక చూశాడు.

"హలో, డార్లింగ్!" అని ఆమెను యెడంచేత్తో ఎత్తేశాడు.

చేతిలోని ట్రే కిందపడకుండా వుండేందుకు ఆమె ముప్పతిప్పలూ పడింది. అతడి రెండో చేతిలో ఎలక్ట్రిక్ షేవర్ వుంది.

అలాగే పైకెత్తి అతడామెను ముద్దెట్టుకున్నాడు.

"హనీ స్వీట్!" అన్నాడతను.

"నన్ను వదలండి, ప్లీజ్" అందామె.

"లిటిల్ బర్డ్, భయమా? అడిగాడతను.

ఆమె నవ్వుతూ అతడివైపు చూసింది.

"మీరు చేసేదానికి ఒక టైముంది. ఇప్పుడు కాదు" అందామె.

"ఆల్ టైమ్స్ గుడ్ ఫర్ లవ్ మేకింగ్" అన్నాడతను.

అతడామెను వదిలేశాడు. టేబుల్ మీద ట్రే పెట్టి ఆమె వెళ్ళిపోయింది.

"టిఫిన్ తిని, కాఫీ తాగండి" అని గది బయట నుంచి చెప్పింది.

అతడు జవాబివ్వలేదు. ఆమె వెళ్ళిపోయింది.

సుజాత టైమ్ చూసింది. తొమ్మిది దాటింది. తండ్రి వైపు ఆమె చూసింది.

"నాన్నా, మనం డిన్నర్‌కి వెళ్దామా?" అందామె.

"నేను తర్వాత తింటానమ్మా. రాముం అమెరికన్ చేష్టలను నేను భరించలేనమ్మా. అతడు నీకాబోయే భర్త. నువ్వు అతడితో సర్దుకుపోవాలి" అన్నాడు హరి ప్రసాద్.

"ఆయన దగ్గర కెళ్ళడం నాకు భయంగా వుంది నాన్నా" అందామె.

"అమెరికా వాళ్లు కొంచెం మోటుగా వుంటారు. వాళ్ళు దూసుకుపోతూ వుంటారు. ఆ విధమైన జీవితానికి నువ్వు అడ్జస్టు కావాలి" అన్నాడతను.

"అలాగే నాన్నా" అందామె.

హరిప్రసాద్ సంతోషించాడు. తన గదికి భోజనం తెమ్మని వంటామెతో చెప్పాడు.

పైకి వెళ్ళి సుజాత గాభరాగా కిందకు వచ్చింది.

"అమ్మాయి, ఏమైంది?" అడిగాడు తండ్రి.

"ఆయన విస్కీ తాగుతున్నారు."

"అమెరికాలో అందరూ తాగుతారు, మనం మంచి నీళ్ళు తాగినట్టు" అన్నాడు తండ్రి.

"ఆయన నాకొక శనీశ్వరుడిలా దాపురించారు" అందామె.

"కొంత అలవాటుపడ్డాక అతనే ఈశ్వరుడవుతాడు" అన్నాడు హరిప్రసాద్.

సుజాత అతడి పక్కనే డైనింగ్ రూమ్‌లో కూర్చుంది. అతడు బాటిల్ని తనకూడా తెచ్చాడు. తింటూ మధ్యలో తాగుతూనే వున్నాడు.

"ఇండియన్ ఫుడ్ తిని పదేళ్ళు దాటింది!" అన్నాడతను.

ఆమె తొందరగా తినేసి చెయ్యి కడుక్కుంది.

"అప్పుడే తినేశావా? నేనిప్పుడే ప్రారంభించాను" అన్నాడతను.

"ఆకలిగా లేదు" అందామె.

"డోంట్ బాదర్! నీకు ఆకలి కల్గేలా నేను చూస్తాను" అన్నాడతను.

ఆమెను తన దగ్గరగా రమ్మన్నాడు. ఆమె వచ్చింది. అమాంతంగా ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"ఇక్కడొద్దు!" అందామె.

"ఎందువలన?"

"వంటామె వుంది."

"మనల్ని చూసి ఓల్డు లేడీ ఆనందిస్తుంది" అన్నాడతను.

అతడు భోజనం ముగించేసరికి పదకొండు కావస్తోంది. ఆవులిస్తూ కూర్చుంది సుజాత.

"మీరు పైకి వెళ్ళండి. మళ్ళా రేపు కల్సుకుందాం" అందామె.

అతడి చేయి ఆమె నడుమును చుట్టేసింది.

"వంటామె పిలుస్తోంది. మీరు పైకి వెళ్ళండి, వస్తాను" అందామె.

అతడు మెట్లెక్కాడు. కాస్సేపు హాల్లో నిలబడి ఆమె తన గదికి వెళ్ళి పడుకుంది.

# 11

అర్ధరాత్రి!

ఏదో గట్టిగా శరీరానికి తగిలింది. హరిప్రసాద్ గాఢ

రాగా లేచాడు.

"లేవరా, డాంగ్ రాస్కెల్!" అర్చారెవరో.

హరిప్రసాద్ కిందకు చూశాడు. మంచం పక్కనున్న అతడివైపు చూశాడు.

"రామం, ఏమిట్రా యిది? ఆ కమ్చీ యెందుకు?" అన్నాడు హరిప్రసాద్.

అతడు పళ్లు పటపట కొరికాడు. కమ్చీ హరిప్రసాద్ వీపుమీద ఛళ్ళుమంది.

"నీ కూతురు గదికి పద!" అర్చాడతను.

"అమెరికా పంపించి నిన్ను యిందుకే చదివించేన్రా రామం? కళ్ళు తెరువు! తప్ప తాగి యిలా చేయడం అన్యాయం" అన్నాడు హరిప్రసాద్.

"నేను నిషాలో లేను. కదులు రాస్కెల్!" అర్చాడతను.

హరిప్రసాద్ కూతురి గదివైపు నడిచాడు.

తలుపు మూసివుంది.

"తెరవమను!"

హరిప్రసాద్ తలుపు తట్టి తెరవమన్నాడు.

ఆమె తలుపు తెర్చింది.

కమ్చీ పైకి లేచి హరిప్రసాద్ మీద దిగింది. అతడు అరుణా గదిలోకి వెళ్ళాడు.

తలుపు మూసి గదిలో నిలబడి తండ్రి, కూతురువైపు అతడు చూశాడు.

"ఏమిటి మీరు చేసేది? నాన్నను కొట్టడానికా యిక్కడికొచ్చారా?" అడిగిందామె.

"కమ్చీతో కొడితే నొప్పెడుతోందా?"

"పెట్టదా?" అందామె.

"ఆనాడు డ్రయివర్ గోపీని కమ్చీతో కొట్టినపుడు నీ తండ్రికిది తెలియదా?" అర్చాడతను.

"గోపీ గురించి మీకెలా తెలుసు" అంది సుజాత.

"ఆనాటి గోపీ నేనే!" అని అతడు తన మేకప్ ను తీసేశాడు.

హరిప్రసాద్, సుజాత అతడివైపు భయంతో చూస్తున్నారు. గోపీ సూటిగా హరిప్రసాద్ వైపు చూశాడు.

"ధన మదంతో ఆనాడు నన్ను చావగొట్టించావు. నన్ను నీ బానిసలు బీచ్ లో పడేశారు. ఈనాడు నీకు దిక్కెవరు రాస్కెల్? నా పగ తీర్చుకుంటాను. నీ కూతుర్ని నీముందు రేప్ చేసి వదుల్తాను! మీ యిద్దర్నీ చావగొట్టి బీచ్ లో పారేస్తాను" అర్చాడతను.

అతడు సుజాత చెయ్యిపట్టుకొని ముందుకు లాగాడు. హరిప్రసాద్ ఆమెవైపు వెళ్ళబోయాడు. కమ్చీ దెబ్బకు తట్టుకోలేక అతడు కిందపడాడు.

సుజాత చీరను అతడు లాగేశాడు. ఆమె జాకెట్ ను చింపేశాడు. ఆమె గింజుకుంటోంది. అరుస్తోంది.

గది బయట నౌఖర్లు గుమిగూడారు. ఆయాసపడుతూ మేరీ అక్కడికొచ్చింది. ఆమె తలుపును తట్టింది.

సుజాత నేలమీద పడివుంది. ఆమెను బూటుకాల్తో తన్నాడతను. హరిప్రసాద్ నేలమీదపడి మూలుగుతున్నాడు.

మళ్లా యెవరో తలుపును తట్టారు!

అతడు గుమ్మంవైపు వెళ్ళాడు. తలుపును తెర్చాడు. అమాంతంగా మిస్ మేరీ గదిలోకి జొరబడింది. అతడి వైపు సూటిగా చూసింది.

"గోపీ ఏం చేస్తున్నావు? ఒకప్పుడు హరిప్రసాద్

నిన్ను హింసించారు సుజాత నిన్ను కవ్వించి, నీతో ఆడి నిన్ను కొట్టించింది. వాళ్ళు ఆనాడు చేసింది తప్పే! ఆనాడు వాళ్ళు చేసిన తప్పే యీనాడు నువ్వు చేస్తున్నావు!" అందామె.

"నేను అమాయకుడిని. వాళ్ళు దోషులు" అన్నాడతను.

మేరీ అతడివైపు ఆప్యాయంగా చూసింది.

"గోపీ, తెలియక వాళ్ళు ఏదో నేరం చేశారు. వాళ్ళను మన్నించు! వాళ్ళ తప్పులను క్షమించడం మూలంగా వాళ్ళలో పరివర్తనను నువ్వు తీసుకురావచ్చు! ఈ లోకంలో ఎవ్వరూ శాశ్వతంగా రాక్షసుడు కాడు. తత్వాలు మారుతూ వుంటాయి. ప్లీస్, నాకోసం, నీ కోసం, వాళ్ళను క్షమించు!" అంది మేరీ.

అతడు కమ్చీని దూరంగా విసిరాడు.

సుజాత లేచి దుస్తులను ధరించింది. హరిప్రసాద్ అతడివైపు విచారవదనంతో చూశాడు.

"గోపీ, ఆనాడు నేను అన్యాయంగా ప్రవర్తించాను. నన్నూ, నా కూతుర్నీ క్షమించు" అన్నాడు హరిప్రసాద్.

సుజాత కన్నీళ్ళతో అతడివైపు చూసింది.

"నేను మిమ్మల్ని పెళ్ళాడ్డానికి సిద్ధంగా వున్నాను" అంది సుజాత.

అతడు ఆమెవైపు సూటిగా చూశాడు.

"మిస్ మేరీ నా కళ్ళు తెరిచింది. సరైన మార్గాన్ని నాకు సూచించింది. ఆమె యీ జీవితంలో నాకు పార్ట్నర్ గా వుండాలని నా ఆశ" అన్నాడు గోపీ.

"ఈ రాత్రి మీ రిద్దరూ యిక్కడే వుండండి.

గతాన్ని పూర్తిగా మర్చిపోదాం" అన్నాడు హరి ప్రసాద్.

గోపీ పక్కనున్న మేరీ చేయి పట్టుకున్నాడు.

"గతాన్ని మర్చిపోయి యికపైన మనం మనుషులుగా జీవించుదాం" అన్నాడు గోపీ.

గోపీ, మిస్ మేరీ పక్క గదిలోకి వెళ్ళారు. హరి ప్రసాద్, సుజాత వాళ్ళకు గుడ్ నైట్ చెప్పి, వాళ్ళ గదులకు వెళ్ళిపోయారు.

—:అ యి పో యి ం ది:—

సీరియల్



ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

ఆండ్రూస్ చెప్పినదంతా విని నాయకుడు మళ్ళీ పెద్ద రంకె వేశాడు. తలను ఆండ్రూస్‌తో ఏకీభవించనట్టుగా అటూ యిటూ ఆడించాడు.

తర్వాత యేదో చెప్పాడు.

"ఐయామ్ సారీ భారత్.... నాయకుడు మీ సంజాయిషీని కొట్టేశాడు. నాగరికుల ఆచారాలతో మాకు సంబంధం లేదు. ఈ దీవి మాది. మా పూర్వీకులనించీ వస్తున్న ఈ ఆచారాన్ని మీరు తెలియక చేసినంత మాత్రాన మేము సరిపెట్టుకోలేము. పాతిపెట్టబడిన మనుషుల ప్రేతాత్మ యిక్కడే గాలిలో తిరుగుతూ టకారాజాతి మనుషులను బాధిస్తూ వుంటుంది. అందువల్ల దానికి ప్రాయశ్చిత్త కార్యక్రమం యేర్పాటు చెయ్యక

తప్పదు."

"ప్రాయశ్చిత్త కార్యక్రమమా!" అదిరిపడి అడిగాడు భారత్.

"అవును భారత్ .... చెప్పాను కదా దీని పర్యవసానం చాలా ఘోరంగా వుంటుందని. మీ కెలా చెప్పాలో నాకు తెలీటంలేదు. ఐనా చెప్పక తప్పదు."

ఆగిపోయాడు ఆండ్రూస్.

అంతా గుండెలను అరచేత పట్టుకుని వున్నారు ఆండ్రూస్ చెప్పబోయే ఆ ప్రాయశ్చిత్త కార్యక్రమం యేమిటో తెలుసుకుందామని.

భారత్ కు చెమటలు క్రమ్మాయి ఆ కార్యక్రమం యేమిటో తెలియక ముందే.

"ఏమిటా కార్యక్రమం?" అడిగేసింది స్టెల్లా.

"చెబుతాను. దయచేసి నన్ను నిందించకండి. నేనూ ఒకప్పుడు మీ లాంటి నాగరికుడినే. ఐనా ప్రస్తుతం ఈ టకారాజాతి మనుషుల్లో ఒకడికిందే లెక్క. నాయకుడి ఆజ్ఞలను పాటించటం యిక్కడి ప్రతి ఒక్క మనిషి మొదటి కర్తవ్యం. ఇప్పుడు నా కర్తవ్యం యేమిటంటే మీ మనిషిని ఈ దీవిలో పాతిపెట్టిన నేరానికి ప్రాయశ్చిత్తం సక్రమంగా నిర్వర్తించే బాధ్యతను నాయకుడు నాకు అప్పగించాడు. అందుకే నేనింతగా బాధపడు తున్నాను" అంటూ ఆగాడు ఆండ్రూస్.

టకారాజాతి మనుషులంతా వీళ్ళందరినీ శత్రువులను చూసినట్టు చూస్తున్నారు. ఆ దీవిలో ఓ మనిషి ప్రేతాత్మ తిరిగేలా చేసిన నాగరికులను వాళ్ళు ద్వేషంతో చూస్తున్నారు.

ఆ చూపులను—వాళ్ళ మనోభావాలను అంతా పసి

కట్టారు. అలా జరిగినందుకు వాళ్ళకు బాధ కలిగింది.

అలాంటి మూఢ నమ్మకాలతో—అర్థంలేని ఆచారాలతో తమచుట్టూ ఓ గీత గీసుకుని దాని మధ్యనే బతుకుతున్న ఆ మొరటు మనుషులను చూస్తుంటే జాలి కలిగింది.

కాని—ప్రస్తుతం తాము యే పరిస్థితుల్లో వున్నారో తలుచుకుంటే వాళ్ళమీద వాళ్ళకే జాలి కలిగింది.

చివరగా భారత్ అన్నాడు. "ఆ ప్రాయశ్చిత్త కార్యక్రమం యేమిటో చెప్పండి ఆంద్రూస్."

"మీలో ఎవరో ఇద్దరు మనుషులను మాకు యిచ్చెయ్యాలి. ఆ ఇద్దరు మనుషులనూ మా కపాచీ అంటే ఈ టకారాజాతిని కాపాడే దేవత ఎదుట తలలు నరికి ఆ మాంసాన్ని వండి దేవతకు నివేదన చేసి ఆ మాంసాన్ని ఈ గూడెంచుట్టూ విసిరేస్తాం...."

"వీల్లేదు. దారుణం.... మేం ఒప్పుకోం" ఆంద్రూస్ ప్రాయశ్చిత్త కార్యక్రమం వింటూనే ఒక్కసారిగా అంతా శివమెత్తిన వాళ్ళలా పెద్దగా అరిచారు ఆవేశంతో....

నాయకుడు కలవరపడి యేదో అన్నాడు.

ఆంద్రూస్ మళ్ళీ చెబుతూ "మీ అరుపులు నాయకుడికి అర్థం అవకపోయినా నేను చెప్పినదానికి మీరు మీ అసమ్మతిని తెలియజేస్తున్నట్టుగా ఆయన గ్రహించాడుట. అలాంటి పక్షంలో మీ అందరినీ శిక్షించే అధికారం టకారాదీవి నాయకుడిగా తనకు వుందని తెలియజెయ్యమంటున్నాడు...." అన్నాడు.

"ఏమైనా ఇది అన్యాయం మిస్టర్ ఆంద్రూస్. మీరు కూడా ఓ నాగరిక మనిషి ఐవుండీ సాటి మనుషులకు

కేవలం కొంతమంది అనాగరికులతో కలిసి హాని చెయ్యాలనుకోటం దారుణం. ఇంతకు మించిన అన్యాయం ఇంకోటి వుండదు. ఇందులో మా తప్పేమిటో మీకు తెలుసు కదా! ఐనా మీరు తగిన విధంగా చెప్పి నాయకుడిని కన్విన్స్ చెయ్యటానికి యెందుకు గట్టిగా ప్రయత్నించరు?"

బాధగా అన్నాడు భారత్. అతని గుండె దహించుకుపోయింది. ఎందుకంటే ప్రాయశ్చిత్త కార్యక్రమంగా తమలో ఇద్దరు మనుషులను ఇలా తలలు నరుకుతామని అంటారని వూహించలేదు. ఇలాంటి పరిస్థితులు ఎదురవుతాయని ఏ మాత్రం ముందుగా వూహించగలిగినా ఆ జాతి మనుషులు కనిపించినప్పుడే పోరాటం జరిపి చావో, బతుకో తేల్చుకునే వాళ్ళు.

భారత్ అంత పరుషంగా మాట్లాడేసరికి ఆండ్రూస్ మొహం జేవురించింది.

ఐనా వీలైనంత శాంతంగానే "డియర్ ఫ్రెండ్స్! నేను యిక్కడ ఏ పరిస్థితిలో యెలా బతుకుతున్నానో మీరంతా చూశారు కదా! నేను నిమిత్తమాత్రుడిన్ని. నాయకుడి ఆజ్ఞలకు బద్ధుడిన్ని. నా యిష్టప్రకారం ఇక్కడ యేదీ జరగదు. ఈ దీవి నాయకుడే సర్వాధికారి. ఈ శవాన్ని పాతిపెట్టిన తప్పును నాయకుడే కాదు యీ గూడెంలో పసిపిల్లాడు కూడా క్షమించలేదు. అందుకు ప్రాయశ్చిత్తం జరిగేవరకూ వీళ్ళు నిద్రపోరు. ఆ నమ్మకం అలాంటిది.

తన దీవిలో జరిగిన అపచారానికి ప్రాయశ్చిత్తంగా కపాలీకి అంటే వీళ్ళను కాపాడే దేవతకు నరబలి నివేదన జరగందే ఆమె వాళ్ళను కాపాడదని వీళ్ళందరి

నమ్మకం. ఇందుకు భంగం జరగటానికి వీల్లేదు. అందువల్ల మీరంతా నన్ను క్షమించండి. ఇక ఈ విషయం గురించి మీరు యెంతగా నాతో వాదించినా అందువల్ల కొంచెం కూడా ప్రయోజనం లేదు. కాబట్టి త్వరగా మీలో ఎవరో ఇద్దరు మనుషులను వీళ్ళకు అప్పగించండి" అని ముగించాడు.

అందరు ఒకరినొకరు భయం భయంగా చూసు కున్నారు.

ఎవరో ఇద్దరు!

ఎవరా ఇద్దరు?

ఎవరు ఎవర్ని వాళ్ళకు అప్పగిస్తారు? ఇక ఆ తలలు నరికే ప్రాయశ్చిత్తం ఆగేది కాదని అందరికీ అర్థమై పోయింది.

అందుకే ఎవరికి వారే మృత్యుభయంతో వణికి పోయారు. అందరి కళ్ళలో ప్రాణభయం తొణికింది.

ఆంద్రూస్‌తో "క్షమించండి. మాలో ఇద్దర్ని అప్ప గించమంటే ఎవర్ని అప్పగించాలి? ఆ పని మేము చెయ్య లేము" అన్నాడు.

అందుకు ఆంద్రూస్ "నువ్విలా అంటావని నాకు తెలుసు. నువ్వే కాదు నీ స్థానంలో నేను వున్నా ఇలాగే అంటాను. నిజమే. మరో మనిషి ప్రాణాలు తియ్యమని ఎవరూ ఎవర్ని ముందుకు నెట్టరు. ఐతే—ఇక్కడ అందుకు కూడా ఒక పద్ధతివుంది. మీరంతా వరుసగా నిలబడాలి. కొంచెం దూరంలో మా దగ్గరవున్న రెండు మెడపాముగు జంతువులను వదులుతాం. అవి యెవరి దగ్గరకు వచ్చి నిలు చుంటే ఆ యిద్దరినీ ప్రాయశ్చిత్తానికి తలలు నరకటానికి తీసుకుంటాం...." అని చెప్పాడు ఆంద్రూస్ నాయకుడి

తరఫున.

స్టెల్లాకు మొదటిసారిగా ప్రాణభయం కలిగింది. ఆమెకే కాదు. భారత్ కు కూడా. అప్పటివరకూ మిగిలిన మనుషులందరూ భయంతో, దిగులుతో వణికిపోతున్నా వాళ్ళిద్దరే మిగిలినవాళ్ళకు ధైర్యం చెప్పారు. కాని యీ మెడపొడుగు జంతువులను వదిలి ఆ మనుషుల తలలు నరుకుతాన నేసరికి ప్రతి ఒక్కరితో పాటు ఆ ఇద్దరికీ ప్రాణభీతి కలిగింది.

స్టెల్లా తను తొందరపడి ప్లేన్ లో రివాల్వర్ తీసి షూట్ చేసినందుకు అప్పుడు పశ్చాత్తాప పడింది. కాని అందువల్ల ఉపయోగం యేమిటి?

ఒక రకంగా యిప్పుడు ఈ పరిస్థితి యెదురవటానికి పూర్తిగా తను—భారత్ యిద్దరే కారణం.

కనీసం షాంకీల్ ను వాళ్ళంతా మీదపడి కొడుతున్నప్పుడు—చంపుతామన్నప్పుడు వారించకుండా వున్నా బావుండేది. చనిపోయిన షాంకీల్ ను అక్కడే వదిలి వచ్చేవాళ్ళు. అతని శరీరాన్ని యే జంతువులో తినేసి వుండేవి. అప్పుడీ సమస్య ఎదురయ్యేది కాదు.

భారత్ కూడా యిలాగే ఆలోచిస్తున్నాడు.

వాళ్ళందరికీ యీ పద్ధతి గురించి చెప్పినట్టుగా అంద్రూస్—నాయకుడితో చెప్పాడు.

అంతా విని నాయకుడు తన చుట్టూ వున్న మనుషులతో యేదో చెప్పాడు.

ఒక్కసారి వాళ్ళంతా సంతోషంతో అరిచారు. ఆనందంతో ఎగిరారు.

వాళ్ళెంత రాక్షసులో వాళ్ళ ఆనందం—ఆ ఉత్సాహం చూస్తుంటేనే నాగరికుల కందరికీ అర్థమై

పోయింది.

అంద్రూస్ విచారవదనంతో చెప్పాడు—

"చూశారు కదా ఈ జాతివాళ్ళ ఉత్సాహం — సంతోషం? మెడపొడుగు జంతువులతో మీలో ఇద్దరిని ప్రాయశ్చిత్తానికి ఎన్నిక చేస్తున్నారని చెప్పే సరికి వీళ్ళంతా ఆనందపడుతున్నారు. ఈ సంఘటనతో వీళ్లెంత మూఢులో వీళ్ళ మూఢ నమ్మకాలు యెంత బలమైనవో అర్థం చేసుకోండి. అంతా మీ దురదృష్టం. అందువల్ల నే మీరు ప్రయాణం చేస్తున్న విమానం ఈ దీవిలో కూలి పోయింది.

అలా కాకుండా సముద్రంలో కూలిపోయినా మీరంతా ఒక్కసారే మరణించేవాళ్ళు. అప్పుడు మీకీ మృత్యువు ఎవర్ని వరిస్తుందో అనే ఉత్కంఠ వుండేది కాదు. ఐ యామ్ వెరీ వెరీ సారీ ... నన్ను దయచేసి మనస్ఫూర్తిగా క్షమించండి. ఐయామ్ హెల్ప్‌లెస్. ఐయామ్ జస్ట్ టాయ్ ఇన్ ది హాండ్సాఫ్ దిస్ బ్లడీ లీడర్ ....ఇప్పటికే బాగా ఎండెక్కుతోంది. మీరంతా లేచి ఆ పొడుగ్గా వున్న చెట్టు దగ్గరకు వెళ్ళి నిలుచోండి ...." అన్నాడు.

అంద్రూస్ యెంతగా విచారాన్ని వ్యక్తపరిచినా, ఎన్నిసార్లు క్షమాపణలు చెప్పుకున్నా ఆ విచారం ఆ క్షమాపణలు వారిలో యే ఒక్కరికీ వూరటను కలిగించలేకపోయాయి. ఎందుకంటే ఆ మెడపొడుగు జంతువులు యెవరిదగ్గరకు వచ్చి నిల్చుంటాయో తెలీదు. ఎవర్ని మృత్యువు శాశ్వతంగా తన ఒడిలోకి లాక్కుటుందో తెలీదు. ఎవరి తలలు తెగ నరకబడుతాయో తెలియదు.

ఎవ్వరూ అక్కడినుంచి కదల్లేదు.

నాయకుడు ఆండ్రూస్‌ను చూశాడు. ఆండ్రూస్ వాళ్ళందర్నీ మరోసారి ఆ పొడుగాటి చెట్టుదగ్గరకు వెళ్ళి నిలబడవలసిందిగా కోరాడు.

ముందుగా భారత్ కదిలాడు. అతని వెనుక సైలా.... తర్వాత ముసలాయన. ఆయన వెనుక ముగ్గురు స్త్రీలు. మిగిలిన అందరూ—

అంతా మవునంగా ఏడుస్తున్నారు.

"చావు గురించి నాకు భయంలేదు. కాని నా చెల్లెలు ఆరోగ్యం యెలావుందో ననే నాకు బెంగగా వుంది. గాడీజ్ కైండ్‌లెస్. డిసీజ్ మై ఫేట్" అంటూ ఓ స్త్రీ నుదుటిమీద కొట్టుకుంది కసిగా—యేడుస్తూ....

ఐనా యెవ్వరూ చెయ్యగలిగింది యేదీ లేదు. ఎవరికి వారే నిస్సహాయ స్థితిలో వుండిపోయారు.

* * *

టకారా మనుషులంతా వరుసగా నిల్చున్న వాళ్ళందర్నీ కుతూహలంగా చూస్తున్నారు.

వాళ్ళందంకీ యెంతో ఆసక్తికరంగా వుంది.

చాలా యేళ్ళ తర్వాత ఆ దీవిలో మెడపొడుగు జంతువులతో తలలు నరకటానికి మనుషులను ఎన్నిక చేసుకోవటం మళ్ళి ఇదే.

వాళ్ళకు యెదురుగా కొంచెం దూరంలో పాంకీల్ శవం గురించిన వార్తను మోసుకు వచ్చిన టకారజాతి మనుషులు నిలబడి వున్నారు. వారి పక్కనే ఆండ్రూస్ నిలబడి వున్నాడు.

నాయకుడికి ఆనందంగా వుంది.

ఎన్నో రోజుల తర్వాత తన దీవి కపాచీకి నరమాంస నివేదన చెయ్యబోతున్నారు.

అందరికీ కళ్ళు తిరుగుతున్నట్టుగా అనిపించింది. భూమి రెండుగా చీలిపోతున్నట్టు అంతా ఆ చీలికలోకి దిగి పోతున్నట్టుగా అనిపించింది.

ఎదురుగా నాలుకలు చాచుకుని పిల్లి కళ్ళతో అసలే పొడుగ్గా ఉన్న మెడలను మరింత పొడుగ్గా ముందుకు చాచి మరికొన్ని క్షణాల్లో నూసుకు రాబోతున్న మృత్యువులా వున్నాయి ఆ మెడపొడుగు జంతువులు.

ముసలాయన—ఆ స్త్రీ ఏడుస్తున్నారు.

"ప్లీజ్.... నేను ముసలివాడిని.... నన్ను ఈ ఎన్నిక నించి వదిలివేయండి" రెండు చేతులూ జోడించి అంద్రూస్‌ను, నాయకుడినీ చూస్తూ యేడుస్తూనే ప్రార్థించాడు ఆయన.

అంద్రూస్ తల తిప్పుకున్నాడు.

నాయకుడు తన ఐదుగురు మనుషులకూ యేదో చెప్పాడు. అంతే, వెంటనే వాళ్ళు ఆ మెడ పొడుగు జంతువుల తోకలను రెండుసార్లు దువ్వి పక్షి కూతల్లాగా చిత్రమైన అరుపులు అరిచి వాటికి ఎదురుగా వరుసగా నిలబడివున్న మనుషులను చూపించి వాటిని ముందుకు నెట్టారు.

తోకలను వూపుకుంటూ అవి రెండూ బద్ధకంగా ఒక్కో అడుగు వేస్తూ ముందుకు కదిలాయి.

ఆ జంతువులు కదిలిన వెంటనే వాళ్ళందరి కళ్ళల్లోనూ మృత్యు భయం క్షణాల్లో యెంతగానో పెరిగిపోయింది.

ఎవరికివారే ఆ జంతువులు తమ దగ్గరకు వచ్చి నిలుచోకుండా ఉండాలని మనసులోనే కనుపించని దేవుడిని ప్రార్థించసాగారు.

టకారాజాతి వాళ్ళకు అదో గొప్ప వినోదంగా వుంది.

వాళ్ళు కేరింతలు కొడుతున్నారు. రకరకాల ధ్వనులతో వాళ్ళు సంతోషాన్ని బయట పెడుతున్నారు.

ఆ జంతువులు ముందుకు కదులుతున్నాయి.

స్టెల్లాకు ఆ దీవి మొత్తాన్ని బాంబులతో పేల్చి సమూలంగా నాశనం చెయ్యాలనిపించింది ఆ క్షణంలో.

మెడపొడుగు జంతువులు సగందూరం నడిచాయి. అవి నడుస్తుంటే వాటి నాలుకలు నోట్లోకి పోయి బయటకు వస్తున్నాయి. పొడుగ్గా ఉన్న తోకలు పట్టు కుచ్చులా పూగుతూ భూమిని రాసుకుంటూ వెళుతున్నాయి.

అందరికీ గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. వాళ్ళ ముఖాలలో ప్రేతకళ తాండవిస్తోంది.

తమకు ఎంతో రుచిగా వండిన నల్లమృగం మాంసాన్ని పెట్టి వెదురు ముక్కల పాత్రలతో ఎర్రటి పానీయాలను యిచ్చి యెంతో ఆదరంగా ఆతిథ్యమిచ్చిన ఈ మనుషులు కనీసం కొంచెమైనా జాలి — దయ అనే ఆలోచన లేకుండా తమ తలలు నరకటానికి ఎన్నికకై జంతువులను వదిలి ఇలా కేరింతలతో ఉత్సాహపడుతున్నారంటే వాళ్ళ గురించి యేమని అనుకోవాలో వాళ్ళలో యే ఒక్కరికీ అర్థంకాలేదు.

ముసలాయన ప్రార్థనను యెవ్వరూ పట్టించుకోలేదు.

ఆ స్త్రీ యేడుపును యెవ్వరూ ఆలకించలేదు.

అలాంటి సమయంలో—

జంతువులు అప్పటివరకూ పక్క పక్కనే నడిచి అక్కడ రెండూ ఒకదానికొకటి దూరమై పోయాయి.

ఒకటి భారత్ ఎదురుగా వస్తున్నట్టు అనిపించింది. రెండో జంతువు స్టెల్లా యెదురుగా వస్తున్నట్టు అనిపిం

చింది.

ఎలాంటి ప్రమాదాన్నైనా యెదుర్కోటానికి సిద్ధపడే సెల్లా తన యెదురుగా నాలుకను ఊపుకుంటూ పిల్లి కళ్ళతో వస్తున్న ఆ మెడపొడుగు జంతువును చూడగానే భయంతో గజగజలాడిపోయింది.

ఉహూ....తను చావకూడదు. తన చావే నిజంగా నిజమయితే తను ఒంటరిగా చావదు. టకారజాతి మనుషులను కనీసం పదిమందిని చంపి ఆ తర్వాత చస్తుంది.

ఆ క్షణాల్లోనే తనకు సూటిగా విలాసంగా తోకను కదులుస్తూ వస్తున్న ఆ జంతువును చూస్తుంటే కెరోన్ ఆ జంతువు రూపంలో తనని మృత్యువుకు ఎరగా వేయటానికి అలా వస్తున్నట్టుగా భారత్‌కు అనిపించింది.

సందేహంలేదు. ఇవే తనకు ఆఖరి క్షణాలు. కెరోన్ శాపం తనను వదల్లేదు. ఆమె మరణ సమయంలో విధించిన శాపం వృధాగాపోయే అవకాశంలేదు.

దీనికంతటికీ కారణం—సెల్లా.

తొందరపడి కెరోన్‌ను రివాల్వర్‌తో కాల్చి చంపింది.

నిజంగా ఇది కెరోన్ శాప ఫలితమే అవకపోతే ఈ పిల్లికళ్ళ జంతువు తన యెదురుగానే ఎందుకు వస్తుంది? ఇంతమంది వరుసగా నిలబడి వున్నప్పుడు—

తన మీద నే కక్ష కట్టినట్టు తననే చూసుకుంటూ ఇలా యెందుకు వస్తుంది?!

కెరోన్....నన్ను క్షమించు....

అతని ప్రార్థన ఆ జంతువుకు వినిపించి ఉండదు. అది మరింత ముందుకు అతనికి సూటిగానే వచ్చింది.

భారత్‌లో ఇక తను మృత్యువునించి తప్పించుకో

గలనే నమ్మకం పోయింది. ప్రాణభయంతో కొంచెం పక్కకు కదలబోయాడు కాని వీలు కాలేదు. అతని వెన్నులో బల్లెం వాడియైన మొన గుచ్చుకుంది.

గమనించనే లేదు. ఎప్పుడు వచ్చి నిల్చున్నారో ఆ జాతి మనుషులు. ఒక్కొక్కరి వెనుక ఒక్కో మనిషి బల్లెం తీసుకుని యెవ్వరూ కదలటానికి, పారిపోవటానికి వీల్లేకుండా పట్టుకుని నిల్చున్నారు.

స్టెల్లా కూడా సరిగ్గా ఇలాంటి పరిస్థితిలోనే వుంది. ఆ జంతువు తన యెదురుగానే వస్తోందని నిర్ధారణ చేసుకున్న తర్వాత కదలటానికి ప్రయత్నించి విఫలమైంది.

ఆ పొడుగు తోక జంతువులు వరుసగా నిల్చున్న మనుషులకు సమీపంగా వచ్చేశాయి. అందరూ వణుకుతూ తమ ఇష్టదైవాలను ప్రార్థించుకోసాగారు.

స్టెల్లా — భారత్ భయంతో కళ్ళు మూసుకున్నారు.

కాని — స్ప్లిట్ సెకండ్‌లో

ఎ ఛేంజ్ ....

పట్టుకుచ్చులాంటి తోక కలిగివున్న ఆ జంతువులు రెండంగల్లో వెళ్ళి యిద్దరు మనుషుల యెదురుగా వెళ్ళి నిల్చుండిపోయాయి నాలుకలు ఆడిస్తూ.

ఆ ఇద్దరూ స్త్రీలు.... వాళ్ళే ఆ రాత్రి ఏడుస్తున్న స్త్రీని ఓదార్చినవాళ్ళు.... ఇప్పుడు మృత్యువు ఆ ఇద్దరినే వరించింది.

టకారాదీవి మనుషులు ఆనందంతో పెద్దగా అరిచారు. నాయకుడు ఏవో ఆజ్ఞలు అప్పటికప్పుడే జారీ చేశాడు. కళ్ళు తెరిచారు భారత్ — స్టెల్లా.

ఏదో గొప్ప అగాధంలోకి పడబోయి వెంట్రుక

వానిలో తప్పించుకున్న భావన ఆ క్షణంలో ఆ ఇద్దరికీ కలిగింది.

గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

మృత్యువు తమను వదిలినందుకు సంతోషమనిపించినా మరో ఇద్దర్ని — ఆ ఇద్దరూ స్త్రీలనే కౌగిలించుకున్నందుకు భరించలేని విచారం కలిగింది.

ఇక ఆ స్త్రీల పరిస్థితి? ఆ జంతువులు తమ ఎదురుగా వచ్చి నిలబడినప్పుడే ఇద్దరికీ భయంతో స్పృహ తప్పి పోయింది. పడబోతున్నప్పుడు పక్కనే ఉన్న మనుషులు ఆ ఇద్దరిని పట్టుకున్నారు.

స్పృహ తప్పిన ఆ ఇద్దరూ తిరిగి స్పృహలోకి రావటానికి ఎంత టైము తీసుకునేదో తెలీదు కాని ఆ టకారజాతి మొరటు మనుషులు మాత్రం కేవలం పదినిమిషాల్లోనే వాళ్ళకు స్పృహవచ్చేలా చేశారు.

అప్పుడు తెలివిలోకి వచ్చిన తర్వాత ఆ స్త్రీలు హృదయవిదారకంగా యేడ్చారు, విలపించారు. రోదించారు. ఐనా ఆ రాతి గుండెలు కరిగే అవకాశమే లేదు.

స్పృహ పోయినప్పుడే ప్రాణాలుకూడా పోయి వుంటే బావుండేదని అనుకున్నారు వాళ్ళు. కాని అలా జరగలేదు. ఒకవేళ నిజంగానే అలా జరిగి వున్నట్లయితే ఆ జాతి ఆచార ప్రకారం మరో ఇద్దరి ఎన్నిక సరిగ్గా అదేవిధంగా జరిగివుండేది.

* * *

క్షణాలమీద కపాచీ విగ్రహం యెదుట బలికి అన్నిరకాల యేర్పాట్లూ జరిగిపోయాయి.

సూర్యుడు ఆకాశం నడినెత్తికి వచ్చాడు.

ఎండ కాలుస్తోంది — సూర్యుడికూడా టకారాల

కర్కశత్వానికి మండిపడుతున్నట్టుగా వేడి కిరణాలను వదులుతున్నట్టున్నాడు.

చెట్లు గాలికి వికృతంగా పూనకం వచ్చినట్టుగా తలలు వూపుతున్నాయి.

వేడిగాలి ఉధృతంగా వీస్తోంది.

ఇక మిగిలిన మనుషులు ఆ చెట్టుకిందనే జరుగుతున్న తతంగాన్ని చూస్తూ జీవచ్ఛవాల్లా నిలబడ్డారు. వాళ్ళందరికీ మనసులో గిల్టీగా వుంది.

గుండెల్లో పెట్రోలుపోసి తగలబెడుతున్నట్టుగా కూడా వుంది. ఇంతమంది వున్నారు. ఇద్దరు స్త్రీలను ఆ బలి కార్యక్రమం నించి తప్పించలేక పోయారు. వాళ్ళిద్దరి బదులుగా మరో యిద్దరు మగవాళ్ళు వెళ్ళలేక పోయినందుకు ఎవరికివారికే బాధగా వుంది.

కాని— తెలిసి తెలిసి కావాలని కోరి ఎవరు మృత్యువు యెదురుగా వెళ్ళి నిల్చుంటారు?

అందరిలోనూ ఇదే ఆలోచన—

ఆ ఇద్దరూ యేడుస్తూనే వున్నారు. ఐనా వాళ్ళ కన్నీటికి విలువ లేదు.

బలి పశువుల్లా గింజుకుంటున్నారు వాళ్ళు....

సెలాలో ఆవేశం పొంగింది. ఐనా బలవంతంగా అణచుకుంది.

స్త్రీలను ఇద్దరినీ అలంకరిస్తున్నారు.

నూరిన కత్తులు సిద్ధంగా వున్నాయి.

తనముందు ఇంత సందడిగా వున్నా కపాచీ దేవత మొహం అలాగే వుంది. ఆ దేవత మెళ్ళో వున్న హారంలోని మణి దివ్యమైన కాంతులను విరజిమ్ముతోంది.

భారత్ ఆ మణిని చూస్తున్నాడు. ఆ మణి ఎర్రని

కాంతుల్లాగే అతడి కళ్ళలోనూ క్రోధాగ్ని జ్వాలలు రేగుతున్నాయి.

తమని నిస్సహాయులను చేసి ఈ దీవి టకారాజాతి వాళ్ళు ఘోరమైన అన్యాయాన్ని తమకు చేశారు. తమలో ఇద్దరి మనుషుల చావును తమకు వినోదంగా మార్చుకున్నారు.

నిజంగా ఇదంతా ఆచారంగా—మూఢనమ్మకంగా జరిగే ప్రాయశ్చిత్తమే ఐతే ఆ జంతువులను వదిలినప్పుడు వాళ్ళంతా సంతోషంతో—ఆనందంతో అలా కేరింతలు కొట్టటం ఎందుకు?

నో....కాదు....కాదు ముమ్మాటికీ కాదు. ఇదంతా నరబలిని ఇవ్వటానికి అందుకోసం ఏర్పాటు చేసుకున్న వినోదంతో సంతోషం పొందటానికే ఈ ప్రేతాత్మ—పశ్చాత్తాప కార్యక్రమం.

టకారాలు .... తమందరి గుండెల్లో ఆరని చిచ్చు రగిల్చారు. ఇందుకు ప్రతీకారం తీర్చుకోవాలి. మూఢ నమ్మకాలతో నే బతికే ఈ జాతి మనుషులకు ఆ కపాలీ మెళ్ళో కాంతులను వెదజల్లుతున్న ఆ మణి అత్యంత ముఖ్యమైనది—ప్రాణప్రదమైనదీ కావచ్చు.

ఆ మణిని వాళ్ళకు దక్కకుండా చెయ్యాలి. వాళ్ళు ఆ దిగులుతో నే కృశించిపోయేలా చెయ్యాలి.

ఉలిక్కిపడ్డాడు భారత్.

ఎందుకంటే ఆండ్రూస్ అతని దగ్గరగా వచ్చి భుజం మీద చెయ్యి వేశాడు.

"క్షమించు....నీ మనసులో రగులుతున్న కార్చిచ్చు నాకు తెలుసు. ఈ టకారా జాతివాళ్ళు మీరు చెయ్యని నేరానికి కేవలం ఆచారం—నమ్మకం పేరుతో ఎంతటి

ద్రోహాన్ని చేశారో నాక్కూడా తెలుసు. ఐతే ఇలాంటి ద్రోహమే నాకూ జరిగింది. ఐనా నేను భరించాను. భరించక తప్పలేదు."

ఆ మాటలతో ఆశ్చర్యపోయాడు భారత్.

"ఏమిటి మీరనేది ఆండ్రూస్....ఇలాంటి ద్రోహమే మీక్కూడా జరిగిందా? ఎప్పుడు? వివరంగా చెప్పండి."

ఆండ్రూస్ ఏదో చెప్పబోతున్నప్పుడు అక్కడకు నాయకుడు వచ్చి ఆయనతో యేదో చెప్పాడు.

"మీరు యిక్కడే వుండి ఈ ప్రాయశ్చిత్త కార్యక్రమాన్ని చూడలేరేమో! అందువల్ల మీరు మీకై కేటాయించిన ఇళ్ళలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. త్వరలో నే మీకు ఆహార ఏర్పాట్లు చెయ్యబడతాయి. యేమైనా మీలో ఇద్దరిని యేలాంటి గొడవలూ లేకుండా మీ ప్రాయశ్చిత్తానికి వదిలినందుకు మాకు సంతోషంగా వుంది...."

అలా చెప్పగానే నాయకుడు ఆండ్రూస్‌ను తీసుకుని కపాలీ విగ్రహం దగ్గరకు వెళ్ళాడు.

వంకీ కత్తితో నాయకుడి తలను తెగ నరకాలనే కోరిక కలిగింది భారత్‌కి....

ఏం చెయ్యటానికీ ఈ దీవి టకారాజాతి వాళ్ళది....

ఎదిరించి ప్రాణాలు పోగొట్టుకోవటం అవివేకం.... వాళ్ళ మూఢనమ్మకాలమీద నే తను బలమైన దెబ్బ కొట్టాలి....

మరోసారి ధగధగ మెరుస్తున్న ఆ మణిని చూసి తన వాళ్ళందరితో తమకు కేటాయించిన మైదాన ప్రదేశంలో వున్న ఇళ్ళవైపు నడిచాడు భారత్.

స్టెల్లా కూడా ఆ సమయంలో ఏమీ మాట్లాడటానికి

సాహసించలేకపోయింది. ఆమెకీ సిగ్గుగానే వుంది. చేతులారా తమలో ఇద్దరు స్త్రీలను బలిపశువులుగా ఆ మొరటు వాళ్ళకు అప్పగించారు.

ఎలాగైనా ఇందుకు తగిన ప్రతీకారం తీర్చుకోవాలి.

అంతా ఒకే యింట్లోకి వెళ్ళారు.

ఆకులతో వేసిన ఆ ఇళ్ళలో చల్లగానే వుందికాని వాళ్ళందరి గుండెలూ అవమానంతో, క్రోధంతో, పౌరుషంతో భగభగమని మండుతున్నాయి. వేడి సెగలను చిమ్ముతున్నాయి.

అంతా నిశ్శబ్దం .... భయంకరమైన నిశ్శబ్దం .... తేరుకోలేని దెబ్బ తగిలినప్పుడు అలముకునే నిశ్శబ్దం....

ఒక్కొక్కరి గుండె ఒక్కో కొలిమిలా వుంది. అందరిలోనూ ప్రతీకార జ్వాలలు చెలరేగుతున్నాయి.

టకారాలు తమకు శత్రువులు.

శత్రువులు, ఆతిథ్యం ఇచ్చి వెన్నుపోటు పొడిచిన నమ్మకద్రోహులు.

ఉన్నట్టుండి డప్పుల మోత—దానితో పాటు సందడి కోలాహలం మొదలయ్యింది. అరుపులు — చిత్రమైన అరుపులు.

డప్పుల మోత నిమిష నిమిషానికీ తీవ్రస్థాయి నందుకుంటోంది. కపాలీ దేవత యెదుట ప్రాయశ్చిత్త కార్యక్రమం జోరుగా సాగుతోంది.

ఒకే ఒక్క క్షణం....

డప్పుల మోత హెచ్చుస్థాయికి వెళ్ళిపోయి ఒక్కసారి ఆగిపోయింది. సరిగ్గా అప్పుడే వాళ్ళందరికి విని

పించాయి వరుసగా రెండు ఆర్తనాదాలు .... మృత్యు కేకలు....

* * *

ఒకవైపు మూఢాచారాలతో తిలలు నరుకుతున్నా అతిథి మర్యాదలకు మాత్రం యెలాంటి లోపం జరగనివ్వ లేదు ఆ టకారాజాతి వాళ్ళు.

నల్లమృగం మాంసాన్ని విస్తళ్లలో పెట్టి పంపించారు. కాని వాళ్ళెవ్వరికీ ఆహారం సహించలేదు. కళ్ళముందు ఆ స్త్రీలు ప్రాణభయంతో విలపిస్తున్న దృశ్యమే కన పడింది.

ఎవరూ ఆ మాంసాన్ని ముట్టుకోలేదు.

భారత్ అన్నాడు. "నిజమే. ఇలాంటి పరిస్థితుల్లో యెంత రుచికరమైన ఆహారాన్నైనా మనం తినలేము. కాని మనం ఒక విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఆహారాన్ని తీసుకోక తప్పదు. ఈ రోజు జరిగిన ఈ ఘోరమైన సంఘటనతో మనం ఇంకొక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యకుండా ఈ రాక్షసుల మధ్యనించి వెళ్ళి పోయే ప్రయత్నాలను చెయ్యాలని అర్థమయింది. లేక పోతే ఏదో ఒక నెపంతో మనల్నికూడా వంకీ కత్తులతో నరికివేయవచ్చు. మనకు ప్రతిక్షణం ప్రమాదమే.

నాకు ఒక సందేహం వుంది. ఆండ్రూస్ కూడా ఈ జాతి మనుషులతో చేరిపోయి నాటకం ఆడుతున్నా డేమోనని. అందుకోసమే ఆతిథ్యం పేరుతో మనల్ని ఇలా రుచికరమైన మాంసంతో మేపి చంపుతారేమో అనిపిస్తోంది. కాబట్టి ఈ పరిస్థితులను ఎదుర్కోవాలంటే శారీరకంగా మనం బలంగా ఉండాలి. అందుకోసం ఇప్పుడు ఈ నల్లమృగం మాంసాన్ని తీసుకోక తప్పదు.

దయచేసి అంతా తీసుకోండి."

భారత్ మాటలను సెల్లా సపోర్టు చేసింది. ఆ జాతి వాళ్ళకు ఆ భాష తెలియదు కాబట్టి అప్పుడప్పుడు ఆ మనుషులు అక్కడకు వస్తున్నా పెద్దగానే మాట్లాడు కున్నారు.

అందరికీ భారత్ మాటల్లో వున్న నిజం అర్థమయ్యింది. అవును. దీవినించి పారిపోవటానికి తగిన బలం వుండాలి. ఆ సమయంలో ఆటవికులు దాడిచేస్తే ఎదుర్కొనేందుకు శక్తి కావాలి. అందుకోసమైనా ఇష్టంలేకపోయినా ఆహారాన్ని తీసుకోక తప్పదు.

అలా అనుకున్న తర్వాత అంతా నల్లమృగం మాంసాన్ని భుజించారు.

గూడెంలో సందడి సద్దుమణిగింది.

సముద్ర తీరానికి వెళ్ళటానికి అంతా లేచి నిల్చున్నారు. బహుశ నాయకుడుకాని జాతి మనుషుల్లో యెవరైనా తమని ఎక్కడికి వెళుతున్నారని అడగొచ్చు.

వాళ్ళకి ఎలా చెప్పాలి.

తమని అనుమానించి వెంట వస్తారేమో!

ఇలాంటి సందేహంతో సతమతమవుతున్నప్పుడు వంకీ కర్ర సాయంతో చిన్నగా అడుగులు వేస్తూ అంద్రూస్ అక్కడకి వచ్చాడు. ఆయన పక్కనే యెవరూ లేరు.

ఆయన్ని చూసి అంతా బిగుసుకుపోయినట్టు కూర్చున్నారు.

అంద్రూస్ ఒక్కసారి అందరి మొహాల్లోకి అదోలా చూశాడు. ఆయనకు అర్థమయ్యింది వాళ్ళంతా తనమీద బాగా కోపంతో ఉన్నారని.... .

తెల్లగా నెరిసిన గడ్డాన్ని దువ్వుకుంటూ అందరినీ

చూస్తూ "నాకు తెలుసు. మీ దృష్టిలో సాటి నాగరికుడినై ఉండి కూడా ఆ ఇద్దరు నాగరిక స్త్రీలను రక్షించలేకపోయానని మీ అందరికీ నామీద కసిగా ఉంటుందని నాకు తెలుసు. కాని నిజం మీకు తెలీదు. భారత్ ... ఇంతకుముందు నీతో చెప్పానుకదా! నాకూ ఇలాంటి అన్యాయమే జరిగిందని.... అందులో అసత్యం ఏదీ లేదు. నామీద మీకు కలిగిన అపోహను తొలగించుకోవటంకోసమైనా ఇప్పుడు మీకు నా చరిత్రను చెప్పక తప్పదు" అంటూ ఆగిపోయి మళ్ళీ అందరినీ చూశాడు.

అంతా ఆంద్రూస్ నే చూస్తున్నారు. ఆయనకూ కూడా ఏదో ఒక కథ వుందని అంతా అనుకున్నారుకాని అది ఇలాంటి కథ అయివుంటుందని వాళ్ళు అనుకోలేదు.

తిరిగి మొదలుపెట్టాడు ఆంద్రూస్ —

"బ్రిటిషిన్ నౌకలో ఉద్యోగిని ఒకప్పుడు ... నా జీవితం సంతోషంగా గడిచిపోతూ ఉండేది. భార్య ఇద్దరు పిల్లలు. సుఖమైన సంసారం. ఒకసారి ఓడలో సముద్రంమీద ప్రయాణంలో ఉన్నప్పుడు పెను తుఫాను వచ్చింది. ఆ తుఫాను నా జీవితాన్ని యిలా చీకటిగా మార్చి ఈ దీవిలో ఓ అనాగరికుడిగా బతికేలా చేస్తుందని ఆ క్షణంలో ఊహించలేకపోయాను.

తుఫాను తాకిడికి ఓడ తట్టుకోలేకపోయింది. బలమైన సముద్రపు అలలు ఓడను ముక్కలు చేశాయి. అంతా సముద్రంపాలు అయిపోయాం. స్పృహ కోల్పోయిన స్థితిలో ఎవరికి దొరికిన ఆధారంతో వాళ్ళు ఈ టకార దీవికి చేరుకున్నాం.

మొత్తం ముగ్గురం. మిగిలిన యిద్దరూ నాకు మంచి స్నేహితులు. ప్రాణాలతో బయటపడ్డందుకు సంతోష

పద్దాంశాని ఈ దీవి స్వరూపం చూడగానే దిగులు కలిగింది. ఇక్కడినించి బయటపడటం సాధ్యంకాదేమో అనిపించింది. ఐనా ప్రయత్నం చెయ్యాలని అనుకున్నాము.

చెట్ల మధ్యనించి ఆహారంకోసం నడుస్తున్నప్పుడు వెనుకనించి వచ్చిన నీలిరంగు పాము నా స్నేహితుడిని ఒకడిని కాటువేసింది. వాడు నిమిషాలమీద ప్రాణాలు వదిలాడు. ఆ నీలిరంగు పాము కాటుకు ఇక తిరుగులేదని తర్వాత తెలిసింది. మరణించిన స్నేహితుడి శవాన్ని ఆ చెట్లమధ్యనే పాతిపెట్టి వెనక్కి తిరిగిన మమ్మల్ని ఈ టకారాజాతి మనుషులు చుట్టుముట్టారు. వాళ్ళ భాషలో ఏదో అన్నారు. మాకు అర్థంకాలేదు. మమ్మల్ని తీసుకు వెళ్ళి కేవలం సైగలతోనే అసలు విషయాన్ని చెప్పారు.

అదే మరణించిన మనిషిని ఆ దీవిలో పాతిపెట్ట కూడదు. అందుకు ప్రాయశ్చిత్తం చెయ్యాలి. ఇద్దరికంటే ఎక్కువమంది మనుషులంటే ఇద్దర్ని — ఇద్దరే వున్నప్పుడు వారిలో ఒకర్ని తల నరుకుతారుట. ఎవర్ని చంపాలో నిర్ణయించుకోమన్నారు. ఆ విషయం తెలియగానే నా స్నేహితుడు ఏడ్చాడు. చివరికి వాళ్ళే ఈ మెడపొడుగు జంతువును మా దగ్గరకు వదిలారు.

ఆ రోజున కూడా ఇలాంటి కోలాహలమే. ఆ జంతువు నా స్నేహితుడి దగ్గరకు వచ్చి నిల్చుండిపోయింది. వాడిని పట్టుకొని వద్దని యెంత ప్రాధేయపడినా వినకుండా ఎంతో కర్కశంగా, నిర్దయగా వాడి తల నరికి ప్రాయశ్చిత్తాన్ని చేశారు. నేనెంతగానో విలపించాను. చివరికి ఒంటరివాడినై పోయాను.

ఈ దీవినించి ఈ మొరటు మనుషుల మధ్యనించి దూరంగా పారిపోవాలని నేను చేసిన ప్రయత్నాలన్నీ

వృధా ఐనాయి. ఈ టకారాలు నన్ను వదలేను. అను క్షణం వెన్నంటి తిరిగారు. విధిలేక నేను ఈ దీవిలో జీవచ్ఛవంలా బతకటం నేర్చుకున్నాను. నా భార్య—పిల్లలు యెలా వున్నారో—ఏమైపోయారో తెలీదు. వాళ్ళందరూ గుర్తుకు వచ్చి రోజూ రాత్రిళ్ళు ఏడుస్తూ వుండేవాడిని. ఎన్ని రాత్రులూ యేడ్చినా ప్రయోజనం ఏమిటి? చివరకు గుండె రాయి చేసుకుని ఇలా జీవితాన్ని వెళ్ళదీస్తున్నాను.

ఇప్పుడు చెప్పండి. ఇలాంటి చరిత్ర వున్న నేను మీకు సహాయపడకుండా వుండాలని అనుకుంటానా? కాని ఈ నాయకుడి గురించి మీకు తేలీదు. వీళ్ళెంత క్రూరమైన మనుషులో నాకు తెలుసు. అన్నీ తెలిసినవాడిని కాబట్టే నేనిలాంటి సాహసాన్ని చెయ్యలేకపోయాను."

తన కథను ముగించాడు.

ఆంద్రూస్ కథ వినగానే అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఆంద్రూస్ ఇన్ని కష్టాలను ఎదుర్కొని ఈ దీవిలో ఏకాకిగా బతుకుతున్నాడా?

ఆ మవునాన్ని ఛేదిస్తూ "డియర్ ఫ్రెండ్స్....కాబట్టి ఇప్పటికైనా నన్ను అర్థం చేసుకోండి. ఈ టకారాజాతి వాళ్ళమీద నాక్కూడా పగ వుంది. నేను యెన్నో యేళ్ళుగా అవకాశంకోసమే ఎదురుచూస్తున్నాను. కాని ఇన్ని రోజులకు నాకు ఆ అవకాశం మీ అందరి రూపంలో వచ్చింది. మీలో ఇద్దరు స్త్రీలను యెంతగా చెప్పినా వినకుండా ప్రాయశ్చిత్తం పేరుతో బలి ఇచ్చిన తర్వాత నా నిర్ణయం మరింత బలపడింది. ఈ టకారాలను దెబ్బ తీయాలి.

ఐతే శారీరకంగా వీళ్ళతో తలపడి వాళ్ళని మనం

జయించగలటమనేది అసాధ్యమైన పని. బల్లెలు విసరటంలో ఈ జాతివాళ్ళు బాగా నేర్పరులు. బలంలో మనకంటే యెన్నో రెట్లు యెక్కువ. కాబట్టి మనం వాళ్ళతో పోరాడి జయించలేము. ఇక మనం ఈ జాతి వాళ్ళను దెబ్బ తీయటానికి ఒక్కటే మార్గం మిగిలివుంది. మూఢనమ్మకాలమధ్య బతుకుతున్న వాళ్ళను ఆ నమ్మకం మీదనే మనం చావు దెబ్బకొట్టాలి."

అంతవరకూ ఆవేశంగా చెప్పి ఆగిపోయి అందరి మొహాలనూ చూశాడు ఆండ్రూస్.

"అందుకు మేమంతా ఏం చెయ్యాలి?" ఆత్రంగా అడిగారు అంతా....

వాళ్ళ ఉత్సాహాన్ని, ఆరాటాన్ని చూసి "కపాలీ దేవత హారంలో వున్న ఆ మణిని కాజెయ్యాలి" అని చెప్పాడు.

ఆ మాటతో మిగిలిన అందరితోపాటు భారత్ — సెల్లాలు కూడా ఆశ్చర్యపోయారు. ఎందుకంటే ఆండ్రూస్ అలాంటి ఆలోచనను చెబుతాడని ఏమాత్రం వూహించనే లేదు.

ఈ ఆలోచన భారత్‌కు ఆ పరిస్థితుల్లో కూడా సంతోషాన్నే కలిగించింది.

"తప్పదు. మీరంతా కలిసి ఆ మణిని కాజెయ్యాలి. ఎందుకంటే ఆ మణి టకారజాతివాళ్ళ ఆరో ప్రాణం. ఎన్నో తరాలనించీ ఆ మణి కపాలీ దేవత హారంలో ప్రకాశిస్తూ వస్తూందట. ఆ మణి ఆ దేవత మెడలోలేని రోజు నించీ ఆ జాతిని అకాల మృత్యువు వెంట తరిమి టకారా జాతి అంతా పూర్తిగా అంతరించిపోతుందని ఈ టకారాల ప్రగాఢమైన విశ్వాసం. అందుకే మనం ఆ విశ్వాసం

మీద దెబ్బతీసి వాళ్ళు ప్రాణ భయంతో విలవిల్లాడి పోయేలా చెయ్యాలి....ఏమంటారు?"

భారత్ అన్నాడు "మీరు చెప్పినదంతా మాకు నచ్చింది. శారీరకంగా ఇప్పుడు వున్న పరిస్థితుల్లో ఎదుర్కొని విజయం సాధించటం సాధ్యంకాదని మాకూ తెలుసు. అందువల్ల మీరు చెప్పినట్టుగా ఆ మణిని కాజేసి టాకారాలకు మృత్యుభయం కలిగిస్తాం. కాని ఇందుకు కొన్ని ఇబ్బందులు వున్నాయి కదా .... మీరు వాటి గురించి చెప్పలేదు."

"ఏమిటా ఇబ్బందులు?" ఆంద్రూస్ అడిగాడు.

"ఆ మణిని కాజెయ్యటం ఎలా సాధ్యమవుతుంది? పగటివేళ సూర్యకాంతిలో, రాత్రి వేళ కాగడాల వెలుగులో ఆ మణి ఎర్రని కాంతులను వెదజల్లుతూ వుంటుంది కదా!"

నవ్వాడు ఆంద్రూస్.

"ఇందుకు తగిన సమయం ఎప్పుడో నేనే చెబుతాను. ఈ టకారా దీవిలో ఒక ఆచారం వుంది. అమావాస్య రోజు రాత్రి దీవిలో యెక్కడా యెటువంటి పరిస్థితుల లోనూ ఒక్క కాగడా కూడా వెలగదు. అమావాస్య రాత్రి కపాలీ దేవత దీవిలో సంచరిస్తుందని వీళ్ళ నమ్మకం. అందుకే ఆ రాత్రి యెక్కడా వెలుగు వుండ కూడదట. ఆ రోజు సూర్యాస్తమయానికే రాత్రి ఆహారాన్ని కూడా వండుకుని సిద్ధం చేసుకుంటారు. అమావాస్య రాత్రి దీవి మొత్తం చీకట్లో మునిగిపోయి వుంటుంది. ఆ చీకట్లోనే మీరు ఆ మణిని దొంగిలించాలి."

ఆ విషయం విన్న తర్వాత భారత్ కు అంతులేని సంతోషం కలిగింది. ఆ మణిని యెలాగైనా కాజెయ్యా

లనే ఆలోచన తనకు యెప్పుడో కలిగినా యెలా కాజెయ్యాలో తెలీక ఉండిపోయాడు. ఇప్పుడు ఆండ్రూస్ అందుకు తగిన పథకాన్ని చెప్పాడు.

"బావుంది ఆండ్రూస్....మణిని కాజెయ్యటం వరకు బాగానే వుంది. కాజేసిన తర్వాత మేము ముందు ఈ దీవినించి బయటపడటం ఎలా?" స్టెల్లా అడిగింది.

"ఈ ప్రశ్నను మీరు కావాలని అడుగుతున్నారు. నిన్న ఉదయం దీవి లోపలకు వెళ్లారు. మీరు సముద్ర తీరాన్ని చూడకుండానే వెనక్కి వచ్చి వుంటారా? సముద్రాన్ని తీరంలోనే ఉన్న ఆ చెట్లను చూసినప్పుడు వాటిని నరికి తెప్పలు తయారు చేసుకోవాలనే ఆలోచన మీకు నిజంగానే రాలేదా మిస్టర్ భారత్" అని అడిగాడు.

షాక్.. షాక్....

ఒక్కసారిగా అంతా అదిరిపడి ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

ఈ విషయం ఆండ్రూస్‌కు ఎలా తెలిసింది?

ఎవరు చెప్పారు?

ఊహు....ఎవరూ చెప్పే అవకాశమే లేదు. తెప్పలను తయారుచేస్తున్నప్పుడు రహస్యంగా చూసిన టకారాజాతి మనిషిని అప్పుడే పులి చంపి తీసుకుపోయింది.

మరి అలాంటప్పుడు ఆండ్రూస్ అంతా పూర్తిగా తెలిసినవాడిలా యెలా మాట్లాడుతున్నాడు?

ఆండ్రూస్ దగ్గర ఏవైనా దివ్యశక్తులున్నాయా?

తిరిగి నవ్వాడు ఆండ్రూస్ — "అంతా మవునం వహించారేమిటి? మాట్లాడండి. నిజంగా మీకు ఈ దీవి నించి సముద్రంమీదగా యెలా ప్రయాణం చెయ్యాలో

తెలిసింది కదూ?"

ఇక ఈ దాగుడుమూతలు అనవసరం అనిపించింది భారత్ కి. అందుకే—

"మిష్టర్ ఆంద్రూస్....మీరు ఊహించింది నిజమే... ఇప్పటివరకూ మీరు కూడా ఈ టకారాజాతి మనుషుల పక్షమే అన్న అభిప్రాయంతోనే మీకు ఈ విషయాన్ని చెప్పకుండా దాచివుంచాము. నిన్న మేము అందరం సముద్ర తీరానికి వెళ్లాం. అప్పుడే చెట్లు నరికి తెప్పలు తయారుచేసుకుని వాటితో సముద్రంమీద ప్రయాణం చెయ్యాలనే ఆలోచన వచ్చింది. అందుకే చెట్లు నరికి తీగలు తెంచి వాటితో కొన్ని తెప్పలను తయారుచేశాం. కాని మేము వాటిని తయారు చెయ్యటం ఈ జాతి మనిషి ఒకడు చూసి వెనక్కి తిరిగాడు గూడేనికి రావటానికి. కాని సరిగ్గా అప్పుడే ఓ పులి అతడిమీద దాడిచేసి అతడిని గాయపరిచి చంపి నోట కరుచుకుని పారిపోయింది."

ఆంద్రూస్ కళ్లు పెద్దవిచేసి "ఐతే ఆ టకారా పులి వాత పడ్డాడా?" అనడిగాడు.

"అవును."

"అతడిని పులినించి కాపాడే ప్రయత్నాలు మీరు చెయ్యలేదు కదూ?" అడిగాడు ఆంద్రూస్.

మరోసారి ఉలిక్కిపడ్డారు వాళ్ళు.

ఆంద్రూస్ గొప్ప జీనియస్ అనిపించాడు.

"నిజమే. అతడిని కాపాడే ప్రయత్నంకూడా మేము చెయ్యలేదు. ఎందుకో మీరు ఊహించగలరనుకుంటాను. అతను మా గురించిన ఓ రహస్యాన్ని తెలుసుకున్నాడు. అతడు బతికివుంటే ఆ రహస్యం అందరికీ తెలిసిపో

తుంది."

తల వూపాడు ఆంద్రూస్.

తర్వాత "ఇప్పుడు మీ సందేహాలన్నీ క్లియర్ అయినా యనుకుంటాను. ఆ మణిని కాజెయ్యటంతో టకారాలను దెబ్బతియ్యటమే కాకుండా ప్రపంచ మార్కెట్లో ఎన్నో కోట్లు విలువచేసే ఆ మణి మీ సొంతమవుతుంది. మీరు సురక్షితంగా బయటపడి వెళ్ళగలిగితే ఆ మణిని అమ్మటం ద్వారా యెంతో ధనాన్ని మీరు సంపాదించుకోగలరు. ఇక మీరు ఈ దీవినించి పారిపోవటానికి అవసరమైన తెప్పలను తయారు చేసుకోండి. అమావాస్య రోజు రాత్రి ఆ మణితో ఈ దీవిని వదిలి వెళ్ళిపోవటానికి సిద్ధంగా ఉండండి" అన్నాడు.

"మేము బల్లేలతో. వంకీ కత్తులతో దీవి లోపలకు వెళుతుంటే ఈ టకారాలకు అనుమానం రాకుండా వుంటుందా? వాళ్ళు మమ్మల్ని వెంటాడకుండా వూరు కుంటారా?" స్టెల్లా అడిగింది.

"అనుమానం రాకుండా మిమ్మల్ని వెంటాడకుండా ఉండేట్టు నేను చూస్తాను. ఎలాగంటే ఇక మీరంతా ఈ దీవినించి బయటకు వెళ్ళే మార్గంలేదని గ్రహించి ఏడు రోజుల తర్వాత మీ ఆహారాన్ని మీరే వేటాడి సంపాదించుకోవాలి కాబట్టి ఇప్పటినించే నల్లమృగాల వేటకు బయల్దేరుతున్నారని, వేటను అలవాటు చేసుకుంటున్నారని నాయకుడితో మిగిలిన టకారాలతో చెబుతాను. అప్పుడు వాళ్ళు మిమ్మల్ని అనుమానించరు. పైగా సంతోషిస్తారు. ఎందుకంటే నాగరికులను కూడా అనాగరికులుగా మార్చి ఈ దీవిలో బందీలుగా చెయ్యటం అంటే వీళ్ళందరికీ యెంతో ఇష్టం. అందుకు ప్రత్యక్ష నిదర్శనం-

నే నే."

ఆయన కళ్ళల్లో నీళ్లు తిరగటాన్ని వాళ్ళు చూశారు. ఆండ్రూస్ బాధపడుతున్నాడని గ్రహించారు.

"క్షమించండి ఆండ్రూస్. మిమ్మల్ని మేమంతా అపార్థం చేసుకున్నాం. కాని మీరు కూడా ఈ టకారాలవల్ల ఎంతో జీవితాన్ని నష్టపోయారని తెలిసినప్పుడు నిజంగా మా గుండె ద్రవించింది. దురదృష్టవశాత్తు తమ దీవిని చేరిన నాగరిక మనుషులను ఈ టకారాలు ఎంత హింసకు గురిచేస్తున్నారో అర్థమయ్యింది. తప్పకుండా ఈ టకారాలమీద పగతీర్చుకోవలసిందే. అందుకు మీరు చెప్పిన పథకం ప్రకారమే ఆ మణిని మా హస్తగతం చేసుకుంటాం. కాని నాదో రిక్వెస్టు .... మీరు కూడా మాతోపాటుగా ఈ దీవిని వదిలి వచ్చెయ్యండి" భాగత్ అన్నాడు.

బలహీనంగా నవ్వాడు ఆండ్రూస్.

నవ్వి "వద్దు....ఇక నాకు జీవితంమీద విరక్తి కలిగింది. ఇన్నేళ్ళు జీవచ్ఛవంలా ఇక్కడ బతికాను. ఇప్పుడు అదృష్టవశాత్తూ సురక్షితంగా నాగరిక ప్రపంచంలో అడుగుపెట్టగలిగినా నాగరికుడుగా బతకలేనేమోనని అనుమానం కూడా నాలో వుంది. ఈ పారిపోవటంలో యెదురయ్యే ఒడుదుడుకులను కష్టనష్టాలను కూడా ఎదుర్కొగల శక్తి నాలో లేదు. అందుకే మీరు వెళ్ళండి. నన్ని బందిఖానానించి బయటకు రమ్మని కోరినందుకు థాంక్స్....

ఇప్పటికే చాలా పగలు గడిచింది. ఇక మీరు బయలుదేరండి. తెప్పలు తయారుచేసుకుని పొద్దు వాలిపోయే సమయానికి తిరిగి రండి. టకారాలకు 'నమ్మకం కలిగించ

టానికై ఏవైనా రెండు జంతువులను వేటాడి తీసుకు రండి. చివరికి ఓ కుందేలునైనా సరే. నేను ఎక్కువసేపు మీతో మాట్లాడటం నాకు మీ అందరికీ కూడా క్షేమం కాదు. వెళ్లొస్తాను. వెంటనే బయల్దేరండి" అని అక్కడినించి వెళ్ళిపోయాడు.

ఆండ్రూస్ వెళ్ళటంతోనే ఒక్కసారిగా అంతా భారంగా నిట్టూర్చాడు.

•  •  •

చీకటి—మామూలు చీకటి కాదు. కన్ను పొడుచుకున్నా కనుపించని చీకటి—

గాంఢాంధకారం.

టకారాదీవి సంతటినీ నల్లటి తెరలు ఏవో కప్పివేసినట్టుగా వుంది.

గాలి రివ్వున వీస్తోంది.

అమావాస్య చీకటి.

ఆ రాత్రికోసమే భారత్ బృందం ఈ నాలుగు రోజులనించీ ఎదురుచూస్తోంది. ఎదురుచూస్తున్న రాత్రి రానే వచ్చింది. అంతా ఇళ్ళ బయట కూర్చున్నారు.

చీకట్లో వాళ్ళు దయ్యాల్లా వున్నారు.

ముఖ్యమైన వస్తువులను ఎవరి దుస్తుల్లో వాళ్ళు దాచుకున్నారు. చిన్నగా మాట్లాడుకుంటున్నారు.

భారత్-సెల్లాలు వాళ్ళందరినీ ఉత్తేజపరుస్తున్నారు. టకారాజాతి వాళ్ళు తమకు చేసిన ద్రోహానికి తగిన ప్రతీకారం తీర్చుకోక తప్పదనే విషయాన్ని పదేపదే హెచ్చస్తున్నారు.

సూర్యాస్తసమయం జరుగుతున్నప్పుడే టకారాజాతి మనుషులు వాళ్ళందరికీ ఆహారాన్ని తీసుకొచ్చి పెట్టారు.

తింటున్నప్పుడు నాయకుడు — ఆంద్రూస్‌తో అక్కడకు వచ్చాడు.

కిచకిచలతో ఆంద్రూస్‌తో యేదో చెప్పాడు.

ఆంద్రూస్ వాళ్ళందరినీ కలియజూస్తూ "ఈ దీవి ఆచారం ప్రకారం ఈ రాత్రి ఈ దీవిలో యెక్కడా కాగడాలు వెలిగించడం జరగదు. ఆ విధంగా కాగడాలను వెలిగించటం గొప్ప అపచార మవుతుంది. ఈ రాత్రి కపాలీ దేవత దీవిలో సంచరిస్తుంది. వెలుగు చేసి ఆమెకు ఆగ్రహం కలిగిస్తే వాళ్లు హతమైపోతారు. ఇది నాయకుడి ఆజ్ఞ" అంటూ ముగించాడు.

అప్పటికి సూర్యుడు పూర్తిగా దిగిపోయాడు.

చీకటి నీడలు నెమ్మదిగా పరుచుకుంటున్నాయి.

నాయకుడు మళ్ళీ ఏదో చెప్పిన వెంటనే ఆంద్రూస్ మొహంలో ఎటువంటి భావాలనూ కనపడనీయకుండా అందరినీ ఉద్దేశించి "అనుకున్న పథకం ప్రకారం మణితో ఈ దీవి వదిలి వెళ్ళటానికి అన్ని ఏర్పాట్లతో సిద్ధంగా వున్నారుకదా! జాగ్రత్త, టకారజాతిమీద పగ తీర్చుకోండి....ఇంతకీ నాయకుడు మిమ్మల్ని జాగ్రత్తగా యిళ్ళలో పడుకొని నిద్రపొమ్మని చెబుతున్నాడు. ఇక వెళతాం....నాయకుడికి అనుమానం వస్తుంది. విష్ యు ఆల్ సక్సెస్ మైడియర్ ఫ్రెండ్స్" అని నాయకుడితో అక్కడినించి వంకీ కర్ర సాయంతో గడ్డం సవరించుకుంటూ వెళ్ళిపోయాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళగానే స్టెల్లా అన్నది—

"ఆంద్రూస్ మనస్తత్వం చాలా చిత్రంగా వుంది. టకారాలమీద ఇంతటి కసి, ప్రతీకారం వున్న మనిషి— మనతో చేతులు కలిపినట్టుగానే ఈ దీవి వదిలి మనతో

వచ్చే ప్రయత్నం చెయ్యవచ్చుకదా! జీవితంమీద విరక్తి కలిగిందంటూ ఈ దీవిలోనే జీవచ్ఛవంలా బతకటం యెందుకు?" అన్నది.

"ఎందుకో మనకు తెలీదు. బహుశ అంద్రూస్ ఈ విధమైన అనాగరిక జీవితానికి అలవాటుపడిన మాట నిజమే ఐవుండొచ్చు. ఇన్నేళ్లుగా యిలాంటి జీవితాన్ని అనుభవిస్తూ వచ్చిన తర్వాత సహజంగా ఎప్పుడో మరచిపోయిన నాగరిక జీవితాన్ని తిరిగి ప్రారంభించాలంటే భయంగానే ఉండొచ్చు. ఏమైనా ఆ అనుభవం, ఆ భయం అనేది అనుభవించిన వాళ్ళకే తెలుస్తుంది. మనం ఊహించటానికి వీలులేనిది."

భారత్ మాటల్లో సెల్లాకు సరయిన రీజనింగే కనపడింది.

ముసలాయన వున్నట్టుండి అన్నాడు "నాకేమిటో భయంగా వుంది. ఈ కటిక చీకట్లో మనందరం ఒకరికొకరం తెలిసిన మనుషులమే ఐనా ఒకర్నొకరు చూసుకుంటుంటే ఏదో తెలియని భయం కలుగుతోంది. అలాంటప్పుడు ఈ రాత్రిలో చీకటి యింకా చిక్కబడిన తర్వాత క్రూరమృగాలు, ముళ్ళ పొదలు, కత్తుల చెట్ల మధ్యనించి సముద్ర తీరానికి పారిపోవాలనుకుంటే నాకు సాధ్యంకాదేమో అనిపిస్తోంది."

వెంటనే సెల్లా అన్నది.

"ఇలా భయపడినందువల్ల కొంచెంకూడా ప్రయోజనం లేదు. భయపడి చెయ్యగలిగిందికూడా ఏమీలేదు. ఎందుకంటే, భయపడి మనం ఈ దీవిలోనే శాశ్వతంగా వుండిపోవాలని అనుకోవటం లేదుకదా? ఈ దీవిలోకూడా మనకు రక్షణలేదు. రక్షణ వుంటుందనుకున్నా ఇక్కడ

మనం వుండలేము. చివరకు మనం ప్రాణాలకు తెగించే ఈ నిర్ణయం తీసుకున్నాం. ఇప్పుడు మనం భయపడటం అవివేకమే అవుతుంది."

ఓల్డు మేన్ కి సెల్లా మాటలకు కోపం వచ్చింది.

"అవివేకం....ఇలా అనటం చాలా ఈజీగానే వుంటుంది. మీరంతా యువకులు. ఎంతటి సాహసానికైనా తెగించగలరు ... కానీ నేను ఓల్డు ఫెలోని. అందుకే ప్రాణభయంతో ప్లేన్ లో ఆ దొంగలకు నా దగ్గర ఉన్నవన్నీ వాళ్ళు అడక్కముందే తీసి యివ్వబోయాను. కాని మీరు చేసిందేమిటి? తర్వాత యెదురవబోయే ప్రమాదం గురించి ఆలోచించకుండా వాళ్ళమీద కాల్పులు జరిపారు. దాని ఫలితం ఏమిటి? ఇప్పుడు మనమంతా యిలా ఈ దీవిలో చిక్కుకుపోయి ప్రాణ భయంతో తన్నుకుంటున్నాం. ఇందుక్కారణం ఎవరు? మీరే.... మీ యిద్దరివల్లనే యిలా జరిగింది?"

సెల్లా—భారత్ ఒకరినొకరు చూసుకున్నారు.

దీవినించి పారిపోదామని అనుకుంటున్న చివరి క్షణాల్లో ఓల్డు మేన్ యిలా మాట్లాడటం వాళ్ళకు బాగా యిబ్బంది నే కలిగించింది. ఇంతకుముందు అక్కడ ఉన్న మిగిలిన మనుషుల్లో కూడా ఈ కష్టాలన్నింటికీ కారకులు వాళ్ళిద్దరే అనే ఆలోచన వున్నా వాళ్ళెవరూ బయట పడలేదు. ఎందుకో కాదు, అలా బయటపడినందువల్ల ఏమీ ప్రయోజనంలేదు. జరిగిందేదో జరిగింది. అంతే....

భారత్ అన్నాడు యెంతో శాంత స్వరంతో—

"డియర్ సర్ ....యిలాంటి ప్రమాదం జరగాలని మనందరం ప్రాణభయంతో తన్నుకు చావాలని మేము ఆ దొంగలమీద కాల్పులు జరపలేదు. మన సంపదను

వాళ్ళు దోచుకుంటున్నారని వాళ్ళని ప్రతిఘటించాం. కాని దురదృష్టవశాత్తూ యిలా జరిగింది. జరిగిందానికి కారకులు యెవరు? వాళ్ళని నిందించాలి అనుకోవటంవల్ల ఇప్పుడు మనకు వచ్చేదేమిటి? దయచేసి మీ మనసులో ఆలోచనను తరిమెయ్యండి..మనం తీసుకున్న నిర్ణయంలో మార్పు ఉండకూడదు. చావైనా బతుకైనా మనందరం కలిసే అనుభవిద్దాం .. ప్లీజ్ కోఆపరేట్ విత జ్ ..."

"నా ఉద్దేశం అదికాదు మిస్టర్ భారత్ .... ఈ టకారాలమీద పగతీర్చుకునే విషయాన్ని మనం దూరంగా ఉంచితే ఇక మనకు ముఖ్యమైనది ఈ దీవినించి తెప్పల సాయంతో సముద్రంమీదికి వెళ్ళిపోవట మేకదా! అందుకు మనం ఈ రాత్రివేళనే వెళ్ళవలసిన అగత్యంలేదు. తెల్లవారిన తర్వాత నల్లమృగాల వేటకని బల్లేలతో, వంకీ కత్తులతో బయల్దేరి వెళ్ళి అక్కడనించి తెప్పలమీద పారిపోవచ్చు కదా?"

"నిజమే సర్. అలా చెయ్యొచ్చు. కాని టకారాలను చావుదెబ్బ కొట్టటంకూడా మన లక్ష్యాలలో ఒకటి. ఎందుకంటే వీళ్ళు మానసికంగా మనల్ని ఎంత దారుణంగా హింసించారో మనం ఇంకా మరచిపోలేదు. మన నాగరికుడైన ఆండ్రూస్‌నుకూడా ఈ జాతివాళ్ళు అనాగరికుడిగా, ఓ శిలగా మార్చేశారు. అందువల్ల మనం ఈ టకారాలను దెబ్బతీయాక తప్పదు.

దెబ్బతీయటమంటే వాళ్ళు ప్రాణాధికంగా, ఎంతో అపురూపంగా చూసుకుంటున్న ఆ కోట్లు విలువచేసే అపూర్వ మణిని మనం కాజేసి వెళ్ళటమే. మీరు చెప్పినట్టుగా మనం ఈ దీవి వదిలి బయటపడటమే ముఖ్య

ధ్యేయంగా పెట్టుకున్నప్పటికీ పగటివేళ అదికూడా అంత సులభమైనదని నాకు అనిపించటంలేదు. ఎందుకంటారా? ఎక్కడనించయినా టకారాలు మనల్ని గమనిస్తూ వుండొచ్చు. తెప్పలను సముద్రంమీదికి చేరవేస్తున్నప్పుడు చూశారంటే మనల్ని ప్రాణాలతో వదలరు. ఈ దీవి ఆచారం ప్రకారం దాన్ని ఒక గొప్ప నేరంగా ప్రకటించి ప్రాయశ్చిత్తంగా మనందరినీ నరికేస్తారు.

ఏ విధంగా చూసినా ప్రమాదం మనల్ని వెన్నంటి వుంటూనే వుంది. అటువంటప్పుడు ఆ సాహసాన్ని ఈ రాత్రికే చెయ్యగలిగితే టకారాలమీద పగ సాధించటంతో పాటు—కోట్లు విలువచేసే ఆ మణికూడా మన సొంతమవుతుంది."

ఆగాడు భారత్.

చీమ కదిలితే వినిపించేటంతటి నిశ్శబ్దం ఆ ప్రదేశాన్నంతటినీ ఆవరించుకుని వుంది.

అతడి మాటలు మిగిలిన వాళ్ళమీద బాగానే పని చేశాయి. అవును, చావుకు తెగించే ఈ సాహసానికి పూనుకుంటున్నారు. అలాంటప్పుడు భయపడటం ఎందుకు?

కొంచెం దూరంలో కనపడుతున్న పొడుగాటి చెట్లు రివ్వున వీస్తున్న గాలికి పిచ్చిగా వూగుతున్నాయి పూనకం వచ్చినట్టు.

అంతకుముందువరకు అప్పుడప్పుడు టకారాల కిచకిచలు వినిపించాయి. రాను రాను ఆ కిచకిచలు ఆగిపోయాయి. అంతా నిద్రాదేవి ఒడిలోకి వెళ్ళిపోతున్నారు.

అంతేకాదు. ఆ రాత్రి చీకట్లో కపాచీ దేవత ఆ దీవినంతటినీ తిరుగుతుందనే నమ్మకంకూడా వుంది కాబట్టి, రోజూకంటే ముందుగానే ఇళ్ళలో చీకట్లోపడి నిద్రపోవ

టానికి ప్రయత్నం చేస్తారు.

టకారాల నమ్మకాల గురించి తల్చుకుంటే స్టెల్లాకు అంతులేని నవ్వొచ్చింది.

ఇడియట్స్....

అన్నీ ఫూలిష్ సెంటిమెంట్స్....రాత్రివేళ—యింత చీకట్లో కపాచీ దేవత దీవిలో సంచరిస్తుందా?

ఎందుకు? ఏం చూడటానికి? టకారాలంతా క్షేమంగా వున్నారో, లేదో తెలుసుకోవటానికా!

పోనీ....వాళ్ళ ఆ బ్లయిండ్ నమ్మకమే ఈ రాత్రి ఆ విలువైన మణిని దోచుకొని పోవటానికి తగిన అవకాశాన్ని కల్పిస్తోంది.

తమ గుడ్డినమ్మకం కారణంగా తమకు తీరని నష్టం కలగబోతున్నదని వాళ్ళకు తెలీదు. కనీసం ఊహించలేరు కూడా.

ఇక ఆంద్రూస్....ఒక విచిత్రమైన మనిషి....జీవితంలో అందరినీ, అన్నిటినీ పోగొట్టుకుని కేవలం ముసలి బొమ్మలా వంకీ కర్రతో గూడెంలో నాయకుడి ఆజ్ఞలను శిరసావహిస్తూ తిరిగే ఓ వింత మనిషి....

ఏ వాతావరణానికి అలవాటుపడిన మనిషి ఆ వాతావరణాన్ని వదిలి బయటకు రాలేడు అని తెలుసుకోవటానికి ఓ గొప్ప నిదర్శనం ఆంద్రూస్.

నిమిషాలు దొర్లిపోతున్నాయి.

చలిగాలి వుండుండి ఉధృతంగా వీస్తోంది.

ఆకాశంలో నక్షత్రాల కాంతి మాత్రమే వుంది. ఆ కాంతిలో బాగా కళ్ళు పెద్దవిచేసుకుని నిశితంగా చూస్తేగానీ యేమీ కనపడటంలేదు. ఐతే చాలా సేపటినించీ చీకట్లోనే కూర్చుని చూస్తూ వుండటంతో—చీకట్లో

కూడా చూడటానికి కళ్ళు కొంచెం అలవాటుపడినాయి.

దూరంగా ఎక్కడో దట్టమైన అడవిలోయేమో!—యేవో మృగాల అరుపులు వినపడుతున్నాయి.

ఎక్కడో చెట్లమీద పక్షులు గోలగా అరుస్తున్నాయి.

ఆత్రంగా వుంది అందరికీ. ఇళ్ళ దగ్గర వున్న తమ వాళ్ళందరూ గుర్తుకు వస్తున్నారు. ఒక రకంగా ఇది అంతిమయాత్ర. ఈ సాహస యాత్రలో ఎన్నో గండాలను తప్పించుకుని బయటపడగలిగితే తమ దేశాలను చేరుకుంటారు. లేకపోతే ఈ దీవిలోనే షాంకీల్ లా ఆ ఇద్దరి స్త్రీలలా ప్రాణాలను పోగొట్టుకుంటారు. అంతే. ఎక్కడో పుట్టారు. చివరికి ఇక్కడ ఈ దీవంటూ ఒకటి వుందని యెవరికీ తెలియని దీవిలో కన్నుమూస్తారు.

ఆ దీవిలో జరిగిన సంఘటనలను—ఆండ్రూస్ అనుభవిస్తున్న నికృష్టపు జీవితాన్ని గుర్తుచేసుకుంటే వారిలో ఓ విధమైన తెగింపు కలిగింది.

చేతినున్న వాచీకేసి చూసుకున్నాడు భారత్.... అందులో టైమెంతయ్యిందో తెలీలేదు. ఎందుకంటే అది ఎప్పుడో ఆగిపోయింది. ఎందుకు ఆగిపోయిందో తెలీదు. మిగిలిన మనుషుల దగ్గరవున్న గడియారాలుకూడా ఆగిపోయాయి.

సిగరెట్లు యెప్పుడో ఐపోయాయి. సిగరెట్లు కాల్చకపోవటంవల్ల అదోలా వుంది.

అక్కడ వున్న నిశ్శబ్దాన్ని తెగ్గొడుతున్నట్టుగా భారత్ యిలా అన్నాడు—"ఇక మనం బయలుదేరుదాం. టకారాలంతా గాఢనిద్రలో మునిగితేలుతూ వుంటారు. యిప్పుడు చాలా సమయం గడిచివుంటుంది. ఒంటిగంట

ఐవుంటుందనుకుంటాను. లేవండి, మీలో వున్న జడ త్వాన్ని, భయాన్ని, పిరికితనాన్ని అన్నింటినీ యిక్కడే వదిలెయ్యండి. వాటి స్థానాల్లో సాహసాన్నీ ధైర్యాన్నీ ఒకవిధమైన తెగింపునీ నింపుకోండి.

"మరో విషయం బాగా గుర్తుంచుకోండి. ఎటువంటి పరిస్థితులలోనూ యెవ్వరూ మాట్లాడకండి. చప్పుళ్ళు చేయకండి. అలా చేస్తే టకారాలు మేలుకుంటారు. వాళ్లే మేలుకోవటం జరిగితే మనం ఈ దీవినించి అంగుళం కూడా కదల్లేము. పైగా ప్రాణాలు పోగొట్టుకుంటాము. చావైనా బతుకైనా అందరికీ ఒక్కటే...."

నల్లమృగాల వేటకు టకారాలు వాళ్ళకిచ్చిన బల్లేలు, కత్తులు వాళ్ళ దగ్గరే వున్నాయి. ఎందుకంటే ఆ రోజుతో నాగరికులకు టకారాలు ఇచ్చే ఆతిథ్యం పూర్తవుతుంది. ఇక తెల్లవారిన తర్వాత వాళ్లు మృగాలను వేటాడి తెచ్చుకుంటేనే ఆహారం. లేకపోతే ఆకలితో మాడి చావాల్సిందే. అందుకే ఆ వేటకు అవసరమైన ఆయుధాలను వాళ్ళ దగ్గర్నించి తీసుకోలేదు.

అంతా ఆయుధాలు తీసుకున్నారు.

నిలుచున్నారు.

• • •

ముందు భారత్, పక్కనే స్టెల్లా....ఆ వెనుక మిగిలిన వాళ్ళంతా నడుస్తున్నారు.

భారత్ మరోసారి అందరికీ హెచ్చరికలు చేశాడు.

కొంతమంది తమనెవరి యేలాంటి ఆటంకం లేకుండా సాగిపోవాలని మనసులోనే దేవుణ్ని ప్రార్థించారు.

ముసలాయన యాంత్రికంగానే నడిచాడు. జరిగేదేదో జరక్క మానదు అనే భావం ఒకటి ఆయన గుండెల్లో

మిగిలిపోయింది.

చిన్నగా నడుస్తున్నారు—చప్పుడవకుండా....

ఇల్లు దాటి మైదానంలోనించి ముందుకు వెళ్ళారు. జాగ్రత్తగా అటూ యిటూ చూసుకుంటూ నడుస్తున్నాడు భారత్. చిన్న మలుపు తిరిగారు.

ఇక అక్కడనించి టకారాలు వుంటున్న యిళ్ళు మొదలైనాయి. నాయకుడి యింటి ముందుకు వచ్చారు.

నాయకుడి యింటి తలుపు మూసి వుంది. లోపలనించి ఎలాంటి అలికిడీ వినిపించటంలేదు.

కొంచెం మార్గంలో ఎదురుగా చీకట్లో కపాచీ దేవత విగ్రహం మరింత భయంగొలిపేలా వుంది. దాన్ని దూరం నించి చూడగానే అందరికీ భయం కలిగింది.

కపాచీ దేవత నిజంగా వుందా?

నిజంగానే వుంటే టకారాలమీది పగతో తన హారంలో వున్న మణిని కాజేస్తుంటే ఆమె వూరుకుంటుందా?

కపాచీ అంటే కాపాడే దేవత అని ఆండ్రూస్ చెప్పాడు. అంటే టకారాలను కాపాడే దేవత విగ్రహం అది.

ఆ దేవత టకారాలకు అన్యాయం జరగనిస్తుందా?

ఇలాంటి భయం అందరి హృదయాల్లోకీ స్లో పాయిజన్‌లా ప్రవేశించింది.

భయంతో అందరూ దేవతా విగ్రహం ముందు నిలబడ్డారు.

ఎంతో యెత్తుగా వుంది విగ్రహం.

తలెత్తి పైకి చూశాడు భారత్. హారం—అందులో మణి నక్షత్రాల వెలుగులో కనపడుతోంది.

గాలి రివ్వున వీస్తోంది.

భారతీయుడు కావటంవల్ల నేమో భారత్ కు సెంటి మెంట్సు ఎక్కువ. సెల్లాకు ఏమీ అనిపించటంలేదు. అతనికి ఆ విగ్రహం మీదకు ఎక్కటానికి కొంచెం వొళ్లు జలదరించింది.

ఈ దేవతలో నిజంగా శక్తి వుందా?

ఉంటే ఏమవుతుంది?

చాలా చిన్నగా సెల్లా భారత్ ను మోచేత్తో పొడి చింది, యింకా యేమిటి ఆలస్యం అన్నట్టు.

మణి గురించి తల్చుకోగానే భారత్ లో తిరిగి తెగింపు వచ్చింది. అంతే—యింకేమీ ఆలోచించలేదు. కళ్ళ ముందు ఆ మణి దివ్యమైన తేజస్సునే వుంచుకున్నాడు. కోట్లు ఖరీదుచేసే దాన్నే దృష్టిలో వుంచుకున్నాడు.

ఒక్కటే ధ్యేయం.

విగ్రహంముందు రాతి మెట్లు వున్నాయి. అక్కడంతా యేవో చెట్ల ఆకులు-తీగలు వున్నాయి. జిగటగా కూడా వుంది. పొడుగాటి కత్తులు రెండు మెట్లమీద పడి వున్నాయి.

అతడి రక్తం పొంగింది.

ఆ రెండు కత్తులే తమలో ఆ యిద్దరి స్త్రీల తలలనూ నరికి వుంటాయి.

టకారాలు! తమకు శత్రువులు.

మెట్లన్నిటినీ ఎక్కాడు. భారత్ కదలికలు అందరికీ అస్పష్టంగా కనపడుతున్నాయి. అంతా భయంగా చూస్తున్నారు. యే క్షణంలో ఏం జరుగుతుందో తెలీదు.

కాళ్ళు వణుకుతున్నాయి.

చలిగాలి కదిలించి వేస్తోంది.

ఒళ్ళు జలదరించే చిత్రమైన ధ్వనిచేస్తూ గాలి వీస్తోన్నది. అంత చలిలోనూ అందరికీ చెమటపోస్తోంది.

రాతిమీద చెక్కిన విగ్రహమే కపాలీ దేవత. పైకి ఎక్కటానికి అనువుగా చెక్కారు. ఎవరు చెక్కారో? ఎన్నో యేళ్ళక్రితం చెక్కిన విగ్రహం అది.

దేవత పాదంమీద కాలు పెడుతున్నప్పుడు భారత్ శరీరం ఎందుకో వణికింది. చీకట్లో చేత్తో తడిమాడు. కాలు ఎక్కడ వుంచటానికి వీలవుతుందో చూసుకుం టున్నాడు.

కింద అంతా ఆత్రంగా చూస్తున్నారు.

సెట్లా దృష్టి అంతా భారత్ మీద వుంది.

భారత్ దేవత మోకాలిమీదకు చేరుకున్నాడు. విగ్రహం నున్నగా వుండి జారుతోంది. ఇంతకుముం దెప్పుడూ చెయ్యని పని అవటంవల్ల యిబ్బందిగానే వుంది. ఐనా మనసంతా ఆ మణిమీదనే వుంది.

ఇప్పుడతని ధ్యేయం ఆ విలువైన మణి.

మనసులో కదులుతున్న అనేక ఆలోచనలను భయాన్ని పక్కకు నెట్టి దృష్టిని ఆ మణిమీదనే కేంద్రీక రించాడు.

విగ్రహం ముందువైపునే ఒకరికొకరు దగ్గరగా నిలు చున్నారు మిగిలినవాళ్ళు. ముసలాయన చేతిలో వంకీ కత్తి వుంది. ఆయన చీకట్లో దాన్ని తడిమి చూశాడు. బాగా పదునుగా వుంది. దారిలో యేదైనా జంతువు యెదురైతే ఆ కత్తితో దాన్ని నరికెయ్యగలడా?

ఊహు....తనకా శక్తిలేదు—ధైర్యంలేదు.

తను ఎన్నడూ అడవులకు వెళ్ళలేదు, యే జంతువుల తోనూ పోరాడలేదు. అటువంటి తనకు ఇక ఆ కత్తితో

ప నేమిటి? బ రు వు గా వుంది. దాన్ని పట్టుకోవటం యిబ్బందిగా వుంది.

అందుకే దాన్ని కిందికి వదిలాడు.

అది కిందవున్న బండరాయిమీద పడి ఖంగుమని చప్పుడయ్యింది.

ఆ చప్పుడుకు అంతా ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. చీకట్లోకి భయంగా చూశారు.

ఏమిటా చప్పుడు? ఎవరు చేశారు?

తెలీలేదు.

నిశ్చలంగా బొమ్మలా నిలబడి వున్నాడు ముసలాయన. తర్వాత యింకేదైనా చప్పుడు వినపడుతుందేమోనని యెదురు చూశారు.

స్టెల్లా — భారత్ కూడా ఆ ఖంగుమన్న చప్పుడును విన్నారు. భారత్ పైకి యెక్కబోతున్న వాడల్లా ఆగి పోయి కిందకు చూశాడు ఏమీ తెలీలేదు. స్టెల్లాను పిల్చి అడుగుదామనుకున్నాడు. కాని అంత యెత్తునించి కింద వున్న స్టెల్లాతో మాట్లాడాలంటే కొంచెం పెద్దగానే మాట్లాడాలి....

తర్వాత మళ్ళీ చప్పుడు కాలేదు.

నిమిషాలు గడుస్తున్నాయి.

గాలి ఒక్కసారి విసురుగా కొట్టింది.

ఏదో ఆలోచిస్తున్న స్టెల్లా ఒక్కసారి వణికిపోయింది. తెలియని భయంతో కంపించిపోయింది.

ఓ మై గాడ్!

మరోసారి గాలిని గట్టిగా పీల్చింది.

అవును, అవును.

సందేహం లేదు.

అదే....అదే వెగటు వాసన. భరించలేని వాసన. యెలక్ట్రిక్ స్మెల్....అంటే....ఇంకేం అంటే....

ఒక్క సెకనుకూడా వృధా చెయ్యలేదు.

కవ్వున గొంతు చించుకొని అరిచింది స్టెల్లా.

"భారత్....టకారాలు."

* * *

దారుణంగా అలుముకున్న నిశ్శబ్దాన్ని స్టెల్లా అరుపు ఛేదించింది. ఆ అరుపుతో దీవంతా మార్మోగిపోయింది.

మవునంగా నిల్చున్న వాళ్ళంతా స్టెల్లా అరుపుతో అదిరిపడి భయంతో తెలీకుండానే పిచ్చిగా కవ్వున అరిచారు.

స్టెల్లా అరుపు వినపడటంతోనే భారత్ ఒక రెప్పపాటు కాలాన్నికూడా వృధాచెయ్యకుండా అంత ఎత్తు మీదనించి ఎగిరి దూకాడు.

ఐతే స్టెల్లా అంచనా తప్పుకాలేదు.

అప్పటికే చీకట్లో టకారాలు, వాళ్ళ నాయకుడు ఈ రెలతో నిశ్శబ్దంగా యేమాత్రం అలికిడి రాకుండా వాళ్ళను సమీపించారు.

ఐనా ఆ వెగటు వాసన వాళ్ళ రాకను తెలియ పరిచింది.

అరుస్తూనే చుట్టూ వేగంగా తలతిప్పుతూ చూసింది. నాయకుడి ఇంటిముందునించి చిన్నగా వస్తున్న టకారాల ఆకారాలు అస్పష్టంగా కనిపించాయి.

దూకటంతోనే ముందుకుతూలి పడబోయాడు భారత్. బలవంతంగా నిలదొక్కుకున్నాడు.

"టకారాలు! పరిగెత్తండి. ప్రాణాలు కాపాడు కోండి. అంతా సముద్రతీరానికి."

అరిచాడు భారత్ ....

అంతే....

ఒక్కసారిగా చలనం....

ఎవరికివారే గుడ్డిగా ఆయుధాలతోనే ముందుకు పరుగుదీశారు.

భారత్ — సెల్లా దగ్గరకు వెళ్లాడు. సెల్లా తన ప్రక్కనే నిశ్చేష్టురాలై వున్న స్త్రీ చేతిని పట్టుకొని విసురుగా లాగుతూ ముందుకు పరుగెత్తింది. ఆ విసురుకు ఆ స్త్రీ తూలిపడబోయింది. సెల్లా అరుపుకే ఆమెకు గుండె ఆగిపోయినట్లనిపించింది.

అల్లకల్లోలం....

అలజడి.. నాగరికులు పారిపోతున్నారని టకారాలలో యెవరో బల్లెం విసిరారు. అది రివ్వున దూసుకువచ్చింది. అంత చీకట్లోనూ అది గురితప్పలేదు.

చావుకేక ....

ఎవరి వెన్నులోనో దిగబడింది.

ఆ చావుకేక ముందుగా పరుగుదీస్తున్న వాళ్ళను భయకంపితులను చేసింది. భయంతోనే కాళ్ళు కదల్లేదు. కాళ్ళకు మేకులు భూమిలోకి దిగ్గొట్టినట్టు అనిపించింది.

తప్పదు.

చావు భయం .... తమలో యెవరో ఒక మనిషి టకారాల బల్లేనికి ఆహారమయ్యాడు. ఆలస్యంచేస్తే తామూ టకారాల బల్లెం వేటుకు దొరక్క తప్పదు.

"పరుగెత్తండి....టకారాలు వెంట తరుముతున్నారు" అంటున్నాడు భారత్ ముందుకు పరుగుదీస్తూనే.

సెల్లా ముందుకు తూలిపడబోయిన ఆ స్త్రీని విసురుగా ముందుకు లాగింది. ఆ విసురుకు ఆమె బోర్లాపడబోయింది.

అరిచింది తన కాలికి బండ తగిలిందంటూ—

సెల్లా గొప్ప సందిగ్ధంలో పడిపోయింది. ఆ స్త్రీ తనతో సమానంగా పరుగుదీయలేక పోతోంది.

చీకటి, ముందు రెండడుగుల దూరంలో యేముందో సరిగ్గా కనపడటంలేదు.

ఐనా ముందుకు పరుగుదీస్తున్నారు ప్రాణభయంతో.

ఈ ఐదు రోజులనించీ భారత్ సముద్రతీరానికి వెళుతూ వస్తూ ఆ దారిని బాగా గుర్తు పెట్టుకున్నాడు. అందువల్లనే కళ్ళను చించుకొని చూస్తూ రివ్వున దూసుకెళుతున్నాడు.

ముందు దూసుకెళుతున్న భారత్‌ను చూస్తూ ఆ స్త్రీని లాగుతూనే పరుగుదీస్తోంది సెల్లా.

సెల్లాను వెనుక వస్తున్న వాళ్ళు అనుసరిస్తున్నారు.

వెనుక టకారాజాతి మనుషులు కిచకిచల భాషలోనే అరుస్తున్నారు—వెంట తరుముతూ....

భారత్‌కు చెమటలు క్రమ్మాయి. భయంతో వళ్లు జలదరిస్తోంది. యిది వూహించని పరిణామం. పొరపాటున కూడా టకారాలు యిలా తమ పథకాన్ని తెలుసుకొని హఠాత్తుగా విరుచుకు పడతారని అనుకోలేదు.

ఇంతకీ టకారాలు తమ పథకాన్ని యెలా తెలుసుకున్నారు? ఎవరైనా చెప్పారా? ఎవరు చెబుతారు? ఒక్క ఆంద్రూస్‌కి ఆ అవకాశం వుంది.

ఆంద్రూస్ ఎందుకు చెబుతాడు? ఈ పథకం గురించి ఆయనేగ తమకు చెప్పింది! టకారాలు ఆంద్రూస్‌కు కూడా శత్రువులే.

అటువంటప్పుడు ఆంద్రూస్ తమ గురించి వాళ్ళకు ఎలా చెబుతాడు?

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెలనెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి.

పొదల మధ్యనించి పరుగెత్తుతున్నాడు. పరుగెత్తుతూనే ఆలోచిస్తున్నాడు. ఆలోచనలను బలవంతంగా పక్కకు నెట్టేస్తున్నాడు.

ఇప్పుడు ఒక్కటే ఆలోచన.

వీలైనంత త్వరగా సముద్రతీరాన్ని చేరాలి.

తెప్పలమీద సముద్రంమీదికి వెళ్ళిపోవాలి.

ఇది సాధ్యమేనా? టకారాజాతి మొరటు మనుషులు తమని ప్రాణాలతో వదులుతారా?

స్టెల్లా ఆ స్త్రీని లాగుతోంది. ఆ స్త్రీ కాలికి దెబ్బ తగిలి అరుస్తోంది.... యేడుస్తోంది....

"నేను పరుగెత్తలేను. కాలికి నెత్తురు కారుతోంది.... నొప్పిగా వుంది.... ప్లీజ్.... నన్నొదులు."

"యూ ఫూల్.... వెనుక ఆటవికులు తరుముతున్నారు ఈటెలతో....క్షణం ఆలస్యం చేసినా మన ప్రాణాలు పోతాయి. క్విక్. పరుగెత్తు....ప్రాణంకోసం పరుగెత్తు."

ఉహూ....ఎంత ప్రయత్నంచేసినా ఆ స్త్రీ పరుగెత్తలేకపోతోంది. అప్పటికే ఆమెకు రొప్పు వచ్చింది. ఆయాసంతో ఆమె గుండెలు యెగిరిపడుతున్నాయి.

అప్పటికే భారత్ వాళ్ళిద్దరికీ దూరంగా పరిగెత్తుతున్నాడు. అరుస్తున్నాడు స్టెల్లాను వేగంగా పరుగెత్తమని. స్టెల్లా పరిస్థితి దారుణంగా మారిపోయింది. ఆ స్త్రీతో వేగంగా పరుగెత్తలేకపోతోంది.

వెనుక వస్తున్న మనుషులు పిచ్చిపట్టినట్టుగా పరుగుదీస్తున్నారు. యెందువల్లనో టకారాలు నాగరికులంత వేగంగా పరుగుదీయలేక పోతున్నారు.

బహుశ ఆ రాత్రి దీవిలో సంచరించే కపాచీ దేవత గురించి వాళ్ళు జంకుతూ వుండొచ్చు. ఐనా వాళ్ళు

వెనుదిరిగి వెళ్ళలేదు.

వెంట తరుముతూనే వున్నారు అరుపులతో.

"స్టెల్లా క్విక్ ...."

దూరంనించి భారత్ అరుపులు వినపడుతున్నాయి.

అక్కడే పొదలు అంతమయ్యి పొడుగాటి చెట్లు మొదలవుతాయి.

ఊహించని విధంగా ఆ స్త్రీ ముందుకు బోర్లా పడిపోయింది. ఆమె చెయ్యి పట్టుకొని వుండటంతో స్టెల్లా కూడా ముందుకు పడబోయి ఆగిపోయింది.

ఆమెను లేవదీసేలోపలే వెనుకనించి వచ్చిన మనుషులు స్టెల్లాను నెట్టుకుంటూ ముందుకు వెళ్లారు.

మళ్ళీ వంగబోయింది స్టెల్లా....

కాని—ఇంతలోనే—

ఓ ఇద్దరు మనుషులు కిందపడిపోయిన ఆమె మీదనించి తొక్కుకుంటూ వెళ్ళిపోయారు. ఆమె బాధతో పెద్దగా ఆక్రందన చేసింది. ఒక మనిషి అడుగులు సరిగ్గా ఆమె గొంతుమీద పడ్డాయి.

కంగారుపడింది స్టెల్లా....

ఆమెకు ఏం చెయ్యటానికీ తోచలేదు. ఆ స్త్రీని వదలటం ఇష్టంలేదు. కాని—

ఇంతలోనే విసురుగా ఒక బల్లెం వచ్చి ఆ స్త్రీ మీదనించి చివరగా పరుగుదీసిన ఇద్దరి మనుషుల్లో ఒక మనిషి వెన్నులోకి సూటిగా—బలంగా చొచ్చుకుపోయింది.

రెండో చావుకేక....

ఆ మనిషి బోర్లా పడిపోయాడు.

ఆ చావు కేకతో నిశ్శబ్దం పేలిపోయింది. ముందు పరుగెత్తుతున్న వాళ్ళంతా చలించిపోయారు. (సశేషం)

